# ఊరు-వాడ

## జూలై సంచికలో



- ఆర్.ఎస్.ఎస్. ఎందుకు?

సంఖ్యాబలం దృష్ట్యా దేశంలోని అతిపెద్ద స్వచ్ఛంద సంస్థ రాష్ట్రీయ స్వయం సేవక్ సంఘ్ ఏ రాజకీయ లక్ష్యాల కోసం పనిచేస్తుంది? వచ్చే ఎన్నికలలో ఈ సంస్థ ఏ పార్టీని సమర్థించబోతోంది.? దేశంలో చెలరేగుతున్న మతకలహాల మారణకాండలలో ఈ సంస్థకు నిజంగా పాత్రవుందా? మొ॥న అంశాల సమగ్ర వివరణ. + ఆర్.ఎస్.ఎస్ ప్రముఖులతో ఇంటర్వ్యూలు బి.జె.పి.నాయకులతో ముఖా ముఖి.

- రామారావు అమెరికా పర్యటన అంతరార్థం ఏమిటి?
- బీహారులో బీభత్సం సృష్టిస్తున్న 'భూమిసేన' పూర్వాపరాలు
- శ్రీ ________ గారి ________ నవల సీరియల్ ప్రారంభం!!
- పాఠశాలల విద్యార్థుల కోసం ప్రత్యేక శీర్షిక!!!

ఇంకా, ఊరు-వాడ పజిల్,క్విజ్,యువచైతన్యం,రెండు చిన్న కథలు
...... మరెన్నో.....ఒకే పత్రికలో......
తెలుగులో వెలువడుతున్న ఏకైక సమగ్ర మాసపత్రిక!!
జూన్ 25కు మార్కెట్లో ఉంటుంది!
ఊరు-వాడ. హైదరాబాద్-500020






ముఖచిత్రం : రజితానందగామిని

చిత్రకారుడు : వడ్డాది పాపయ్య

# యువ

## దీపావళి రజతోత్సవ సంచిక

పాతికేళ్ళ క్రితం ఉత్తమ కాల్పనిక సాహిత్యాన్ని తెలుగు పాఠక లోకానికి అందించాలనే సదుద్దేశంతో ప్రారంభమైన 'యువ' వచ్చే దీపావళికి అత్యంత ప్రత్యేకమైన, ప్రతిష్ఠాకరమైన 'దీపావళి రజతోత్సవ సంచిక'ను మీ అభిరుచులకు దర్పణంలా వెలువడుతోందని ప్రకటించడానికి సంతోషిస్తున్నాం.

తెలుగు కాల్పనిక సాహితీ జగత్తులో రెండున్నర దశాబ్దాల పరిణామ వికాసానికి ఈ సంచిక ప్రయోజనపూరితమైన ప్రతీక.

అప్పటి రచనలు వేరు; ఇప్పటి రచనలు వేరు.

అప్పటి పాఠకులు వేరు; ఇప్పటి పాఠకులు వేరు.

కాల్పనిక సాహిత్యంలో, పాఠకుల అభిరుచుల్లో తరతరాల అంతరాలకు ఈ ప్రత్యేకాతి ప్రత్యేకమైన సంచిక మేలైన వారధిగా నిలుస్తుంది.

రెండున్నర దశాబ్దాల 'యువ'కు ఈ సంచిక ప్రతిబింబం:

రెండు నవలలు....

ఎన్నో కథలు....

మరెన్నెన్నో కార్టూన్లు....

త్రివర్ణ చిత్రాలు....

తెలుగువారి ప్రతి ఇంట్లోనూ తప్పకుండా ఉండాల్సిన ప్రత్యేక సంచిక.

ఈ దీపావళికి ముందుగా వెలువడుతుంది.

మీ కొనుగోలు వ్యయానికి పదిరెట్లు సంతృప్తిని అందించే ప్రత్యేక సంచిక.

ఆ సంచిక కోసం ఇప్పట్నుంచే ఎదురుచూసే బదులు- వెంటనే రిజర్వు చేసుకోండి.




# క్రొత్త ఎక్కువ శక్తివంతమైన సూపర్ 777 డిటర్జెంట్ బార్

**నాణ్యతను గురించిన పొగడ్తలు కేవలం పొగడ్తలే కావనీ, నిజమని నిరూపించే హామీ కూడా ఇస్తుంది.**

ఇప్పుడు క్రొత్త సూపర్ 777 డిటర్జెంట్ బార్‌తో నాకు లభిస్తుంది అన్నిటికంటే ఎక్కువ తెలుపు. దీని డిటర్జెంట్ ఫార్ములా మునుపు కంటే ఎక్కువ మేలైనది. అందుకే ఇది మునుపు కంటే ఎక్కువ నురుగ ఇస్తుంది, ఎక్కువ బట్టలు ఉతుకుతుంది, ఎక్కువ మన్నిక వస్తుంది. అంచేతే ఇది ఇతర అన్ని డిటర్జెంట్ బారులు మరియు సబ్బుల కంటే ఉత్తమమైనది!

వాడి చూడండి... మీరూ విస్తుపోయి చూస్తారు, మరి-మరి దీన్నే కొంటారు.

Shilpi DM 2/83 Tel.

# 1984
# చక్రపాణి అవార్డులు

ఇది 'యువ' రజతోత్సవ సంవత్సరం.

ఇరవై నాలుగున్నర సంవత్సరాలనుంచీ సాహిత్య కాలక్షేపంలో ఒక భాగంగా 'యువ'ను అవిచ్ఛిన్నంగా చదువుతున్నవారు కొన్ని లక్షలమంది పాఠకులున్నారు. వారి సాహిత్య అభిరుచుల్ని, ఆసక్తుల్ని, అభిలాషల్ని పోషిస్తూ 'యువ' నెలనెలా అభివృద్ధిచెందుతూ ఈ తరహా మాస పత్రికలకు శిరోమణిగా నిల్చిందని ప్రత్యేకంగా చెప్పనక్కర్లేదు. అందుచేత 1984 సంవత్సరపు చక్రపాణి అవార్డులకు విశేషమైన ప్రాధాన్యముంది. ఈ ప్రాధాన్యతను గుర్తించి సాహిత్యంలో చిరస్థాయిగా నిల్చే శ్రేష్ఠమైన రచనలు పంపించి, మా కృషికి ఇతోధికంగా దోహదం కల్పించమని రచయితల్ని, రచయిత్రుల్ని కోరుతున్నాం.

## అవార్డుల వివరాలు

నవల :

| | | |
|---|---|---|
| మొదటి అవార్డు | — | రూ. 4,000 |
| రెండో అవార్డు | — | రూ. 2,500 |
| మూడో అవార్డు | — | రూ. 1,500 |

కథానిక :

| | | |
|---|---|---|
| మొదటి అవార్డు | — | రూ. 1,000 |
| రెండో అవార్డు | — | రూ. 750 |
| మూడో అవార్డు | — | రూ. 500 |

## నియమ, నిబంధనలు

1. రచనలు తెలుగువారి సమకాలీన సామాజిక జీవనాన్ని చిత్రించి, పాఠకుల అభిరుచులకు అద్దంపట్టేవిగా ఉండాలి.
2. నవల అరఠావు సైజులో 70-80 పేజీల మధ్య ఉండాలి.
3. కథానిక అరఠావు సైజులో 12 పేజీలకు మించకుండా ఉండాలి.
4. అనువాదాలూ, అనుసరణలూ పనికిరావు. రచన స్వంతమేననీ, దేనికీ అనువాదం, అనుసరణ, ఆధారం కాదనీ హామీపత్రాన్ని ప్రతి రచనకూ జతపర్చాలి.
5. అవార్డులకు పంపే రచనల కవర్లపై '1984 చక్రపాణి అవార్డుల కోసం' అని స్పష్టంగా వ్రాయాలి.
6. అవార్డులు పొందని నవలలు, కథల్ని కూడా 'యువ'లో సాధారణ ప్రచురణకు స్వీకరించే హక్కు మాకున్నది.
7. అవార్డులు లభించని రచనల్ని తిరిగి పొందగోరేవారు తగినన్ని తపాళా బిళ్ళలు అంటించిన కవర్లను విడిగా తప్పకుండా జతపర్చాలి. లేకపోతే వాటిని తిప్పిపంపడం సాధ్యంకాదు.
8. అవార్డులను ఇచ్చే విషయంలో 'యువ' సంపాదకునిదే తుది నిర్ణయం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు అవకాశం లేదు.

అవార్డుల కోసం నవలలు, కథలు మాకు చేరవల్సిన ఆఖరు తేదీ 14, ఆగస్టు 1984.

సంపాదకుడు, యువ

# యువ

సచిత్ర మాసపత్రిక

సంస్థాపకులు : చక్రపాణి

సంపుటి 50 జూలై 1984 సంచిక 1


మే 20 న దేశంలో వివిధ రాష్ట్రాల్లో విధానసభలకు ఉపఎన్నికలు జరిగాయి.

వాటి ఫలితాల్ని సమీక్షించుకొంటే వివిధ రాష్ట్రాల్లో కాంగ్రెస్(ఐ) బలం నీటిప్రవాహానికి ఇసుకదిబ్బలు కరిగినట్టుగా కరిగిపోతూన్నట్టు స్పష్టమవుతోంది. మొత్తంమీద సగం సీట్లు కూడా గెల్చుకోలేని దుస్థితికి దిగజారింది. అన్నింటి కంటే శోచనీయమైన స్థితి - కొన్ని వందల సంవత్సరాల రాజకీయ చరిత్ర, కొన్ని దశాబ్దాలపాటు అధికారాన్ని చెలాయించి ఇంకా అధికారంలో కొనసాగుతూన్న పార్టీకి ఒకచోట డిపాజిట్ పోవడం.

మన రాష్ట్రంలో ఎన్.టి.ఆర్. నాయకత్వంకింద తెలుగుదేశం పార్టీ ప్రభంజనంలా అధికారంలోకి వచ్చి సంవత్సరంన్నరైంది. ఈ సంవత్సరంన్నర కాలంలో తెలుగుదేశం ప్రభుత్వం కొన్ని విప్లవాత్మకమైన, వివాదాస్పదమైన మార్పుల్ని ప్రవేశపెట్టింది. వాటిని కొన్ని వర్గాల ప్రజలు హర్షంతో ఆహ్వానించారు, ఆమోదించారు. మరికొన్ని వర్గాల ప్రజలు ఆగ్రహంతో నిరసించారు: నిందించారు. ఉద్యోగుల పదవీ విరమణ వయస్సు 58 నుంచి 55కు తగ్గించడం, గ్రామాధికారుల్ని తొలగించి మండలి వ్యవస్థను ఏర్పాటుచేయడం, కాపిటేషన్ ఫీజు రద్దు మొదలైన మార్పులపట్ల కొన్ని వర్గాలవారు తీవ్రమైన అసంతృప్తిని

---

ఇది 'యువ' రజతోత్సవ సంవత్సరం

వ్యక్తపర్చి, ఆందోళనకు పూనుకున్నారు. ఈ ఉపఎన్నికల్లో కాంగ్రెస్(ఐ) పార్టీవారు ఎన్టీఆర్ ఆవేశపూరిత ఆలోచనల్ని, విధానాల్ని అస్త్రాలుగా ఉపయోగించి వోటర్లను తమవైపు లాక్కోవడానికి విశ్వప్రయత్నం చేశారు. కాని ఫలితం శూన్యం. రాజకీయ అంచనాలు తల్లక్రిందులయ్యాయి. బందరులో ఓడిపోవడం, ఆసిఫ్‌నగర్‌లో డిపాజిట్‌ను కోల్పోవడం— కాంగ్రెస్ (ఐ)కి గోరుచుట్టుపై రోకటిపోటే అయింది మరి. ఆసిఫ్‌నగర్ నియోజకవర్గంలో తెలుగుదేశం పార్టీ గెలవకపోయినా, మజ్లిస్‌కు సమఉజ్జీగా నిల్చింది. ఇప్పుడు వీస్తున్న గాలి ఎన్టీఆర్‌కు అత్యంత అనుకూలంగానే వుందని రాష్ట్రంలోని ఉపఎన్నికల ఫలితాలు నిరూపించాయి. ఎవరెంత వ్యతిరేక ప్రచారం చేసినా, ఎన్టీఆర్ నిర్ణయాలు, విధానాలు కొన్ని వర్గాలవారికి నచ్చకపోయినా ఆయనపట్ల జనాదరణ, సమ్మోహనశక్తి ఏమాత్రం తగ్గలేదని చెప్పవచ్చు. ఆంధ్రప్రదేశ్‌ను అభ్యుదయపథంలో ముందంజవేయించాలని హరిజనులకు బలహీన వర్గాలకు ఆర్థికాభ్యుదయం చేకూర్చాలని, తెలుగు సంస్కృతిని, వికాసాన్ని, ఆత్మగౌరవాన్ని కాపాడాలని ఎన్టీఆర్ చేసే కృషిని, చిత్తశుద్ధినీ, నిజాయితీని సామాన్యప్రజలు శంకించడానికి ఆస్కారం లేకపోవడంతో ప్రజల్లో ఆయనకున్న పలుకుబడీ, ప్రతిష్ఠలు చెక్కుచెదరడం లేదనవచ్చు.

మన రాష్ట్రంలో కాంగ్రెస్(ఐ) పార్టీ దీర్ఘకాలిక వ్యాధికి గురైందని ఆ మధ్య ఓ రాజకీయ పండితుడు వ్యాఖ్యానించాడు. కాంగ్రెస్(ఐ) పార్టీమీద ప్రజల్లో వ్యతిరేకత ఒక్కరోజులో వచ్చింది కాదు. క్రమంగా ఏళ్లతరబడి కరుడుకట్టుకుపోయినటువంటిది. దాన్ని ప్రజల మనస్సులోంచి పోగొట్టాలంటే నాయకత్వంలో మార్పు ఒక్కటే సర్వరోగనివారిణి కాదు. పార్టీ నాయకులు ప్రజల్లోకి బాహాటంగా చొచ్చుకుపోవాలి. తమ పార్టీ ఆశయాలకూ తమ ఆచరణలకూ వ్యత్యాసమేమీ లేదని ప్రజలు విశ్వసించే రీతిలో నిరూపించుకోవాలి. చెట్టు పేరు చెప్పుకొని కాయలమ్ముకొనే ప్రవృత్తిని విడనాడాలి. ఈ ప్రజాస్వామ్యంలో రాజకీయ నాయకులు కేవలు వాగ్దానాల ద్వారాగానీ, ఆశలు కల్పించడం ద్వారాగానీ, అరిచేతిలో స్వర్గం చూపెట్టడం ద్వారాగానీ ఎక్కువ కాలం ప్రజల మద్దతును పొందలేరు. తాము చెప్పింది చేసి చూపెట్టినప్పుడే ఏ పార్టీనైనా అభిమానిస్తారు. ప్రజల్ని ఎల్లప్పుడూ గొర్రెలమందలాగా భావించడం ప్రజాస్వామ్య నాయకుల ప్రాథమిక దోషం. 'వోటు' అనే ఆయుధం ప్రజల దగ్గరున్న మహాశక్తి అని మర్చిపోరాదు. అది ఏ పార్టీ ప్రభుత్వం కానివ్వండి ప్రజల విశ్వాసాన్ని కోల్పోయినప్పుడు పతనంకాక తప్పదు. ప్రజాస్వామ్యంలో ప్రజలకున్న ఈ మహత్తర శక్తిని గుర్తించి, ఏ ప్రభుత్వమైనా మసులుకోవాలి మరి.

---

దేశం మొదటి పంచవర్ష ప్రణాళికా కాలంలో ఉన్నప్పుడు సుబ్బారామయ్య ఆ కాలేజీలో అర్థశాస్త్రోపన్యాసకునిగా చేరాడు. ఆంధ్ర విశ్వకళాపరిషత్తులో ప్రథమ శ్రేణిలో ఎకనామిక్స్ ఆనర్స్ ప్యాసై నేరుగా లెక్చరర్ అయ్యాడు. అతనికి మొదట్నుంచీ టీచింగ్ అభిరుచిగల, ఆసక్తిగల విషయం. అందుచేతనే ఐ.ఏ.ఎస్. పరీక్షలో నెగ్గి, ఇంటర్వ్యూలో ఉత్తీర్ణుడు కాగల నైపుణ్యాలు ఉన్నప్పటికీ కాలేజీ లెక్చరర్ ఉద్యోగం పట్లనే మొగ్గుచూపి, ఆ వృత్తికే రిటైర్ అయ్యేదాకా అంటిపెట్టుకొని వున్నాడు. అతనికంటె తక్కువ శాతం మార్కులు తెచ్చుకున్న మిత్రులు ఐ.ఏ.ఎస్. ప్యాసై ప్రిన్సిపల్ సెక్రటరీగానూ, ఐ.ఆర్.ఎస్. తెచ్చుకొని ఇన్‌కంటాక్స్ కమీషనర్‌గానూ, మరొకతను కస్టమ్స్ కలెక్టర్‌గానూ ఉన్నారు. కాని సుబ్బరామయ్యకు ఏటా కొన్ని వందలమంది విద్యార్థులకు అర్థశాస్త్ర సూత్రాలను, ఆచరణలో వాటి ప్రభావాలను బోధించడంలోనే ఎక్కువ ఆత్మసంతృప్తి కలగసాగింది. కనీసం పిహెచ్.డి. చేసి అయినా విశ్వవిద్యాలయంలో ఆచార్య పదవిని పొందుదామనే తలంపు అతనికి కలగలేదు.

తరగతి గది బోధనలో సుబ్బరామయ్య గొప్ప కీర్తిప్రతిష్ఠల్ని గడించాడు- అటు విద్యార్థుల్లో, ఇటు సహాధ్యాయుల్లో. అతని విద్యార్థుల్లో ప్రభుత్వంలో, పారిశ్రామిక సంస్థల్లో, విదేశీ సర్వీసుల్లో గొప్పగొప్ప స్థానాల్ని అధిష్ఠించినవారు ఎంతోమంది వున్నారు. వాళ్ళంతా కాలేజీ జీవితాన్ని నెమరువేసుకొనేటప్పుడు సుబ్బరామయ్య ఉపన్యాసాల్ని గుర్తుకుతెచ్చుకుంటూ వుంటారు. ఎవరు ఎప్పుడు సుబ్బరామయ్యకు తటస్థపడ్డా 'మాస్టరుగారూ! కులాసాయేనా!' అని ఆప్యాయంగా అడుగుతారు. అట్లా ఎవరైనా అడిగినప్పుడు తన జీవితం ధన్యమైనంతగా సుబ్బరామయ్య సంబరపడిపోతాడు.

సుబ్బరామయ్య అంత సులభంగా అర్థమయ్యే మనిషి కాదు. కేన్స్ వ్రాసిన 'ఎ ట్రిటైజ్ ఆన్ మనీ' అనే గ్రంథం అర్థంచేసుకోవడానికి ఎంత కష్టమో, సుబ్బరామయ్యను అర్థంచేసుకోవడం కూడా అంత కష్టమే. అతని

## జూలై నెల భావపరిచయ పోటీ

## బహుమానం రూ. 25-00




ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

*గమనిక :* వ్యాఖ్యలు పోస్టుకార్డుపై వ్రాసి జూన్ 25వ తేదీలోగా పంపాలి.

---

## జూన్ నెల భావపరిచయ పోటీ

## రు. 25-00 బహుమతి పొందిన వ్యాఖ్య

"జంట గొడుగు వేడుక
సోమరి పాలిట కానుక"

— టి. యస్. బాబూరావు
గుంతకల్లు

బ్రహ్మచారి. రిటైర్‌మెంట్ కాబోతున్నా పెళ్ళి ప్రసక్తి ఎత్తడు. అతనికి స్నేహితులు బహుకొద్దిమంది మాత్రమే. అతనికి ఏ దురలవాటూ లేదు. కాఫీ తాగడు. వక్కపొడి తినడు. సిగిరెట్లూ, ఆల్కహాల్ డ్రింకులూ, పేకాట మొదలైనవాటికి ఎన్ని మైళ్ళ దూరంలో వుంటాడో చెప్పడానికి లేదు. ఎప్పుడైనా సరదా పుడితే సినిమాకు వెళతాడు. అదైనా సంవత్సరానికి ఒకటో, రెండో.

సుబ్బరామయ్య 'సుగుణాల రాశి' అని అందరూ చెప్పుకుంటూ వుంటారు. అయితే అతను జీవితంలో బ్రహ్మచారిగా వుండిపోవడానికి కారణాల్ని మాత్రం రకరకాలుగా చెప్పుకోవడం కద్దు. అంటే చెడుగా కాదు. ఒక ప్రేమలో విఫలమై ఆజన్మాంతమూ పెళ్ళిచేసుకోకుండా ప్రతిజ్ఞపట్టాడనీ, అతనికి స్త్రీ జాతిమీద ద్వేషభావం పెరిగిపోయిందనీ, అతనికి నచ్చిన స్త్రీ యింతవరకు తటస్థపడలేదనీ– ఇట్లా. ఎవరైనా 'ఏం సుబ్బరామయ్యా! ఈ జన్మకు పెళ్ళి లేదా?' అని అంటే తామరాకుమీద నీటిబిందువులా చిరునవ్వు నవ్వి వూరుకుంటాడు. అంతేగాని సూటిగా సమాధానం చెప్పడు. ఏది ఏమైనా సుబ్బరామయ్యను గురించి ఎవ్వరూ ఎప్పుడూ చెడుగా చెప్పుకోవడం జరగలేదు.

సర్వీసులో చేరిన దగ్గర్నుంచీ సుబ్బరామయ్య ఆ టవున్లో ఒకే పేటలో ఒకే ఇంట్లో వుండసాగాడు. ఎనభై రూపాయల అద్దె మొదట్లో ఇచ్చేవాడు. ఇప్పుడు రెండొందల ఎనభై రూపాయల అద్దె యిస్తున్నాడు. అన్ని ఏళ్ళనుంచీ ఒకే హోటల్లో భోజనంచేస్తున్నాడు.

ఇంకా ఆరునెలలకు ఏభైఅయిదేళ్ళు వచ్చి రిటైర్ అవుతాడనగా సుబ్బరామయ్య జీవితంలో ఒక సంఘటన జరిగింది. అదో రకంగా దుర్ఘటనే! నెల రోజుల క్రితం పనిమనిషి మానేస్తే, ఇంటి యజమానురాలు మరో పనిమనిషిని కుదిర్చింది. ఆ పనిమనిషి పేరు సుందరమ్మ. వయస్సు ముప్పైఅయిదేళ్ళు వుంటాయి. ఎర్రగా, బొద్దుగా తడిసిన తవుడు బస్తాలా వుంటుంది. ఆమెకు అసలు మొగుడు ఎప్పుడో చచ్చాడు. ఇప్పుడు మొగుళ్ళు ఎంతమందో ఎవ్వరికీ తెలీదు. ఆమె చెడిపోయిన మనిషని ఇంటి యజమానురాలుకు తెలుసు. కాని గత్యంతరం లేక తాత్కాలికంగా మరో పనిమనిషి దొరికేదాకా పెట్టుకుందామని పెట్టుకుంది. అయితే ఆ విషయాన్ని ఆవిడ సుబ్బరామయ్యతో చెప్పలేదు.

సుబ్బరామయ్య ఇంట్లో చాలమంది పనిమనుషులు పనిచేశారు. అతనింట్లో పెద్దగా పని వుండదు. ఇల్లు వూడవడం, నీళ్ళు పట్టడం, బట్టలు ఉతకడంలాంటి

చిల్లరపనులే. ఆ పనులకే అతను నలుగురికంటే నాలుగు రూపాయలు ఎక్కువ యిస్తాడు.

ఎవ్వరిలో ఏనాడూ కనిపించని అందాలూ, ఆకర్షణలూ సుందరమ్మలో కనిపించాయి సుబ్బరామయ్యకు. ఆమె మాటతీరూ, నడక వొంపులూ, కళ్ళల్లో అనిర్వచనీయమైన ఆకర్షణా, ఆ వయసులో కూడా బిగువు సడలని రొమ్ము కట్టూ, ఇంకా ముడతలు పడని నడుమూ, గుండ్రటి భుజాలూ- ఏళ్ళతరబడి కాపాడుకొస్తూన్న సుబ్బరామయ్య బ్రహ్మచర్యంపై సవాలు చేయసాగాయి. ఎందుకో ఆమె ఇంకా అయిదునిముషాలపాటు ఇంట్లోనే వుంటే బావుంటుందను అనిపించసాగింది.

ఓ రోజు సాయంకాలం సుందరమ్మ "సినిమా కెళతాను, ఓ రెండు రూపాయలిప్పించండి బాబూ!" అంది.

"నువ్వొక్కదానివేనా! మరెవ్వరితోనైనానా?" అన్నాడు సుబ్బరామయ్య చమత్కారంగా.

"ఎవరొస్తే వాళ్ళతో" అంది సుందరమ్మ కళ్ళు సుతారంగా తిప్పి.

ఆ మాటల వెనుక అర్థం సుబ్బరామయ్యకు బోధపడలేదు. ఇంకా కాస్త ముందుకెళ్ళి 'ఆడవాళ్ళా? మగవాళ్ళా?' అని అడుగుదామనుకొని ధైర్యంచాలక అయిదురూపాయల నోటు ఆమె కిచ్చాడు సుబ్బరామయ్య. ఆమె పైట కాస్త తొలగించి వొయ్యారంగా చిరునవ్వు నవ్వి వొళ్ళంతా కదిలిస్తూ బయటకు నడిచింది.

ఆ రోజంతా సుబ్బరామయ్య ఆలోచనల్లో సుందరమ్మ సుందర విగ్రహమే ఈస్ట్‌మన్ కలర్‌లో మెదిలింది.

ఆ రాత్రంతా ఆలోచించి కొన్ని నిర్ణయాలకొచ్చాడు సుబ్బరామయ్య. సుందరమ్మ సౌందర్యం తనకు అందుబాటులో వున్న వస్తువు. ఆ వస్తువును తాను కోరుకోవాలేగానీ ఆమెనించి అభ్యంతరం ఉండదు. స్త్రీ అనుభవం ఇంత సులభసాధ్యమైనప్పుడు, అది అలభ్యం కానప్పుడు జీవితంలో ఒక్కసారి ఆ అనుభవాన్ని పొందడంలో తప్పేమిటి? కోర్కెకు వయస్సుతో నిమిత్తమేమిటి?

ఆ మరునాడు సుందరమ్మ వచ్చింది. తెల్లచీర, వాడిన మల్లెపూలు, 'బ్రా' లేని తెల్లటి వాయిల్ జాకెట్టు, సెక్స్ మ్యాగ్నెట్‌లా గోచరించింది. నడివయస్సులోని స్త్రీ సౌందర్యమంతా ఆమెలో ముమ్మూర్తులా మూర్తీభవించి నట్లుంది. సుబ్బరామయ్యలోని అర్థశాస్త్రపరిజ్ఞానం అదృశ్యమై, వాత్స్యాయనుని

దగ్గరకొచ్చి గమనించండి

# సూపర్ రిన్
## చిమ్ముతూన్న మరింత తెల్లదనం
### దీనికి సరిపడే డిటర్జెంట్ బిళ్ళ మరొకటి లేదు.

సూపర్ రిన్ తెల్లదనం
మిరుమిట్లు గొల్పుతుంది :
దగ్గరగా వచ్చి చూడండిక.
ఆకర్షణీయమైన, కొత్త ర్యాపర్,
మరి దాంతోబాటే తాజాదనం
ఇందే సరికొత్త సువాసన!




హిందూస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

కామసూత్రాలు స్ఫురణకొచ్చాయి. ఆడదాన్ని ఆలింగనం ఎరుగని అతని దృఢమైన శరీరంలో ఒక్కసారి కోర్కెల కామజ్వాల పుట్టుకొచ్చింది.

మంచం పక్కగా వొంగి కను పూడుస్తున్న సుందరమ్మ రొమ్ముల సైజు అతనిలో ఉడుకురక్తం లాంటి ఉద్రేకాన్ని రగిల్చింది. వెంటనే సుబ్బ రామయ్య ఆమెను కౌగిలించుకున్నాడు.

ఆ అవకాశంకోసం ఆజీలుగా వున్నట్టు సుందరమ్మ ముసిముసి నవ్వులు నవ్వుతూ సుబ్బరామయ్య బాహువుల్లో రబ్బరుబొమ్మ అయిపోయింది. ఎన్ని నిముషాలు గడిచాయో తెలీదు. అరగంట తర్వాత ఆమె బయటికి వెళ్ళేటప్పుడు యాభై రూపాయల నోటు యిచ్చాడు సుబ్బరామయ్య. ఆ నోటును అతని ముందే నిస్సిగ్గుగా జాకెట్‌లో దోపుకుంది.

ఆరోజు మధ్యాహ్నానికి గానీ సుబ్బరామయ్యకు తెల్సిరాలేదు- తాను జీవితంలో మొదటిసారిగా చేసిన తప్పు సంగతి. అప్పట్నుంచీ అతనికి మతి భ్రమించసాగింది. వెంటనే సెలవుపెట్టి కాలేజీనుంచి ఇంటికొచ్చాడు.

ముసిముసి నవ్వులతో పనిచేయటానికి ఇంటికొచ్చిన సుందరమ్మతో, "ఇక నువ్వు మా ఇంట్లో పనికి రానక్కర్లేదు" అని నిర్మొహమాటంగా చెప్పాడు.

సుందరమ్మ వెంటనే కొయ్యబారిపోయినా, ఆ తర్వాత తేరుకొని కోపం తెచ్చుకుంది. సుబ్బరామయ్య తనని ఒంటరిగా బలవంతం చేయబోయాడని ఆ వీధిలో టాంటాం వేసింది. ఆ వార్త గాలికంటె వేగంగా కాలేజీని చేరింది. క్లాస్‌రూం బోర్డుకూడా ఎక్కింది.

సుబ్బరామయ్య తల వొంచుకున్నాడు. తన బలహీనతకు తనే పశ్చాత్తాపాగ్నితో క్రుంగిపోయాడు.

ఆర్నెల్లు ముందుగా ఉద్యోగంనుంచి రిటైర్ అయ్యాడు సుబ్బరామయ్య. పాల్ శామ్యూల్‌సన్ ఆర్థిక సిద్ధాంతాలపై పరిశోధన మొదలెట్టాడు.

*వ్యవహార జీవనంలో మన సుగుణాలకంటే దుర్గుణాలే ఎక్కువగా ఇతర్లను ఆకర్షిస్తాయి.*

---




తళతళలాడే పంజరం_ పంజరంలో పంచరంగుల రామచిలుక....చిలుక పలికే ముద్దుపలుకులు.... ఊ కొడుతూ తిరిగే ఊర్మిళ- ఆ దృశ్యాన్ని రోజూ చూస్తూ ఆవేదనపడే ఎదురింటి విజయ.

"ఏదో విధిలేక నవ్వుతూ తిరిగే ఊర్మిళత్త - గుండెల్లో అనుక్షణం పేలుతున్న అగ్నిపర్వతాలు. వాటి తాకిడికి తట్టుకుంటూ ఇంటిపని వంటపని పిల్లలు వాళ్ల సంరక్షణ.... ఏడేళ్ల నుంచీ ఆ దృశ్యాన్ని చూస్తూ ఎలా నిగ్రహించుకోగలుగుతోంది చెప్మా?" తనలో తానే ప్రశ్నించుకుంది.

"చూస్తున్న నాకే మనసెంతో దిగులుగా వుంటుంది! తానెలా నిగ్రహించుకో గలుగుతుంది!"

ఎప్పటికప్పుడు అడుగుదామని అడగలేకపోతోంది. అనా దెలాగైనా అడగాలనుకుంది. అవకాశం చిక్కినట్టు రామచిలుక విజయను పట్టిపట్టి పిలుస్తోంది. జామిపండుతో మెల్లగా పంజరం వద్దకు వెళ్లింది.

"తలుపు తెరవకు విజయా! పారిపోగలదు. ఆ ఊచల మధ్యనుంచి పండును అందించు"

"స్వేచ్ఛగా తిరిగే ఇంతందమైన చిలుకను జీవితాంతం పంజరంలో బంధించటమేనా ఊర్మిళత్తా."

"సున్నితమైన మనసున్న మనమలా అనుకుంటామా! మగవారలా అనరు.... దానికేం! తళతళలాడే పంజరం. పిలిచినప్పుడల్లా కోరిన తిండి. విడిచిపెట్టామో ఏ డేగపాలేగా దాని జీవితం! పిట్టలు పట్టేవాడు ఇట్టేపట్టి రెక్కలు కత్తిరించి నడిబజార్లో పెట్టి అమ్ముకుంటారు. అన్ని పాట్లు పడేకన్నా యీ పంజరం బ్రతుకే నయంగా అంటారు." అంటూ అమాయకంగా విజయ చేతివి నిమిరింది ఊర్మిళ.

"అందరు మగాళ్లు అంతేనంటావా అత్తమ్మా?"

"అందరూ ఒకేలా వుంటారా! రకరకాల మనుష్యులు- జీవితంలో పెళ్లిళ్లు జరుగుతుంటాయి. అదృష్టం కలిసివస్తే దంపతుల ఆశయాలు ఒకటి కావచ్చు.... అప్పుడప్పుడు బేధిస్తే వాళ్ల బ్రతుకులదోలా వుంటాయి." అంది పెదవిని కరచిపట్టి.

"నీ కెందుకేంటని అడిగితే చెప్పలేను కాని మామయ్య మోటర్సైకిల్ మీద ఆ అత్తతో అంత చనువుగా తిరుగుతుంటారు. మీకూ యీ రామచిలుకకూ దగ్గరి పోలికలున్నాయి. ఈ బంగారు పంజరంలో అన్నీ వున్నాయి, భర్త ఆదరణ తప్ప- ఆ దృశ్యాన్నిచూసి ఎలా ఓర్చుకోగలుగుతున్నారు."

ఊర్మిళ తిరుగు సమాధానం చెపుదామనే సంశయిస్తోంది. నేలను కాలి వేళ్లతో జాలిని సూచించే విధంగా రాస్తోంది.

"అదే ఆడది పరపురుషునితో తిరిగితే మగాడు సహించడు కదా నరికి నాలుగు ముక్కలు చేస్తాడు. మీ మనసు రంపపుకోతకు గురవుతుందని పెళ్లి కాని నేనే గ్రహించుకోగలుగుతున్నాను. అగ్నిసాక్షిగా పెండ్లాడిన మీరు అంత బాధను గుండెల్లో ఎలా దాచుకోగలుగుతున్నారు ఊర్మిళత్తమ్మా!"

"యీ దేశపు ఆడదానిని. నిస్సహాయురాలిని- వంటఇంటి కుందేలును. నా దగ్గర అంతకన్న ఏ సమాధానమూ లేదు విజయా! బంధువులందరూ ఏవేవో ప్రశ్నలు- నీ అంగీకారం పొందే ఆయనట్లా తిరుగుతున్నాడా అని- తెగించిన మగాడికి ఆడదానికి ఆజ్ఞ కావాలేం? ఏ ఆడది భర్తను మరో ఆడదానితో తిరగమని చెపుతుంది? కథల్లో ఇలాంటి విషయాలు పొందుపరచవచ్చుగాని నిజజీవితంలో కుదరనే కుదరవు. నేనొక విషయం మాత్రం కనిపెట్టగలిగాను. నేనంతగా చదువుకోలేదు. దగ్గరి సంబంధం- కాదనలేకపోయారు. పిల్లలు కనటానికి నేను కావలసొచ్చింది. అందరిలో సోషల్‌గా తిరగటానికి సాధన కావలసి వచ్చింది.... విజయా! రోజూ నావైపు అమాయకంగా జాలిగా చూస్తుంటావు. ఇది ఏనాడో నేను కనిపెట్టిన విషయం....ఆగలేక అభిమానంకొద్దీ యీనాడది అడిగావు. నా విషయం ఇలా తెల్లవారనీ.... పెళ్లి కావలసినదానివి.... నీకు మంచి సంబంధం రావాలని కోరుకుంటున్నానమ్మా!"

"మంచి సంబంధం?.... వస్తున్నారు- పోతున్నారు. ఇంత అందాన్ని ఏ ఒక్కరూ కోరటంలేదు. నాన్న నుంచి హెచ్చు కట్నంకోసం పిచ్చిగా ప్రాకులాడుతున్నారు." అంటుండగా రామచిలుక "బాస్! బాస్!" అని అరవ మొదలుపెట్టింది.

విజయ కంగారుగా లేచి ఊర్మిళ భర్తరాక గమనించి తన ఇంటికి పోయింది. భాస్కర్ సాధనతో ఇంట్లో అడుగుపెట్టాడు. పంజరాన్ని కదపి రామ చిలుకను పలుకరించాడు. సాధనతో లోనికి పోతున్నాడు. వారివైపు ఎదురింటి విజయవైపు ఊర్మిళ మౌనంగా చూస్తోంది.

"ఒక ఒరలో రెండు కత్తులు.... సాధ్యమా?" అనుకుంటూ లోనికిపోయి తలుపులు మూసుకుంది విజయ. ఎరుపెక్కిన బుగ్గల్ని ముఖాన్ని ముంగురుల్నీ అద్దంలో తనివితీరా చూసుకుంది. నాన్న కంటున్న కలలు బంగారు కలలు కావాలని ఎవ్వరూ చూడకుండా గోప్యంగా అద్దాన్ని ముద్దుపెట్టుకుంది. ఎంగిలి పడి లేచి కుర్చీలో కూర్చుని సంఘపు చిరుగుల్ని కుట్టడానికి శాయశక్తులా కృషిచేసి చివరకు దుర్మరణంపాలైన ఓ యువకుని గాథను చదివి కాసేపు నిద్రపోయింది.

"విజయా! సాధనలాంటి సవతి నీ జీవితంలో తటస్థపడితే సహిస్తావా? ఊర్మిళత్తలా ఓర్పుతో నిగ్రహించుకోగలవా?...."

"నే మాత్రం సహించలేను విజయా! మా ఆయన ప్రక్క మరో ఆడది నన్ను ఆమడ దూరముంచి తానే సర్వాధికారిణిలా తిరిగితే మాత్రం సహించేది లేదు. అలాంటి మగవాడిని నేను తృణీకరించగలను కూడా!"

"భర్త అండదండలులేని ఆడది పూట గడిచేదెట్లా? ఆకలి- మరోవైపు అవమానం."

"గాయపడిన హృదయానికి యీ రెండూ సహించడం కష్టమే! అందుకే పొట్టకూటికి చాకిరీ- అగ్నిహోత్రుని సాక్షిగా అందరి సమక్షంలో సలక్షణంగా రంగుల వైభవంతో పెండ్లాడి అత్తవారింటికి వెళ్లిన ఆడదానికి ఆదరణ కరువైతే చేసేదేమిటి? ఎదురీత తప్పదు. అలసి అలసి కొనఊపిరి వరకూ అదే చాకిరీ! ఆడది ఉసురుమంటే మగాడు దహించుకుపోతాడు. తప్పదు. ఇది తరతరాల నుంచీ వస్తున్న శాప్యం."

కలతతో కళ్లు తెరిచింది.

మళ్ళీ మోటార్ సైకిల్ స్టార్టువేసి సాధనతో ఏ మేటనికో పోతున్న భాస్కర్‌ను చూసింది. కసితో కోపంతో పళ్లు పటపట కొరికింది.

"ఊర్మిళత్తకు లేని బాధ నీ కెందుకే విజయా?"

"తోటి ఆడదానిని. నిగ్రహించుకో లేకపోతున్నాను. ఈ నాడు ఊర్మిళ- రేపు నేను- అదే ఆడది చేస్తే సహించే ఒక్క మగాడున్నాడేమో చూపించు." అంటూ అక్కడే చతికిలబడిపోయింది.

ఇంతలో తండ్రి రాఘవయ్య కాళ్లీడ్చుకుంటూ వచ్చాడు.

"ముందు భోజనం కానీయండి నాన్నా! వెళ్లినపని ఏమైందీ తర్వాత చెపుదురు గాని" అంటూ వడ్డించింది.

రాఘవయ్య భోజనం చేశాడు.

వక్కపొడి నములుతూ విజయవైపు అమాయకంగా చూశాడు.

"నాకు సరిపడని సంగతులైతే మాత్రం చెప్పకండి నాన్నా!"

"మాటవరుసకైనా అనుకోవాలి కదమ్మా!.... కట్నం, నగలు, పొలంకూడ కావాలట. ఒకప్పుడు బాగా బ్రతికామని చెప్పుకోవడంలో వచ్చిన అనర్థం- వరదల్లో ఉన్న భూమంతా మునిగి చెరువుమాత్రం మిగిలింది. ఇది నాదని చెప్పు కోవటానికి ఏమీ లేకపోయింది. విజయా!.... అమ్మ, తమ్ముడు మూడురోజుల్లో

వచ్చేస్తామన్నారు. బంధువుల పట్టుదలవల్ల మరో రోజుండవచ్చు."

"అదే అయివుంటుంది నాన్నా! వెళ్ళక వెళ్లారు- నాలుగు రోజులుండ నీయండి."

"మంచి సంబంధ మనేసరికి హెచ్చుకట్నం- అందం గుణం చూసి ముందుకు వచ్చేవాళ్లెవరూ లేకపోతున్నారమ్మా! ఎవరైనా సాహసించి ముందుకు వస్తే ఎలాంటివారో నమ్మలేకపోతున్నాం. ఒక్కగానొక్క ఆడపిల్లను సకాలంలో పెళ్లి చేయలేకపోతున్నానే దిగులుగా వుంది విజయా!"

"బాధపడటంవలన ప్రయోజనముందేమో చెప్పండి నాన్నా! కల్యాణ ఘడియలు రావాలి. ప్రతీవారు గొప్పింటివాళ్లనే కోరుకుంటారు. ధవంతులు నౌకర్లు ఉన్నతోద్యోగం.... ఇది అందరి విషయంలో సాధ్యమంటారా నాన్నా? ఎదురింటి ఊర్మిళత్తను చూడండి. ఏం తక్కువ చెప్పండి? కాస్త పాతకాలపు మనిషిలా తయారవుతుంది. ఏడో తరగతితోనే చదువు సరిపెట్టిందట! అదీ ఆమె చేసిన ఘోర నేరాలు- భాస్కరంగారు సాధనతో ఎంతో సరదాగా తిరుగుతుంటారు. మనసులో దహించుకుపోతూనే పైకి శాంతమూర్తిలా కనుపిస్తున్న ఊర్మిళత్తను చూస్తుంటే కడుపు తరుక్కుపోతోంది నాన్నా."

"ఎవరి జీవితాలెలా మలచబడ్డాయో ఏమో! ఈ రోజుల్లో రెండో భార్య ధనవంతులకు పరిపాటైపోయిందమ్మా!" అంటుండగా విజయ తుమ్మింది.

"అబ్బ! అపశకునపు మాటలు- ఇక ఇలాంటి విషయాలు నిండు ఇంట్లో ప్రస్తావించటమంత మంచిది కాదమ్మా!.... నా ధ్యేయం ఒకటే! నీకు తగిన వరుడ్ని తీసుకురావటం....."

విజయ సిగ్గుతో లోనికిపోయింది. అలా సాయంత్రం ఐదుగంటలవరకూ గడిపింది. తల్లి వద్దనుంచి వచ్చిన జాబును పోస్టుమన్ వద్దనుంచి తీసుకుంది. తండ్రి పేర తల్లి రాసిన జాబు. తాను విప్పటం భావ్యంకాదని తండ్రి డ్యూటీ నుంచి తిరిగివచ్చేవరకూ అలాగే వుంచింది.

....లోనికి అడుగుపెడుతూనే రాఘవయ్య "పల్లెటూర్లో బడిపంతులుద్యోగం. ఆ అబ్బాయిని స్థిరపరుస్తామంటున్నారు మా పెద్ద గుమస్తాగారు." అంటూ కండువాతీసి మేకుకు తగిలించాడు.

"అబ్బాయి ఫోటో బాగుంది. అంతగా బెడదలేని సంసారమట! నీ ప్రస్తుత పరిస్థితిని బట్టి ఇంతకన్న ఎక్కువ తూగలేవు రాఘవయ్యా అంటూ దేవుడు పంపిన సంబంధంలా వుందమ్మా!"

ఏ మాటకూ విజయ సమాధానం చెప్పలేకపోతోంది. రాఘవయ్య దిగులుగా కూతురివైపు చూస్తున్నాడు. "పల్లెటూరి సంబంధం- అందులోనూ బడి పంతులన గానే విజయ ముఖంలో ఏదో మార్పు. ఏం చేసేది భగవంతుడా! అనుకుంటున్న సమయంలో తల్లి వద్దనుంచి వచ్చిన జాబు తీసుకువచ్చింది తండ్రికి. కాఫీ త్రాగి రాఘవయ్య జాబు విప్పాడు. కలవరంతో ముచ్చెమటలు పోశాయి. విజయ విసన కర్రతో విసురుతోంది.

"ఏముంది నాన్నా అందులో? అమ్మ క్షేమంగా వుందా? తమ్ముడి కెలా వుందేం?" అంటూ జాబు తీసుకుని చదివిన విజయ నిర్ఘాంతపోయింది.

"అమ్మ పదిహేను తులాల గొలుసు- ఈ రోజుల్లో ముప్పైవేల ఖరీదు వుంటుంది. నిద్రలో ఎవరో కాజేశారట. అంతా బంధువులు. పోలీసు ఫిర్యాదు చేస్తామంటూ ఎవరూ ముందుకురాలేదట! రేపే ప్రయాణమై ఇంటికి వస్తున్నట్టు రాసింది...."

"అమ్మా విజయా! ఏం పెట్టి నీ పెళ్లి చేసేదమ్మా! ఇన్నాళ్ల ఆ గొలుసును నమ్ముకున్నాను. అది కూడా దొంగల పాలయింది."

"నాన్నా! గొలుసు గురించి నాపెళ్లి గురించి బాధపడుతూ మీ ఆరోగ్యం పాడుచేసుకోకండి.... తమ్ముడ్ని చదివించి వృద్ధిలోకి తీసుకురావాలి. గతించిం దానికి విచారించి లాభంలేదు.... ఆ బడిపంతులు సంబంధం వీలైతే చూడండి."

"విజయా!" అంటూ కూతురు భుజం నిమిరాడు.

"పల్లె వాతావరణం- ఎక్కడైతేనేం! అందరితో కలసిమెలసి మసలటాని కలవాటుపడతాను. ఉన్న రెండురోజులూ సంతోషంగా గడిచిపోతే అంతే చాలు. ఎక్కడి కక్కడికే తృప్తిపడటం నేర్చుకోవాలి నాన్నా! యీ సంబంధం వీలైతే ఖాయం చేయండి. నే నేదో తొందరపడుతున్నానని మాత్రం మీరనుకోకండి.... రోజురోజుకు మన పరిస్థితి దిగజారిపోతోంది. వరదబాధితులం.... ఏ ఎండకా గొడుగు పట్టాలి."

"అలాగే విజయా! యీ సంబంధం ఎలాగైనా ఖాయంచేస్తాను. పెళ్లన్న తర్వాత అప్పులు చేయక తప్పదు.... అమ్మ వచ్చేక ఇద్దరమూ కలసి మా పెద్ద గుమస్తాగారితో మాట్లాడతాం...."

"ఏం విజయా! అమ్మింకా రాలేదా!"

"యీ సాయంత్రానికి రావచ్చుత్తమ్మా! మెడలో గొలుసు ఎవరు కాజేశారో ఏమో దీనంగా జాబు రాసింది. నా పెళ్లినాటికి పనికివస్తుందన్న నగ కాస్తా




పొలంలానే పోయింది.... ఎవరో పల్లెటూర్లో బడిపంతులట! మంచివారని నాన్న చెప్పగానే అదే స్థిరపర్చుమన్నాను. ఎదిగిన ఆడపిల్లను. నాన్నకు గుదిబండగా వుండటం నా కిష్టంలేద త్తమ్మా!"

"ఎక్కడైతేనేం! మనసులోనే వుంది. పల్లె ప్రజల కష్టసుఖాల్లో పాలు పంచుకోవాలి. తీరిక సమయాల్లో వాళ్లకు కుట్లు నేర్పు- చదువు చెప్పు- వాళ్లలో కలిసిపోయావో పల్లె ప్రజలు ప్రాణం పెడతారు. ఆ ఆత్మీయత వేరమ్మా! పట్నం మోజులు, అడుగడుగునా వంచన. ఎదుటివారు బాధపడుతున్నా పట్టించుకోకుండ తిరిగే ప్రజలు. అదే నాగరికతనుకుంటున్నారు.... ధైర్యంగా ఉండాలి విజయా."

"మీ నోటితో ఆశీర్వదించండ త్తమ్మా."

"నా దీవెన!.... అంతా ఫలించదమ్మా? మనసులో నీ తల్లితండ్రులకు నమస్కరించుకో! అంతా సవ్యంగా జరిగిపోతుంది."

ఇంతలో రామచిలుక విజయను పట్టి పట్టి పిలుస్తోంది.

"వట్టి చేతులతో వచ్చానే!"

"అక్కడే పైని మిరపపళ్లున్నాయి. నాలుగైదు లోనికి విసురు విజయా! ఇక్కడ ఒకటే రామచిలుక- అందులోనూ పంజరంలో- పల్లెటూర్లో ఏ చెట్టుపై చూసినా చిలుకలూ గోరింకలూ- స్వేచ్ఛగా ఎగురుతుంటాయి. వాటిని చూస్తూ ఎంతో ఆనందం పొందవచ్చు విజయా!"

"మీ ఆశీర్వచన మన్నానుగా అత్తమ్మా! ఏది ఎలా జరగాలనుంటే అలా జరగక మానదు. దిగజారిపోతున్న నాన్న ఆర్థికపరిస్థితులు. ముందు కెలా

వుంటుందో ఏమో!" అంటూ విజయ రామచిలుకను పలకరిస్తూ ఇంటికి వచ్చింది. గుమ్మంలో కొత్త ముఖాలు సాక్షాత్కరించాయి. విజయను పట్టిపట్టి చూస్తున్నారు.

"ఎవరు బాబూ మీరు? నాన్నగా రాఫీసునుంచి రాలేదే! అమ్మా తమ్ముడూ ఊర్లో లేరు ఎందుకు వచ్చారో ఏమో! ఇంతకూ యీ ఇల్లే కావాలా మీకు? రాఘవయ్యగారిల్లి ది."

ఆ పెద్దమనిషి నవ్వాపుకోలేకపోతున్నాడు.

"ఈ ఇల్లే కావాలమ్మా మాకు-అదిగో ఆ కనుపిస్తున్న కొట్లో మిఠాయికొని తీసుకువస్తానంటూ మమ్మల్నిక్కడికి పంపించాడమ్మా రాఘవయ్య! నీ పేరు విజయ కదూ!"

త్రుటిలో అర్థమయింది విజయకు, ఆ వచ్చినవారు పెద్దగుమస్తా తనను చూడటానికి వచ్చిన పెళ్ళికొడుకు వేణుగోపాల్ అని. ముసిముసి నవ్వులతో స్థంబంచాటుగా లోనికి జారుకుంది విజయ.

"ఆ సోఫాలో అలా కూర్చోండి బాబాయ్!" అంటుండగా రాఘవయ్య చేతిలోని మిఠాయిపొట్లంతో ఇంట్లో అడుగుపెడుతూ "విజయా! కాఫీ తీసుకురావాలి. నీ చేతి కాఫీరుచి ఎలావుంటుందా అని ఉవ్విళ్లూరిపోతున్నారీ పెద్దమనుషులిద్దరూ" అనగానే అందరూ పకపక నవ్వారు.

విజయ క్షణాలమీద కాఫీ తయారుచేసి తీసుకువచ్చింది.

"కాఫీ ఇచ్చేక లోనికి పారిపోవటం కాదు విజయా! ఇక్కడే కూర్చో! వేణుగోపాల్ మాష్టరుగారు నిన్ను చూడటానికి వచ్చారు. ఇలాంటి సమయాల్లో సిగ్గుపడటం సహజమే అనుకో! కాని అంగీకారం అందరి సమక్షంలో చెప్పాలి" అన్నారు పెద్ద గుమాస్తా.

"యీ రోజుల్లో ఆడది ముందుగా అంగీకారం చెపితే ఎన్నో పేర్లు పెడతారు. నా విషయం నాన్నగారూ మీరూ చూస్తున్నారు. మంచి మనసున్న మనుష్యులు ఎప్పుడూ మంచి సంబంధాలే తీసుకువస్తారు. మీ అమ్మాయిలాంటి దాన్నేగా బాబాయ్ నేను."

పెద్ద గుమాస్తా గొంతు బొంగురుపోయింది.

"అమ్మా విజయా! ఇంత వయసొచ్చినా పిల్లలు కలుగలేదు. మా ఆవిడ దిగులు కంతులేదు. భగవంతుడు మనకు సంతానాన్నివ్వలేదే అని ఒకటే రోదన."

"మనసు బాధపెట్టాను బాబాయ్!"

"ఒద్దే! నీవు నా కూతురులాంటిదానివి విజయా! బాబాయ్ అని నోరారా పిలుస్తున్నావు. అదే చాలమ్మా! ఆ పిలుపు నా మనసుకెంతూరట కలిగిస్తుందను కున్నావ్!"

రాఘవయ్య దీనంగా ఆయన మాటలు వింటున్నాడు.

"చూశావుగా వేణుగోపాల్! ఇది రాఘవయ్య పట్నంలో కొనుక్కున్న చిన్న ఇల్లు- ఒక కూతురు, కొడుకు విజయ తల్లీ తమ్ముడూ ఊరు వెళ్ళారు. నేడో రేపో రావచ్చు.... విజయను చూశావు కదూ! ఎందరికో పంచవలసిన అందాన్ని ఒక్క విజయలోనే భగవంతుడు ఎందుకు పొందుపరచాడా అని కదూ మనసులో ఊహిస్తున్నావు? నీ పేరు వేణుగోపాలుడు. గోపికా వల్లభుడు. అందరి గోపికల అందం ఒక చెంత చేర్చి కుందనపు బొమ్మలా మలిచాడు విజయను" అంటుండగా విజయ సిగ్గుతో లోనికిపోయింది.

మాటామంతీ అంగీకారం తదితర విషయాలు మాట్లాడుకుని వేణుగోపాల్ పెద్ద గుమాస్తాతో కలసి పైకివచ్చి స్నేహితుని గదికి చేరుకున్నాడు. అదే పనిగా మనసులో చిత్రించుకుంటున్నాడు విజయ అందచందాలను. ఆ పల్లె ప్రజల్లో మకుటంలేని మహారాణిలా వెలిగే విజయను తలచుకుని మనసులోనే మురిసి పోతున్నాడు వేణుగోపాల్. నెలరోజులు సెలవులో వచ్చిన తనకు 'ఈ మారు మాత్రం ఒంటరిగా రాకండే! అమ్మగారిని వెంట తీసుకురావాలి' అని మరీ మరీ చెప్పిన చిన్నారిపాపల ముద్దుపలుకులు చెవిలో గిలిగింతలు పెడుతున్నాయి.

'మాటిమాటికీ సెలవులు దొరకవుగా! వీలైనంత త్వరగా పెళ్ళి జరిగేలా చూస్తాను' అన్న నిర్ణయానికి వచ్చాడు. ...."రాఘవయ్యా! వేణుగోపాల్ పెళ్ళికి తొందర పెడుతున్నాడు. సెలవులు దొరకవట! మీ అవిడ కూడా చూడటం అంగీకారం తెలపటం కూడా జరిగాయి అప్పులు చేసి వేలకొద్దీ తగలబెట్టేకన్న పెళ్ళి ఇలా జరగాలని చేసి చూపించాలి. ఎలా చేసినా పెళ్ళేగా! వాళ్ళు నాలుగు కాలాలపాటు సుఖంగా బ్రతకటం కావాలి గాని మనం నాలుగు కాలాలు వడ్డీ డబ్బులు కడుతూ బ్రతకమని కాదు. ఇంట్లోవాళ్ళతో మాట్లాడి శుభస్య శీఘ్ర మనిపించు."

"అలాగే రంగనాథం! తప్పక చేస్తాను.... రోజులు గడిచేకొద్దీ వయసు మించిపోతోంది విజయకు" అని పెళ్ళిముహూర్తం త్వరలో నిర్ణయించారు. అతి తక్కువ ఖర్చుతో పెళ్ళి జరిపించారు....

విజయ ఆపుకోలేని దుఃఖంతో కన్నీరు కార్చింది. తల్లితండ్రుల్నీ తమ్ముణ్నీ ఇరుగుపొరుగునీ విడిచి శాశ్వతంగా వెళుతున్నందుకు బాధపడుతోంది. గూడులోని రామచిలుక విజయను అదేపనిగా పిలుస్తోంది. కన్నీళ్ళు తుడుచుకుంటూ విజయ గూటివద్దకు వెళ్ళి రామచిలుకకు అరటిపండు అందించింది.

"నేను దూరంగా పోతున్నాను. క్షేమంగా వున్నట్టు అమ్మతో చెపుతుండు" అని బిగ్గరగా ఏడ్చింది. ఊర్మిల చేతులతో విజయను దగ్గరగా తీసుకుంది. కూతురులాంటి విజయను హృదయాని కద్దుకుంది. విజయ ఊర్మిలత్త వద్ద తదితరుల వద్ద సెలవుతీసుకుని వేణుగోపాల్‌తో గ్రామం బయలుదేరింది.

"వెనుక నెవరూ రాలేదని బాధపడనులే అత్తమ్మా! తిరిగిరావటం మీకు శ్రమ, బాధ- వీలైనంత త్వరలో విజయను తీసుకువస్తానుగా! తనకే ఇబ్బందీ లేకుండా చూసే బాధ్యత నాది"

"బాబూ వేణూ! విజయను జాగ్రత్తగా చూసుకోవాలి. కట్నాలు కానుకలు ఏమీ ఇవ్వలేకపోయాము. పరిస్థితులు అవగాహన చేసుకుని మరీ విజయను చేసుకున్నావు. ఏదో విధంగా దానికి ముట్టవలసింది ముట్టచెపుతాంలే!"

"అలాంటిదేమీ మనసులో పెట్టుకోకండత్తమ్మా! నే నలాంటివాటికి కాశించను. నేనీ రోజు కట్నాల కాశపడితే రేపు నా కడుపున ఆడపిల్లలు పుడితే వాళ్ల గతేంకాను! చేసేది మాస్టరుద్యోగం. ఏ మార్జించగలను చెప్పండి? అందుకే నొక్కినొక్కి చెపుతున్నాను. కట్నం ప్రసక్తి తీసుకురావద్దని. ఇంతకూ నాకు ఏముందంటారు? ఆస్థిపాస్తుల్లేవు. అమ్మ అన్నయ్య దగ్గరుంది. నేనా ఒంటరివాడిని. అందమైన విజయ నన్నంగీకరించిందంటే నాకే ఆశ్చర్యంగా వుంది అత్తమ్మా"

"అలా అనకు బాబూ! మీ ఇద్దరినీ భార్యాభర్తలుగా భగవంతుడు సృష్టించాడు. అందుకే యీ బంధం- సుఖంగా బ్రతకండి" అంటూ రాఘవయ్య దంపతులు కూతుర్నీ అల్లుణ్నీ సాగనంపారు....

ఆ పల్లెటూర్లో ఏ నోటవిన్నా విజయ అందచందాల గురించే!

"వేణుగోపాల్! చాల అదృష్టవంతుడవోయ్! అందమంతా విజయ సొత్తు. పట్టణవాసంలో పెరిగి వచ్చింది. ఈ పల్లె వాతావరణం తనకు పడుతుందో లేదో!"

"పడకపోతే తప్పుతుందా బాబాయ్! వివాహమన్న తర్వాత భర్త వెనుక భార్య! పరిస్థితులకు తట్టుకోగల శక్తి నాకుంది. లేకపోతే మొదటిలోనే నే

నంగీకరించేదానిని కాను" అంటూ విజయ పెద్ద మాష్టరుగారికి సమాధానం చెప్పింది.

"యీ గ్రామం గ్రామ ప్రజలందరూ చాల మంచివారమ్మా! అక్కడక్కడ కష్టాలుపడి వచ్చినవాడిని. అనుభవంమీద చెప్తున్నాను. కలకాలం సంతోషంగా కాలం గడపాలని దీవిస్తున్నాను తల్లీ!.... వేణూ! యీ పూట మా ఇంట భోజనం చేయాలి. కాదనకూడదు విజయా" అని బలవంతంగా తన ఇంటికి తీసుకువెళ్ళాడు.

"బ్రతకలేక బడిపంతులన్నారు విజయా! అప్పుడప్పుడు బడ్జెట్ లేదంటూ నెలల తరబడి జీతాలుండవు. అలాంటి అష్టకష్టాలు ఎదుర్కొనే శక్తి ముందు ముందు అలవాటు చేసుకోవాలమ్మా!"

విజయ మౌనంగా వింటోంది.... భోజనాలయాయి. పెద్ద మాష్టరు, ఆయన సతీమణి దీవించి ఆ దంపతులను వాళ్ళ కుటీరానికి పంపించారు....

"యీ పల్లెటూర్లో పెంకుటిల్లుండవు విజయా! ఇలాంటి కుటీరాలు తప్పవు. అగ్నిప్రమాదాలు రాకుండా చూసుకోవాలి. అలా జరిగిందో నిలువు దోపిడిలా కట్టుగుడ్డలతో మిగిలిపోవలసిందే!

విజయ మౌనంగా భయంతో వింటోంది.

"వంటకొకావలసిన కూరగాయలు అంగడిలో కొనుక్కువద్దాం పదండి" అంది విజయ.

"నీ విక్కడే వుండు విజయా! బడిపిల్లలున్నారుగా మోయించుకు వస్తాను."

"టీచరుగారు మొదట్లోనే పప్పులో కాలేస్తున్నారే! బడిపిల్లలటండీ సామాన్లు మోయటానికి? మనకు మోసే శక్తి లేకపోతే కళాసీలుంటారు కదండీ! అంతేకాని బడిపిల్లల కలాంటి పనులు చెప్పకూడదు." వేణుగోపాల్ సమాధానం చెప్పలేకపోతున్నాడు.

"కోపమా బడిపంతులుగారూ?"

"నీవే కరక్టు విజయా! సంతకు పోయి సామాన్లు పట్టుకువద్దాం రా!" అని గదికి తాళంవేసి ఇద్దరూ కలసి సంతకు వెళ్లి కావలసిన సామాన్లు కూలిచ్చి మోయించుకు వచ్చారు.

"పోతేపోయింది రూపాయి కాని మొదటి పాఠం నీ నుంచి నేర్చుకున్నాను ఇయా!"

"మనం మంచి పనిచేస్తూ ఆ మంచిని పదిమందికి పంచగలగాలండీ!"

"పల్లెటూర్లో విద్యార్థుల్ని ఎన్నెన్నో పనుల కుపయోగించుకుంటారు.... వంట కానీ విజయా!"

విజయ వేణుగోపాల్ మాటలకు ఊకొడుతూ మధ్యమధ్య సమాధానం చెప్తూ వంట ప్రయత్నంలో వుంది.

"మౌనంగా వంటచేస్తుంటే నీకు కోపం వచ్చిందని నే బాధపడటం జరుగుతుంది. మాటలు చెపుతూనే వంటచేయాలి."

"మాటలు చెపుతూ వంటచేస్తే కూరలన్నీ దెబ్బతింటాయండీ."

"అలాగా! దేశంలో అందరూ అలాగే చేస్తున్నారా ఏం! మాటలాడుతూనే వంట చేస్తారు."

"నా కలవాటులేదు కదండీ!" అనగానే వేణుగోపాల్ విజయను సమీపించాడు.

"తొందరపెడితే వంట పాడవుతుంది వేణుగోపాల్ మాష్టరుగారూ!"

"భర్తను పేరుపెట్టి పిలవటం చట్టవిరుద్ధమంటారు."

"అది అందరిలోనైతేనే ధర్మవిరుద్ధం— మా వారు- మా ఆయనగారు- ఇత్యాదులు. ఈ ఏకాంతంలో ఆ మాత్రం పేరుపెట్టి పిలిస్తే ప్రమాద మేం లేదండీ" అంటూ ముక్కలు వేపుడుకు మూకుడులో వేసింది.

ఘుమఘుమలాడే కమ్మని వాసన మొదటిరోజు తాళికట్టిన భార్య చేతివంట- మనసులోనే తీయని స్వర్గం నిర్మించుకుంటూ విజయను గుండెల కద్దుకున్నాడు.

"ఇద్దరమూ కలిసి ముక్కలు వేపుదాం" అన్యోన్యంగా ఆనందంగా నవ్వుతూ వంట కానిచ్చారు వేడివేడి అన్నం కూర పులుసుతో భోజనం చేశారు.

"పెళ్లయి పదిరోజులు గడిచినా యీ ఊర్లో మాత్రం ఇది మనకు మొదటి రాత్రే కదూ!"

ముసిముసి నవ్వులతో చెవిలోని కబుర్లతో మధురాతి మధురంగా ఆ రాత్రి గడిపారు....

తెల్లవారింది. వేణుగోపాల్ లేచి స్నానం కానిచ్చి కాఫీ ఫలహారాలు సేవించి స్కూలుకు బయలుదేరాడు.

"వచ్చేవరకూ యీ పుస్తకాలతో కాలక్షేపం చెయ్యి. రెండు మూడు రోజుల్లో నీ కిక్కడి వాతావరణం అలవాటౌతుందిగా! స్కూలు లైబ్రరీకి తీసుకు వెళతాను. అక్కడ పుస్తకాలతో కాలక్షేపం చేద్దువుగాని. తిరిగి ఇద్దరమూ ఇంట



కలసి రావచ్చును" అని విజయ చెక్కిలిపై చిటికెవేసి స్కూలుకు వెళ్లాడు.

వేణుగోపాల్‌వైపు అందరూ వింతగా చూస్తున్నారు. భువనైక సుందరిని అర్ధాంగిగా పొందిన అదృష్టజాతకుడని అందరి పెదవులూ ఉచ్చరిస్తున్నాయి. పాఠాలు చెపుతున్నాడే కాని విజయ అందచందాల గురించే ఆలోచిస్తున్నాడు.

"ఎంతో ఉన్నతస్థితిలో వున్నవాడిని కట్టుకోటాని కర్హతున్న అందం.... పరిస్థితులు తారుమారైనాతో వివాహాని కంగీకరించింది" అనుకుంటూ పాఠం మధ్యలో లేచి పైకిపోబోతున్న అమ్మాయిని "విజయా విజయా" అని పిలిచాడు.

అందరూ గొల్లున నవ్వారు.

"ఆ పాప పేరు సీతామహాలక్ష్మి మాష్టారూ."

"అరే మా విజయ పేరుపెట్టి పిలిచాను" వేణుగోపాల్ నవ్వాపుకోలేక పోయాడు....

ఇంటి కాత్రుతగా వచ్చిన వేణుగోపాల్ "ఈనా దేమయిందనుకున్నావ్ విజయా! ఓ అమ్మాయి లేచి పైకిపోబోతోంది. ఆ అమ్మాయి పేరు సీతామహాలక్ష్మిని నాకూడా తెలుసును. కాని నీ ధ్యానంలో వున్నానేమో ఆ అమ్మాయిని విజయా జియా అని పిలవగానే పిల్లలందరూ ఒకటే నవ్వు. నేకూడా వారితో శృతి

కలపవలసి వచ్చింది."

విజయ సంతోషంగా నవ్వలేకపోయింది.

"పిల్లలకు చదువుచెప్పేటప్పుడు పరధ్యానం పనికిరాదండీ! అదే ఓ పెద్దమ్మాయిని లేదా తోటి లేడీటీచర్‌ని విజయా విజయా అని పిలిస్తే ఎంత ప్రమాదమో తెలుసా మాష్టరుగారూ!"

"నిజమే నిజమే" అనుకుంటూ కాఫీ తీసుకున్నాడు.

ఏదో చెప్పబోయి నవ్వించాలనుకుని అంత తృప్తిగా నవ్వని విజయను మాటల్లో పెట్టాలనుకుంటూ "మీ వాళ్ళకు జాబు రాయి విజయా! యీ ఇన్‌లేండు కవర్లు క్లాసుకుర్రాళ్ళతో తెప్పించాను" అన్నాడు.

"బడిలో చదువుకుంటున్న కుర్రాళ్లను అలాంటి చిల్లరపనులకు పంప కూడదండీ! ఓమారు మాఊర్లో పోస్టాఫీసుకు వెళ్లాను. కౌంటరు వద్దకు ఎందరో పిల్లలు స్కూలుటైంలో వచ్చి ఏవేవో అడుగుతున్నారు. చదువు చెప్పకుండా మీ మాష్టరమ్మలు మిమ్మల్నిలా పంపిస్తుంటే ఎప్పుడమ్మా మీ క్లాసు పాఠాలు చదువుకునేది? అని పోస్టుమాష్టరుగారు వ్యంగ్యంగా అనటం విన్నాను. అదే మీరీ ఊర్లో చేస్తున్నారన్నమాట!"

"అబ్బ! ఏది చెప్పినా డిసిప్లీనంటావు. పోనీ.... నీవైనా కబుర్లు చెప్పు విజయా!"

"ముందు కెన్నిరోజులు లేవు? తీరికగా కబుర్లు చెప్పుకుందాం! మీరు మాత్రం నన్నపార్థం చేసుకోకండి. ప్రతీ విషయానికి వెకిలిగా నవ్వటం నా కలవాటు లేదు. ఏదో గంభీరంగా ఆలోచిస్తుంటాను"

వేణుగోపాల్ తాను జీవితంలో ఆశించింది క్షణక్షణం తనను కవ్వించి నవ్వించే భార్య! కాని విజయలో పాత అలవాట్లు జీర్ణించుకుపోయాయి...మనసులో బాధపడుతూనే "మీ వాళ్ళకు క్షేమంగా చేరుకున్నట్టు జాబు రాయి విజయా!" అని మాత్ర మనగలిగాడు....

తెల్లవారింది. అనుకోకుండా స్కూళ్ల ఇన్‌స్పెక్టర్ హఠాత్తుగా తనిఖీకి వచ్చారు. పెద్దమాష్టరు గడగడ వణికిపోతూ పరుగునడకలమీద వచ్చి "వేణూ! ఇన్‌స్పెక్టర్‌గారు హఠాత్తుగా వచ్చారు. ఏయే రికార్డులు చెక్‌చేస్తారో తెలియటం లేదు. ఆయన తలుచుకుంటే ఏ ఇరకాటంలోనైనా పెట్టగలరని భయపడి పోతున్నాను" అన్నారు.

"మీ రెందుకు మాష్టారూ భయపడటం? మీలో ఏమైనా తప్పులుంటేగా భయపడటానికి" విజయ కల్పించుకుని మాట్లాడింది.

"నివు చిన్నదానివి- అనుభవం లేనిదానివి. తప్పులు లేకపోయినా ఉన్నట్టు కల్పిస్తారమ్మా!.... అధికారులు- ఏ విషయానికి కోపమొస్తుందో మాకే తెలీదు."

"పెద్దమాష్టరుగారు చెప్పింది అక్షరాలా నిజం, విజయా! నెలజీతాలమీద ఆధారపడినవాళ్లం. లొంగివుండక తప్పదు."

"అమ్మా విజయా! చిన్నపని అప్పచెపుతాను. కాదనకుండా చేయాలి తల్లీ."

"చెప్పండి మాష్టరుగారూ! తండ్రిలాంటివారు- మీరు చెపితే కాదంటానా!"

"ఆ ఇన్‌స్పెక్టర్‌కు వంటచేసి పెట్టడానికి మా ఆవిడకు వీల్లేదమ్మా! ఆయనకు నీ చేత్తో కమ్మని వంటచేసి పెట్టాలమ్మా."

"హోటల్ వున్నదే ఒకటమ్మా! అంతగా రుచి శుభ్రం వుండదు. సంవత్సరానికొకమారు వస్తుంటారు. ఇలా మర్యాదచేయటం ఇక్కడే కాదమ్మా! దేశం నలుమూలలా ఆనవాయితీగా వుంది."

"నెలరోజులూ ఇలానే ఏదో ఒక స్కూలుమీద దండయాత్ర- తిండికి కాఫీఫలహారాలకు లోటుండదని వాళ్ల అంచనా! ఇలా మిగుల్చుకున్న డబ్బును బేంకుల్లో దాచుకుంటారు. కూతుర్లకు కట్నం కింద వేలమీద రహస్యంగా దారవోసి ఇలాంటి లంచగొండి అల్లుడ్ని మరొకడిని సంపాదించుకోవటం."

"నీ మాటలన్నీ నిజమేనమ్మా! అక్షరాలా నూటికి నూరుపాళ్లు నిజం. కాదనటంలేదు. ఈ రెండు పూటలూ కాస్త సహాయం చెయ్యి తల్లీ" అని విజయను బ్రతిమాలి ఒప్పించి స్కూలు బంట్రోతు ద్వారా సామాన్లు పంపించాడు. ఇష్టం లేకపోయినా విజయ వంటచేసింది. అల్పాహారం తయారు కాగానే బంట్రోతు ప్లేట్లలో తీసుకువెళ్లి ఇన్‌స్పెక్టర్ ముందు పెట్టాడు.

"ఉప్మా ఎవరు చేశారోగాని అద్భుతంగా వుందిరా అబ్బులూ."

"వేణుగోపాల్ మాష్టరుగారి భార్య విజయ బాబూగారు! మొన్ననే పెళ్లి చేసుకుని తీసుకువచ్చారు. ఎంతందం బాబూ!"

"అలాగా!"

"యీ పల్లెటూర్లో ఎవరి ముఖాల్ని నవ్వు చూద్దామన్నా కనుపించదు- ఎప్పుడూ పనీపాటూ చెమట కంపు. విజయమ్మగారు బంగారు బొమ్మ బాబూ! రెండు కళ్లు చాలవు."

"మధ్యాహ్నం భోజనాని కక్కడికే వస్తానని చెప్పరా అబ్బులూ."

"అలాగే బాబుగారూ" అంటూ అబ్బులు వచ్చి విజయతో "ఉప్మా పూరీ కూర చాల బాగుందన్నారమ్మా! మధ్యాహ్నం భోజనం మోసుకురావడం నాకు

శ్రమని ఇన స్పెక్టరుగారు సరాసరి ఇక్కడికె వస్తామన్నారు" అని చెప్పాడు.

"వీల్లేదని చెప్పు! స్కూల్లో చివరిగదిలో బస ఏర్పాటు చేశారుగా! అక్కడే భోజనం కానీయమని చెప్పు. నాకు మాత్ర మిష్టంలేదు."

అబ్బులు బెదురుతూ భయంతో తిరిగివచ్చాడు. పెద్దమాష్టరు వేణుగోపాల్ తదితరులు ఏవేవో లెక్కలు చూపిస్తున్నారు. మధ్యమధ్య నవ్వుతూ అక్కడ అక్కడ లెక్కలు సరిలేవంటూ చిరుకోపం చూపిస్తున్నాడు ఇన్స్పెక్టరు ప్రతీ దానికి. పెద్దమాష్టరు మర్యాదగా ఊకొడుతూ ఇకపైని జాగ్రత్తగా వుంటామనీ తప్పులు రాకుండా చూస్తామనీ హామీఇస్తున్నారు. పైని నసుగుతున్న అబ్బుల్ని చూసి "మధ్యాహ్న భోజనం త్వరగా కానీయమన్నావా!" అనడిగాడు.

"చేస్తామన్నారు బాబూ విజయమ్మగారు. ఆ భోజన మిక్కడికే గాని తన ఇంటికి వచ్చి తినటానికేమాత్రం వీల్లేదన్నారు బాబూ!"

"ఎందుకని! ఇన్స్పెక్టరుగారికి వ్యతిరేకంగా ప్రవర్తించటం వారి కెంత అవమానమో తెలుసా వేణుగోపాల్?.... విజయ అదో రకం మనిషి ఇన్స్పెక్టర్ గారూ! తమరు మరోలా భావించకండి.... ఎక్కడైతేనేం! తమకు కావలసింది రుచికరమైన ఆహారం- మా విజయమ్మ అంగీకరించింది- అంతే చాలు."

"ఇందులో అంగీకార మేముంది మాష్టరుగారూ! ఏ గ్రామానికి వెళ్లినా రాచమర్యాదలు. తననిక్కడికి తెచ్చి వడ్డించమనలేదుగా! శ్రమెందుకని నేనే స్వయంగా వచ్చి భోంచేస్తానన్నాను. తక్కిన గ్రామాల్లోనే ఇంటికి వెళ్లి భోజనం చేయటం అందరూ గౌరవంగా భావిస్తారు.... విజయ విషయం చాల వింతగా వుంది "

వేణుగోపాల్ మౌనంగా వింటున్నాడు. పెద్దమాష్టరు ఏమీ అనలేక పోతున్నాడు. వేణుని పైకి పిలిచి "ఇన్స్పెక్టరుగారికి వ్యతిరేకంగా ప్రవర్తిస్తే కోపంతో మరికొన్ని రోజులుండి నానా హంగామా చేస్తారు. పోనీ ఇంటివద్ద భోజనాని కంగీకరిస్తేనో" అన్నారు.

"విజయ కలాంటివి ఇష్టముండదండీ! నే అబ్బులతో అన్నీ ఇక్కడికే రప్పిస్తాను" అని అబ్బుల్ని ఇంటికి తీసుకువచ్చి అన్ని వంటకాలు కేరేజీలో పెట్టి తీసుకువచ్చారు.

"గడ్డ పెరుగు మరచిపోయ్యా[నా! పోయి తీసుకురా."

"మళ్లీ వచ్చావు అబ్బులూ!"

"గడ్డ పెరుగు తీసుకురమ్మన్నారమ్మా మాష్టరుగారు."

"దాంతోపాటు యీ మిగిలిన సామాన్లన్నీ తీసుకుపో."

"అవి మీరే వుంచుకోండమ్మగారూ! పిల్లలకు పదిగంటల సమయంలో టిఫిన్‌కని గవర్నమెంటిచ్చినవి. పది రోజుల గ్రాసం. ఉంచుకోండమ్మా!"

"అయితే పిల్లలకు ఏదీ సరిగా ముట్టటంలేదన్నమాట!"

"అప్పుడప్పుడు కక్కుర్తిపడక తప్పదమ్మా! యీ పెద్దమాష్టరుగారు కాస్త నయమే! ఎక్కువ కాశపడరు ఆ బాబుగారొచ్చారు. ఐదు నూనె డబ్బాలు, రెండు బస్తాల గోధుమనూక శెట్టిగారికమ్మి నగదు తీసుకురావలసి వచ్చింది. దినుసైతే ఇన్‌స్పెక్టరుగారు తీసుకుపోలేరు. అందరికంటా పడతారు. డబ్బయితే రహస్యంగా వెంట తీసుకుపోవచ్చును"

"ఇదన్నమాట తతంగం! యీ మిగిలిన సామాన్లు త్వరగా తీసుకుపో- మా సామాన్లతో మా ఇద్దరకూ వేరుగా వంట చేసుకోవాలి"

"ఎందుకమ్మా కోపం! పట్టువిడుపులుండాలి. అంత మొండి పట్టుదల పనికిరాదమ్మా! బెడిసికొడుతుంది."

"బెడిసి కొడుతుందని అన్యాయం చేయమంటావా అబ్బులూ! వేలాదిమంది మన కెందుకులే అన్నదానిని నాలాంటిది ఇది అందరి విషయమని పట్టుపట్టి అడగ వచ్చు. కళ్లు తెరిచి చూసినవారికది అన్యాయంగా కనుపిస్తుంది. కళ్లు మూసుకుని నా కెందుకులే అన్నవారు చాలమందున్నారీ దేశంలో" అంటుండగా అబ్బులు అన్ని సామాన్లు వెంట తీసుకుపోయాడు.

"విజయమ్మగారు మీ సామాన్లతో వంట మొదలుపెట్టారు బాబూ! స్కూలు పిల్లలకు కేటాయించిన దినుసులు ముట్టనన్నారు."

ఇన్‌స్పెక్టర్ ఆశ్చర్యపోయాడు.

"నా జీవితంలో ఇలా అప్పనంగా వస్తున్న వస్తువుల్ని కాళ్లతన్నినవాళ్లు ఇప్పటికి కనుపించలేదంటే నమ్మండి. విజయ ప్రవర్తన నా కెంతో గర్వంగా వుంది. దేశాన్ని ముందుకు నడపగల అర్హతగల స్త్రీలా వుంది విజయ" అంటూ వంటకాలు మెచ్చుకున్నాడు.

"మీరు కూడా ఇక్కడే భోజనంచేయండి వేణుగోపాల్."

"విజయ నాకోసం వంటచేస్తుంది సార్."

"మీ కష్టార్జితంతో కొన్న సామాన్లతో- స్కూలు పిల్లల ఆహార పదార్థాలతో కాదు- వెళ్లిరా వేణుగోపాల్ అని లోన కూర్చుని ఇన్‌స్పెక్టర్ ఆలోచిస్తున్నాడు. మిగిలినవి కడుపునిండా అబ్బులు తిని "బాబూ! వచ్చిందగ్గర

నుండి తనకి చెస్తున్నారు. బుర్రకు పని- కాసేపు నిద్రపోండి బాబూ!" అని అబ్బులు నిద్రపోతున్న ఇన్స్పెక్టర్‌కు కాళ్లు పడుతున్నాడు.

మెల్లగా కళ్లువిప్పి "కంటికి నిద్రరావటంలేదురా!.... ఇంకేమైనా అందిరా విజయ!" అని ప్రశ్నించాడు.

"మహా గర్వపోతు బాబూ! గవర్నమెంటు పిల్లలకని ఇస్తున్న ఆహార పదార్థాలను దుర్వినియోగమెందుకు చేయాలని నన్ను నిలదీసి అడిగింది బాబూ! ఏ మాటకూ సమాధానం చెప్పలేకపోయాను."

"నా గురించి ఏమైనా అందా!"

"ఇన్స్పెక్షన్ మిషమీద ఏవో నాలుగు డబ్బులు దోచుకుపోడానికొచ్చారని ఎత్తిపొడిచింది."

"ఇలాగా!.... విజయ అన్నదాన్లో తప్పేమీలేదురా! దొరలకాలంనుంచీ వస్తున్న ఆనవాయితీ- అప్పుడు చీకట్లో చేసేవాడు. ఇప్పుడు వెలుగుల్లో నాలుగు రోడ్ల కూడలిలో చేస్తున్నాడు. అంతే తేడా! నా స్థానంలో తన భర్తవున్నా ఇదేగా చేసేది! ఎంత అరిచినా మొత్తుకున్నా విజయగొంతు యీ పల్లెటూర్లో నాలుగు గోడలు దాటిపోదు. ఏ ఒక్కరూ పట్టించుకోరు" అంటూ ఓ గంట నిద్రపోయాడు.

మర్నాడు పొద్దెక్కిపోయినా ఎలాగో లేచి, వెళ్ళే లోపున విజయ అంద చందాలను తలచుకున్నాడు.

"విద్యార్థులు వారి తల్లిదండ్రులు యువజనులతో చిన్న మీటింగు ఏర్పాటుచేయండి పెద్దమనుష్యులుగారూ! అందరినీ ఒకేచోట చూడటం వారివారి అభిప్రాయాలు తెలుసుకోవటం జరుగుతుంది."

ఇన్స్పెక్టరుగారి సూచన ప్రకారం మర్నాడు ఐదు గంటలకు అందరూ స్కూలు ఆవరణలో సమావేశమౌతున్నారు

"అందరూ వస్తున్నారు. నీవు కూడా రా విజయా! రాకపోతే పొగరుబోతు వనుకుంటారు. జీవితంలో నిన్నేమీ కోరను. ఆపదలో వున్నవాడిలా బాధపడుతున్నాను. ఊరందరూ వస్తారు కద. నీవొంటరిగా ఇక్కడ. విజయ రాకపోవటాని కారణాలు వెతకటంలోనే వుంటారు. దాని కాస్కారమివ్వకుండా నీవు కూడా రా విజయా! నాతో సహకరించి నాకీ సహాయం చేసిపెట్టు" అని వేణుగోపాల్ గోముగా అడిగాడు. విజయ తిరస్కరించలేకపోయింది.

"ఇంటింటికి వెళ్ళి ఎలాగూ నీవు చూడలేవుగా! అందరినీ ఒకేచోట చూసే అవకాశం కలుగుతుంది" అని పెట్టెలోని పంచరంగుల చీరను స్వయంగా







తీసిచ్చాడు భార్యకు. విజయ అలంకరించుకుని కళ్ళ వేణుగోపాల్ సరసను కూర్చుంది. దివినుండి భువికి దిగివచ్చిన దేవతలా వున్న విజయను కళ్ళప్పగించి అందరూ చూస్తున్నారు. చబ్బులు చెప్పుంటానికి ఎన్నో చెట్టుండంగా కనిపిస్తున్న విజయను– ఆమెను భార్యగా పొందగలిగిన వేణుగోపాల్‌ని మనసులోనే అభినందిస్తున్నారు ఇన్‌స్పెక్టర్– ఆ చిన్న సభలో అందరి పెదవులు విజయ అందాన్ని తీయగా ఉచ్చరిస్తున్నాయి. ఆ పొగడ్తలకు తట్టుకోలేక విజయ దగ్గరగా ముడుచుకుపోయింది.

సభను ప్రారంభించమని ఇన్‌స్పెక్టరుగారిని హెడ్మాష్టరు కోరారు.

"సదాసరి ఉపన్యాసం మొదలుపెట్టేకన్నా విజయగారి ప్రార్థనతో ప్రారంభించడం సముచితమని నా అభిప్రాయం."

"అలాగే!" అని అందరూ బిగ్గరగా కేకలు వేశారు. వేణుగోపాల్ విజయతో ఏదైనా ప్రార్థనగీతం పాడమన్నాడు. కాదనలేక లేచివెళ్ళిన విజయ "దేశమును ప్రేమించుమన్నా మంచి యన్నది పెంచుమన్నా" అన్న గురజాడ గీతాన్ని గానంచేసింది.

"చూడండి బాబూ! దైవగీతం పాడి ఆయనను అపవిత్రుని చేయటం నా కిష్టంలేదు. అందుకే మా కవితావాది రచించిన గేయాన్ని గుర్తుకు తెచ్చాను.

పాట పాడగానే చప్పట్లు కొట్టారు. పాటలో ఏముందో మనం కాచి వడ పోయాలి. పాట కనుగుణ్యంగా మనం నడచుకోవాలి. అలా చేయనప్పుడు ఆ పాట రాసిన మన మార్గదర్శకులను అవమానించినట్టే కదా!" అని ప్రశ్నించింది.

"అవును. అవును" సభలో కోలాహలం.

"ప్రతి ఆఫీసులోను ఎన్నో అక్రమాలు జరుగుతున్నాయి. లంచం లేందే కాగితం కదలదు. కాని ఆ ఆఫీసు సూపర్‌వైజర్ నెత్తిపై అశోకుని ధర్మ చక్రం- చచ్చి పరలోకంలో వున్న గాంధీ మహాత్ముని చిత్రపటం. దేనికీ కొంత కుదరడంలేదే! మరి మీ రేమంటారు ఇన్‌స్పెక్టరుగారూ!"

"మీ మాటలతో తప్పక ఏకీభవిస్తున్నాను విజయగారూ."

"మరి మాటల్లో అంగీకరించారు. మరి చేష్టలు మరోలా వున్నాయి. పిల్లలకని కేటాయించిన గోధుమనూక, నూనె, పోపుసామాను తదితర సామగ్రి- మీకని కొన్ని వంటకా లందులోనుంచే! కొన్ని బస్తాలు నూనెడబ్బాలమ్మి డబ్బు రూపంలో మీకు లంచం- అందుకనే మాటలకు చేతలకు సంబంధ ముండాలని సవినయంగా మనవిచేసుకుంటున్నాను."

అందరి ముఖాలు కళావిహీనమైపోయాయి.

వేణుగోపాల్ లేచి వారించబోయాడు. చిన్న చిరునవ్వుతో ఇన్‌స్పెక్టరు "చెప్పనీ వేణుగోపాల్! తాను చెపుతున్నదాన్లో ఎంతో అర్థముంది. మనలాంటి వాళ్ళకు మార్గదర్శకురాలు- చాల అదృష్టవంతుడివి" అని విజయకు మరికొంత ప్రోత్సాహమిచ్చాడు.

"బడిలో పాఠాలు చెప్పక ఇంటివద్ద చెప్పి అదనంగా ప్రైవేటు జీతాలు సంపాదిస్తున్నారు. ఇది చాలా అన్యాయం. నీ పేరు బడిపంతులు- నీ జీవిత ధ్యేయం విద్య బోధించటం- నీ సుఖమూ, ఆరోగ్యమూ అన్నీ త్యాగంచేసి వాళ్ళ అభివృద్ధికి తోడ్పడాలి. అంతేగాని పది ప్రైవేట్లు చెప్పి పొట్ట పోషించు కుంటున్నానన్న నీచమైన మాటలు-మాత్రం వాడకూడదు"

అందరికన్న ముందుగా హెచ్చు శబ్దంతో ఇన్‌స్పెక్టరు చప్పట్లు కొట్టాడు.

"నే మాట్లాడిన తర్వాత ఇన్‌స్పెక్టరుగారికి మాట్లాడటానికి మరి మాటలు లేవనుకుంటాను. ఎంత చెప్పినా వాళ్ళ ధోరణి ఒక్కటే! పిల్లల్ని క్రమ శిక్షణలో నడిపించమంటారు. పెద్దలలో లోపించిన క్రమశిక్షణ పిల్లల కెలా పట్టుపడుతుంది? పెద్దలు న్యాయసమ్మతంగా నడవాలి. అప్పుడే కదా పిల్లల కదలవాటౌతుంది. ఇన్‌స్పెక్టరుగారూ! నన్ను క్షమించాలి. జీవితంలో లౌక్యంగా

మాట్లాడటాన్ని కలవాటు పడలేదు. తప్పుని తోస్తే దప్పుకొట్టి మరీ చెప్పే శక్తి నాలో వుంది. నే అగాధంలో జారిపోతున్నానని తెలిసినా సరే ధర్మపథం విడిచి పెట్టను. నే నేదో అన్నానని ఇన్‌స్పెక్టరుగారు కోటూ బూటూ విడిచి రేపటినుంచి అద్దరు వస్త్రాలు, పంచ, చెప్పులు ధరించారను కుండి ఇలా ఎప్పటికప్పుడు రంగులు మార్చి చేసే చేష్టల్లో మార్పు రాకపోతే ఫలితమేముంది చెప్పండి!"

అందరూ హర్షధ్వానాలతో చప్పట్లు కొట్టారు.

"మావారు రెండుచేతులూ జోడించి చప్పట్లు కొట్టలేకపోతున్నారు. కారణం ఎదురుగా అధికారి, ఆయనను అనరాని మాటలంటున్న తన అర్ధాంగి. నాతో ఏకీభవించండి. మానండి. అనవలసిన నాలుగూ నిర్భయంగా అన గలిగాను. ఏనాడూ ఏ సభలోనూ మాట్లాడనిదానిని యీనాడు ఇక్కడ ఇంత సంకోచం లేకుండా మాట్లాడగలిగానంటే నాలో ఏ లోపమూ లేదన్నమాట" అంటూ తన కుర్చీలో కూర్చుంది.

వాగ్వివాదా లెందుకని పెద్దమాష్టరు ఇన్‌స్పెక్టరు అనుమతితో సభను ముగించాడు. ఎవరిండ్లకు వాళ్లు వెళ్ళిపోయారు.

అందరి మనసుల్లోను అందరి ఇళ్ళలోను విజయ మాటలే!.... కేంపు నుంచి తిరిగిపోతున్న ఇన్‌స్పెక్టరు రెండు చేతులూ పట్టుకుని విజయ మాటలు పట్టించుకోవద్దని మరీ మరీ బ్రతిమాలుకున్నాడు పెద్దమాష్టరు.

"సర్దుకుపోయే మనిషిలా లేదు. విప్లవభావాలు తప్పుగా కనుపిస్తే ఎలుగెత్తి చాటుతుంది. తానన్నదాన్లో నూటికి నూరుపాళ్ళు నిజముంది నూర్లాళ్ళ ఇన్‌స్పెక్టరుగా నా కామాత్రం తెలియకపోదు. అయినా నలుగురిలో నానా మాటలు- ఎటికి ఎదురీత- కొట్టుకుపోవటం తప్పదు. నే నవేవీ మనసులో పెట్టుకోనులెండి" అని సెలవుతీసుకుని వెళ్ళిపోయాడు....

....వేణుగోపాల్ మౌనాని కంతులేదు. భర్త ఎప్పుడు తనవైపు చూస్తాడో అని విజయ ఓ కంట కనిపెట్టి చూస్తూనే వుంది.

"నా మాటలకు అనిందిస్తారనుకున్నాను మౌనం పూనారు. మీ కిష్టంలేని పనిచేసినందుకు నా కెందుకో బాధగా లేదు సుమండీ! ధర్మం న్యాయం వాటికే కట్టుబడి వుంటాను. అధర్మ పద్ధతి కలవాటు పడితే ఇహంలో కావలసినంత సుఖం. అధర్మ పద్ధతిలో తరతరాలు అనుభవించడానికి ధనార్జనలో నే నిమగ్నులై వున్నారు, దేశ ప్రజలందరూను.... మాట్లాడమన్నారు మాట్లాడను. తప్పుని మాత్రం నా బ్రతుకు భగ్నమైపోయినా సరే అనను- అనబోను. అన్యాయాన్ని

"అందరికీ తెలిసిన విషయాలే! పైనుంచి క్రిందవరకూ వ్యాపార పద్ధతిలో జరిగిపోతోంది. తప్పక ప్రకటించండి" అని తన అంగీకారం తెలియచేసింది విజయ.

"తమ చేతుల్తో రాసివ్వండి- వంపి చవచ్చు..." అనగానే విజయ వ్యాస రూపంలో జరిగిన విషయాలను రాసి ఓ మారు చదివి వినిపించింది.

"చాల బాగుందమ్మా! ప్రగతిపథంలో ఎదుటివారిని నడవమని చెప్పి అన్యాయపథంలో చెప్పినవారే నడుస్తున్నారు" అంటుండగా వేణుగోపాల్ ఇంటికి వచ్చాడు. విజయ తన చేతిలోని వ్యాసాన్ని భర్తకిచ్చింది.

చదివిన వేణుగోపాల్, "విజయా! నీ నుంచి నా జీవితం సర్వనాశనమై పోతుంది. నీ వాదన నూటికి నూరుపాళ్లు సమంజసము. అంగీకరిస్తున్నను కదూ! నాలుగు కాలాలపాటు సంతోషంగా గడుపుదామనుకున్న నాకు మొదలోనే అంతరాయం...."

"సంతోషంగా జీవించటానికి అధర్మం ముసుగులో మౌనంగా వుండ మంటారా! మన కెందుకులే అన్న ధోరణి మంచిదికాదండీ! అన్యాయ ప్రవాహానికి ఎదురీదటం కష్టమని నాకూ తెలుసును. మునిగిపోయేది కూడ మనమే అని తెలుసును. అయినా భయపడకూడదండీ! తప్పుచేసిన ప్రతీవారు భయపడతారు. మన మెందుకండీ భయపడాలి?"

"ఎలా చెప్పేది విజయా నీకు! ఇలాంటి వార్తలకోసం పత్రికలవాళ్లు ఎదురుచూస్తుంటారు. నలుగురినీ ఆకర్షించేవాళ్లకే ఎక్కువ లాభం!- నీ ఇష్టం."

"మిమ్మల్ని పరీక్షిస్తున్నాను. దీనిని పంపే వ్యక్తికు పోస్టుచేయాలి"

వేణుగోపాల్ అంగీకారం తెలియచేశాక కాగితాన్ని మడచి జేబులో పెట్టుకున్నాడు. లోనికివచ్చిన విజయతో "నీ వందంగా వున్నావన్న సంగతి ఏ క్షణమూ మరచిపోలేదు విజయా! ఆ యువకులందరూ ఒకటిగా నీ వైపు గుడ్లప్పగించి చూస్తున్నారు. వాళ్లకి నీ సౌందర్య భావాలకన్న నీ అందమే ఎక్కువ మక్కువగా వున్నట్టుంది" అన్నాడు నెమ్మదిగా వేణుగోపాల్. ఆ మాటలకు విజయ మెనుకకు తగ్గింది. పెళ్లి కొరకు గంటల తరబడి అద్దంలో చూసిచూసి మురిసిపోయిన ఆ అందాన్ని స్ఫురణకు తెచ్చుకుంది....

గంటల తరబడి మౌనం.... ఆ మౌనంలోనే కాఫీ రాత్రి భోజనం పూర్తి చేసుకున్నాయి. ఎడముఖం పెడముఖంతోనే ప్రక్కప్రక్కనున్నాడు. ఎంతో

మధురంగా గడపవలసిన రాత్రులు ఇంతధ్వాన్నంగా వున్నందుకు వేణుగోపాల్ మనసులోనే బాధపడుతున్నాడు. మెల్లగా తల ప్రక్కకు తిప్పాడు. తనవైపు చూస్తున్న విజయను చూశాడు. మళ్లీ అటువైపు తిరిగింది విజయ. ఆమె ముఖంలో చిరునవ్వు గ్రహించిన వేణుగోపాల్ నెమ్మదిగా విజయను సమీపించి ఎత్తి ఎదకద్దుకున్నాడు.

"ఒంటరిగా పడుకోమనేనా మీవాళ్లు పెళ్లిచేసి నిన్నిక్కడకు పంపించారు? తలచుకుంటే జీవితాన్ని స్వర్గతుల్యం చేసుకోవచ్చును. స్కూలు విషయాల్లో కల్పించుకోకు విజయా!.... యీ కాగితం పంపమంటావా?"

"స్కూలు విషయాల్లోనే కాదండీ! ప్రతి విషయంలోను అన్యాయమని తెలిస్తే అక్కడ నేనుంటానండీ! మన కెందుకులే! ఎవడో ఒకడు చూసుకుంటా రంటారందరూను. ఆ 'ఎవరో ఒకరు' ఎవరని నే నడుగుతున్నాను. చెప్పండి సమాధానం! అదే మనమెందుకు కాకూడదు!"

"నీ కోర్కె ప్రకారం యీ కాగితం పత్రికకు పంపిస్తాన్లే విజయా! విభిన్న మనస్తత్వం గలవాళ్లం. ఆలుమగల మయాం- అందుకే ఒంటరిగా పడుకుంటాను విజయా!.... సరేనా?" అనగానే ఆ మాటకు సమాధానం చెప్పటం పోయి "ఆ కాగితం పంపుతారు కదూ!" అంది. వేణుగోపాల్ మనసులో భీషణ సంగ్రామం. చిరునవ్వుతో "పంపిస్తాన్లే విజయా!" అనిమాత్ర మనగలిగాడు....

తెల్లవారి లేవటమే వేణుగోపాల్ కాఫీ అయినా త్రాగకుండా స్కూలుకు పోయాడు. దగ్గరలోనే వున్న పెద్దమాష్టరింటివద్ద కాఫీ పుచ్చుకున్నాడు.

"చూడండి మాష్టరుగారూ! మా విజయ మరికొందరు యువకులు కలసి యీ పత్రం తయారుచేసి పత్రికకు ప్రచురణ నిమిత్తం పంపించమన్నారు. తన తృప్తికోసం అలాగే అన్నాను. కాని దీనివలన మన బ్రతుకులు అధ్వాన్నస్థితికి దిగజారేటట్టున్నాయి. ఏం చేయటానికీ పాలుపోవటంలేదు. యీ కాగితం మీ దగ్గరే వుంచండి. పంపానని చెప్తాను. తనకా మనఃశాంతి, మన ప్రాణాలకా తాత్కాలికంగానైనా శాంతి."

"యీ విషయం రహస్యంగా వుంచు ..నా కేదో బెంగగా వుంది" అంటూ ఇద్దరూ స్కూలుకు బయలుదేరారు.

...."ఇన్‌స్పెక్టర్‌గారూ! వేణుగోపాల్ భార్య విజయ రాసిన కరపత్రమిది. నేను చాకచక్యంగా దీనిని వేణుగోపాల్ దగ్గర సంపాదించాను. వీళ్లిద్దరూ కొందరు యువకుల్ని అభ్యుదయ భావాలంటూ ప్రోగుచేస్తున్నారు. మన పరపతి




ఇక్కడే కాదు, ఎక్కడికి పోయినా పోతుంది. వేణుగోపాల్ మీద తగు చర్య తీసుకోవలసిందిగా ప్రార్థిస్తున్నాను. యీ పత్రాన్ని తమ దగ్గర భద్రంగా వుంచండి- హెడ్మాష్టరు- కోడూరు.”

ఇన్‌స్పెక్టర్ ఆగ్రహాని కంతులేదు. ఆడది తన్నవమానించింది. దానిని విపులంగా పత్రికలలో కూడ ప్రచురించ ప్రయత్నం. తరతరాల ఆనవాయితీకి ఓ ఆడది అడ్డుతగులుతోంది. నా రంగు మార్చాలి. ఇన్నాళ్లూ నేను శాంతానికి చిహ్నమని పేరు పడ్డాను. ఈనాటినుంచీ ఎరుపు రంగులో మునిగి తేలాలి. క్రోధాగ్ని జ్వాలల్లో విజయనూ వేణుగోపాల్‌నీ మలమల మాడ్చి తప్పయింది క్షమించండి బాబూ అని కాళ్లబేరానికి వచ్చేటట్టు చేస్తాను” అనుకుంటూ ఆ స్కూలుమీద తాను రాసిన ఇన్‌స్పెక్షన్ రిపోర్టు అక్కడక్కడ మార్చాడు. పెద్దమాష్టరుగారు సకాలంలో పంపిన కరపత్రానికి కృతజ్ఞతగా ఆయన విధి నిర్వహణ చాల బాగుందని రాసి, వేణుగోపాల్ క్లాసులోని పిల్లలకు పాఠాలు సరిగా చెప్పలేకపోయారనీ, దానికాయన బోధనాపద్ధతిలో నిర్లక్ష్యమనీ పేర్కొన్నాడు....

బ్రాంచి పోస్టుమాష్టర్ వద్ద తీసుకున్న రిజిష్టర్డ్ కవరు పుచ్చుకుని తనకు వ్యతిరేకమైన వాక్యాలుంటాయేమో అని భయపడుతూనే విప్పారు. తన గురించి

రాసిన పొగడ్తల గురించి చాల సంతోషించాడు. వేణుగోపాల్ పై రిమార్కులు చదివి మనసులో ఆనందిస్తూనే పైకి విచారం వ్యక్తంచేశాడు.

"మాశావా వేణూ! నీ గురించి ఇన్‌స్పెక్టర్ రాసిన వ్యాకాలు! నిజంగా నీ వెంతో సమర్థవంతంగా చెపుతావు. కాని విజయ చర్యవల్ల నీకీ అపనింద వచ్చింది. యీ కాగితం నకలు నీకిస్తాను. సంజాయిషీ ఇచ్చేముందు విజయకోమారు దీనిని చూపించు."

"అలాగే మాష్టరుగారూ!" అంటూ వెలవెలపోయిన ముఖంతో ఇంటికి పోయి విజయకా కాగితం చూపించాడు.

"ఇంతమాత్రం దానికే భయపడిపోతున్నారటండీ! నామీద కోపం మీ మీద ఇలా చూపించారు. ఇది చాల అన్యాయం. మీ రెంతో తెలివైనవారు. పిల్లలకు చక్కగా చదువు చెపుతారని ప్రతీతి. దీనికి సమాధానంగా నే రాస్తా వుండండి" అంటూ విజయ కసిగా నాలుగుపేజీల సమాధానం తయారుచేసింది.

వేణుగోపాల్ కాగితాన్ని చదవకుండానే మడిచి జేబులో పెట్టుకున్నాడు.

"ఇందులో నీ సలహా తీసుకోవటమంటే ఏంటో తెలుసా విజయా! కుక్క తోక పట్టుకుని గోదావరి ఈదటంలాంటిది. ఈదినవాడు మునిగిపోతాడు. కుక్క చాకచక్యంగా ఒడ్డుకు చేరుకుంటుంది."

"సమస్యలను ధైర్యంగా ఎదుర్కోవటం పోయింది. సామెతలు మాత్రం చెపుతున్నారు- పై అధికారులకు ఇన్‌స్పెక్టర్ అక్రమ చర్యలు తెలియచేయండి."

"వాళ్ళంతా ఒకటే విజయా! వాళ్ళ దృష్టిలో మనలాంటివాళ్ళం దూది పింజలం- ఒక్క కలంపోటు చాలు- ఏ ఏజన్సీకో బదిలీ చేస్తేనో!"

"అక్కడంతా కొండవాళ్ళండీ! వాళ్ళ బ్రతుకులు మరీ అధ్వాన్నం-"

"అంటే? వాళ్ళను కూడ సరిదిద్దుతానంటావు. నా కనుకూలంగా నీవు మారలేవు విజయా!" అని తలకొట్టుకుంటూ పెద్దమాష్టర్ని కలుసుకున్నాడు.

"చూడండి మాష్టరుగారూ! రిపోర్టు చూపించాను. విజయ చలించలేదు. పై అధికారులకు పంపమని నాలుగు పేజీల గ్రంథం తయారుచేసింది."

పెద్దమాష్టరు చదువుకున్నాడు.

"వేణుగోపాల్! విజయ గురించి నీ అభిప్రాయమేంటోగాని నాకు మాత్రం విజయ ఆణిముత్యం బాబూ! మనం ఏ ఎండకాగొడుగు పడతాం. రకరకాల రంగులు సమయానుకూలంగా మారుస్తుంటాము. కాని విజయరంగు ఒకటే! న్యాయం-యీ కాగితంకూడా పంపానని చెప్పి విజయ మనసుకు శాంతి చేకూర్చు"

అని కాగితాలను చేతి సూట్ కేస్‌లో పెట్టుకున్నాడు పెద్దమాష్టరు....

"నీవు రాసిన కాగితంపై సంతకంచేసి మరీ యథాతథంగా పైఅధికారులకు పంపాను."

"మీ ధైర్యానికి చాల ఆనందిస్తున్నానండీ" అని భర్తను దగ్గరకు తీసుకుని "దేనికీ భయపడకూడదండీ! ధైర్యంగా ఎదుర్కోగలగాలి" అంది.

మళ్ళీ పెద్దమాష్టరు పంపిన జాబును ఇన్‌స్పెక్టర్ అందుకున్నాడు. తనపై జరుగుతున్న అన్యాయాలు సూక్తిముక్తావళి దండకంలా రాసి పంపిన విజయను తలంచుకుని మండిపడిపోతున్నాడు. పెద్దమాష్టరును మనసులోనే అభినందిస్తున్నాడు. డిఇఓను జరూరుగా కలుసుకున్నాడు.

"వేణుగోపాల్ నడవడి బాగులేదు సార్! ఇన్‌స్పెక్షన్ రిపోర్టులో విశదంగా రాశాను. చాలామంది యువకుల్ని తిరుగుబాటువాదులుగా తయారు చేస్తున్నాడు. అతి అందమైన భార్యను యీ మధ్యనే పొందగానే పిల్లలకు చదువు చెప్పటంలో ఏమీ శ్రద్ధ చూపించటంలేదు. ఈ వరవడి ఒక్కన టీచర్లకబ్బుతుం దనుకోండి. తిరుగుబాటు ధోరణి తప్ప చదువులు శూన్యమని మనవి చేసుకుంటు న్నాను."

"అయితే ఏం చెయ్యమంటారో చెప్పండి."

"రహీమ్‌కోట రౌడీలకు పుట్టిల్లు–పెద్ద స్కూలు. వేణుగోపాల్ నక్కడకు బదిలీచేయండి."

"అలాగే– రాంపురాను క్రమశిక్షణ లోపిస్తోంది."

"వాళ్ళ పనులు చదువులు చెప్పటం– విద్యార్థుల్ని ఉన్నతస్థితికి తీసుకు రావటం– అది పోయింది. మన లోటుపాట్లు ఎత్తి చూపుతున్నారు" అని సెలవు తీసుకుని వెళ్ళిపోయాడు ఇన్‌స్పెక్టర్....

.... వారం రోజులైనా తమ లేఖ ప్రచురింపబడకపోవటంతో విజయ "ఏమండీ! ఆ జాబు నిజంగా పంపించారా? చక్కగా వుంది– ఈనాటి కది ప్రచురించబడి వుండవలసింది" అని అనుమానంగా అడిగింది.

"పంపించాను విజయా! నచ్చనివో వచ్చును అలాంటి విషయాలు సవా లక్షలు దేశంలో– ప్రవాహంలో కొట్టుకుపోవడమే... మీ ఫిర్యాదు" అంటుండగా పెద్దమాష్టరు వేణుగోపాల్ ఇంటికి వచ్చారు. ముఖం కళావిహీనంగా వుంది.

"ఏం మాష్టరుగారూ! అలా వున్నారు? వినకూడని మాటలేమైనా వున్నాయా?"

"ఎలా చెప్పను వేణూ! రిపోర్టులో నీ మీద చివరి వాక్యం ఎంత పని చేసిందో చూడు- రహీంకోట కర్కుడిలాంటి హెడ్మాష్టరు.... అక్కడికి నిన్ను బదిలీ చేశారు.

"ఆఁ" అంటూ కుర్చీలో కూర్చున్నాడు.

విజయలో మాత్రం ఏ తొట్రుపాటు కనుపించలేదు.

"ఉద్యోగమన్న తర్వాత వెళ్లక తప్పుతుందా బాబాయ్‌గారూ!"

"అదికాదమ్మా! ఈ కోడూరు ప్రశాంతతకు పెట్టింది పేరు. మూడేళ్లు ఇక్కడ హాయిగా గడిపి పండంటి బాబుని కని నా ఆశీర్వచనాలతో మరో మంచి ఊరు వెళతారని నే నాశించానమ్మా! ఇంత తక్కువ వ్యవధిలో రహీంకోటకు బదిలీ.... నీవు ఎలాంటి విషయాన్నయినా అతి సులువుగా తీసుకుంటావు విజయా! కాని వేణుగోపాల్ మనసు అతి సున్నితమైనది. కష్టాలకు తట్టుకో లేదమ్మా!" అంటూ విజయ ఇచ్చిన కాఫీ తీసుకున్నాడు.

తన కిచ్చిన కాఫీని తిరిగి విజయకే ఇస్తూ "దీని బదులు విషం నయం విజయా! ఇంత తక్కువ వ్యవధిలో బదిలీ. పల్లెప్రజల్లో ఎంత అగౌరవం మనకు- ఇదంతా నీ మూలాన...."

"నే అన్నమాటల్లో అబద్ధముందా బాబాయ్?"

"లేదమ్మా! అక్షరాలా నిజం- అధికారులు రెండు రెండు ఐదనమంటే అనవలసిన రోజులు. మనుష్యులు మనసులు, అభిమానం అన్నీ అమ్ముకుని బ్రతుకుతున్న రోజులమ్మా!... కొత్త ఊర్లోనైనా ఏ విషయములోనూ కలుగ చేసుకోనని నాకు హామీ కావాలి విజయా! ....కుందనపు బొమ్మవు- అందరితో యుద్ధంచేస్తూ కూర్చుంటే నీ రంగే మారిపోతుందమ్మా!"

"నా రంగు మారితే మారవచ్చు గాని నా హృదయపు రంగు మాత్రం మారదు బాబాయ్! మీరు అధికారుల్ని పరోక్షంలో తిడతారు. సమక్షంలో పొగడుతారు. నే నందుకు సుతరామూ అంగీకరించను. అంగీకరించలేను కూడ."

"అన్యాయమనే మూర్ఖపు కొండతో ఢీకొంటున్న లేగదూడవమ్మా నీవు- లాభంలేదు. చివరకు నీవే ఓడిపోతావు."

"ఆ ఓటమినే చిరునవ్వుతో చివరిదాకా విజయంగానే భావిస్తుంది బాబాయ్ యీ విజయ."

వేణుగోపాల్ మనసు చిందరవందరగా వుంది. తా నాశించినదానికి భిన్నంగా ప్రవర్తిస్తున్న విజయను మనసులో అసహ్యించుకుంటూ పెద్ద

మాష్టరును కొంతదూరం అనుసరించి తిరిగివచ్చాడు.... వేణుగోపాల్ బదిలీ విషయం అందరికీ తెలిసింది. విజయ వెళ్ళిపోతే ఆ గ్రామం చంద్రుడులేని ఆకాశంలా వుంటుందని యువకులు, తెలిసినవారు తమతమ మనసులలో భావిస్తున్నారు....

"....నెలముందు అడ్వాన్సు వచ్చేవరకూ ఆగితే కొత్తస్కూల్లో ఏడు రోజుల్లో చేరలేను. అనారోగ్యమని సెలవుపెడితే ఇన్‌స్పెక్టర్ కోపంతో నాకు రావలసిన జీతం బిల్లులు వగైరా ఆపుతారు. ఇంటి పరిస్థితులు అధ్వాన్నంగా వున్నాయి. అమ్మ రాసిన జాబును బట్టి- వాళ్ళిద్దరూ మన దగ్గరకే వస్తే?"

"రానీయండి! తల్లినీ తోడపుట్టినవాడినీ చూసుకోవలసిన బాధ్యత మీకు లేదంటారా?"

"నీది మూర్ఖత్వమో మంచితనమో తెలిసికోలేకపోతున్నాను విజయా!... ప్రయాణానికి సన్నాహాలు చేద్దాం- తక్కువ సామాను తెచ్చుకోవడం మంచిదయింది."

"నా దగ్గర నాన్నగారిచ్చిన డబ్బుంది. క్లుప్తంగా వాడుకోవడంవలన ఎక్కువే మిగుల్చుకోగలిగాం. ప్రయాణానికి ఏర్పాటు చేయండి."

"ఎవరిని యాచించటమా అని తికమకపడుతున్న సమయంలో డబ్బు బెడద తీరింది విజయా"....

వేణుగోపాల్ గౌరవార్థం చిన్న తేనీటి విందు చేశారు.

"తప్పుచేయని వాడికి శిక్షపడుతుందని తెలిపే ఉదంతం వేణుగోపాల్ బదిలీ- అక్రమాలు జరుగుతున్నాయి. తప్పులు సరిదిద్దుకొమ్మని చెప్పటమంత అపరాధం మరొకటి దేశంలో లేదనుకుంటాను. విజయమ్మగారు ముక్కుకు సూటిగా మాట్లాడతారు. కల్లా కపటం లేనిది. అందుకే సంజాయిషీతో సహా వేణుగోపాల్‌ని రహీంకోట బదిలీచేశారు. అయినా ఫరవాలేదు. ఇక్కడ మనకు కళ్ళు తెరిపించారు. అక్కడివాళ్ళకు కూడ కళ్ళు తెరిపించటానికే వెళుతుందని ఎందుకనుకోకూడదు? మనందరం నడుంకట్టి ఎన్ని బస్తాల గోధుమనూక ఎన్ని డబ్బాల నూనె తదితర దినుసులు ఇట్లాంటివి మనక్కూడ చూపమందాం. దానితో ఏ ఒక్కరూ అక్రమ వాడకానికి పాల్పడరు" అంటూ విజయకు అందరూ కలిసి రెండుచేతులు జోడించి దండం పెట్టారు....రెండెద్దుల బండిపై సామాన్లతో వేణుగోపాల్ దంపతులు బయలుదేరారు.

పచ్చని బొలాలు- ఊర్మిలత్తమ్మగారింట వున్న రామచిలుకల్లాంటివి ఉల్లాసంగా కిచకిచలాడుతూ చీనా బాదంకాయల్ని తొలుచుకు తింటున్నాయి.

"ఏమైనా కబుర్లు చెప్పండి. ప్రయాణం కులాసాగా సాగిపోతుంది."

"ఏమున్నాయి విజయా! ఇంత చిన్నవయసులో నే ముసలివాడ్నయిపోయినట్టు బాధపడుతున్నాను.... వెళ్ళగానే అమ్మకు జాబు రాయాలి. లేకపోతే కోడూరులోనే వున్నామనుకుని రావటం, ఇబ్బందులకు గురికావటం జరుగుతుంది."

"అలాగేనండీ!"....

"రహీంకోట హెడ్మాష్టరుగారికి ఇన్‌స్పెక్టర్ సోమసుందరం వ్రాయునది: మీ స్కూలుకు కొత్తగా వస్తున్న వేణుగోపాల్ టీచర్ని జాగ్రత్తగా కనిపెట్టి చూడాలి. ఆయన భార్య విజయ విప్లవభావాలు కల అడది. స్కూలు విషయాలలో కలుగచేసుకుని మన పరువును బజారుపాలు చేయటమే ఆవిడ పని. మీ దగ్గర ఆ ఆటలు సాగవని మీ స్కూలుకు బదిలీ చేశాము. అన్నివేళలా వాళ్ళను కనిపెట్టుకు చూడాలి."

ఆ సాయంత్రం రహస్యంగా రహీంకోట హెడ్మాష్టరు టీచర్లందరితో అత్యవసర సమావేశం జరిపాడు. ఇన్‌స్పెక్టరుగారు రాసిన విషయాలపై విపులంగా చర్చించారు.

"సాధారణ స్కూలుటీచర్ భార్య బహిరంగంగా విమర్శ చేసిందట! కత్తిమీద సాము ని తెలుసుకోలేకపోయింది.కోడూరు మీటింగులో ఇన్‌స్పెక్టరుగారిని చాలా నీచంగా చిత్రిస్తూ మాట్లాడిందట! ఈ దేశం రివాజు అధికారులతో ఢీకొనటం కాదు. వాళ్ళతో మనకు సరిపడని విషయాలైనా సరే చేతులు కలపాలి. తప్పదు- మీ రందరూ వేణుగోపాల్‌ని కనిపెట్టి చూడాలి విజయను కనిపెట్టే పని మీ ఆడువారిది."

"అలాగే మాష్టరుగారూ! దౌర్జన్యానికి పేరుపడిన ఊరు రహీంకోట! అందరమూ ఒకే బాటను నడవాలి" అని సభను చాలించారు ..

ఇంతలో రెండెడ్ల బండిమీద గోధుమనూక- నూనెడబ్బాలు తదితర సామగ్రి వచ్చింది. బండివాడు గ్రామస్థులు కలసి సామాను లోనపెట్టించారు.

"రేపు పంపకాలు చూసుకుందాం. ఎవరిండ్లకు వాళ్ళు వెళ్ళండి. వేణుగోపాల్ విషయంలో నే చేయదలచుకున్నది ఆచరణలో పెట్టాలి" అని ఎవరిండ్లకు వాళ్ళను పంపించాడు.









లోన కూర్చుని రశీదులు పరిశీలిస్తున్నాను. వంటింట్లో పడిగాదిలా లోనికి వచ్చిన భార్య "పెద్దమ్మాయి పెళ్ళయి ఇన్నాళ్ళయిందా! దాని మెడలోకి పెడతా మన్న తాతు యీనాటికీ కూడా పెట్టలేదని దెప్పుతూ జాబు రాసింది. ఏదో విధంగా డబ్బు సర్ది దాని గొడవ తీరేట్టు చూడండి" అని ఒత్తిడి చేసింది.

"తెలుసుగా చూస్తున్నాను. అంతా పోగయిందనేసరికి నీకు జబ్బు- ఆ తర్వాత నా రోగం- మరో అల్లుడు [illegible] డబ్బు పంపకపోతే జీవితాంతం అమ్మాయిని మన ఇంటికి పంపనని నిర్మొహమాటంగా జాబు రాశాడు. మధ్యతరగతి కుటుంబీకులం- యీ బాధలు తప్పవనుకో! భగవంతుని దయవలన నెలనెలా పదిగంటల భోజన సదుపాయాల్లో మిగుల్చుకున్న డబ్బు సహాయకారిగా వుంటోంది. నే ఒక్కడినే మింగటానికి ప్రయత్నించానో అందరి నోళ్ళలో పడిపోతాను. ఇన్‌స్పెక్టర్ని చూడాలి. తోటివారిని చూడాలి. షాహుకారుకి బండి తోలేవాడిక్కూడా మా బ్రతుకుల చిదంబర రహస్యం తెలుసును. వాళ్ళ ముఖాలు ఎందుకు సూటిగా చూడగలుగుతున్నానంటావు! వాళ్ళు నాలాంటివాళ్ళే కాబట్టి- అదే విజయ ముఖం అంత సూటిగా చూడలేనే!"

"విజయ ఎవరండీ?"

"కొత్తగా వస్తున్న వేణుగోపాల్ టీచర్ భార్య."

"ఆ— అడదానికి భయపడతారేమిటండీ! చేతిలో ఎందరో ఆరితేరిన యోధానుయోధులుండగా."

"నిజమేననుకో! మన జాగ్రత్తలో మన ముండాలిగా! అన్యాయం అక్ర మాలు చేస్తున్నవారికి భయం కాక మరేముంది చెప్పు! యీ క్షణాన సిఐడిలు వచ్చారనుకో! రశీదులో ముప్పయి బస్తాల గోధుమనూక నలభై టిన్నుల నూనె జాబితా వున్నాయి. కాని మనకు వచ్చినవి పది చొప్పున మాత్రమే! మిగిలిన వాటి వివరాలడిగితే నోరు వెల్లబెట్టాలి. ఇన్నాళ్ళ ఆర్జించిన దాంతోపాటు కష్ట పడి పూర్వులార్జించిన వస్తువులు కూడా వాళ్ళ పాలు చేయాలి. ఇదంతా ఎందుకు చెపుతున్నానంటే అన్ని రోజులూ మనవి కావు. అణువు చాలు. పేలిందో కను చూపు మేర నాశనంచేస్తుంది."

"ఎప్పుడూ భయపడనివారు విజయకు భయపడిపోతున్నారు" అంటూ వంటగదిలోనికి పోయింది భార్య..........

రాత్రి ఎనిమిది గంటల సమయం. విజయ వేణుగోపాల్ బండిలో స్కూలు చేరుకున్నారు. స్కూలు వాచ్‌మన్ బండివాని సహాయంతో సామాన్లు దించి వరండాలో సర్దుకున్నారు.

"ఈ! రాత్రిపూట అందరినీ లేపి నిద్రాభంగం చేయటమంత మంచిది కాదు— రేపాదివారమేగా! హెడ్మాష్టరుగారిని తదితరులను కలుసుకుందాం. ఏదైనా ఇల్లు చూపించకపోరు" అంటూ "చూశారా! యీ ఎద్దులు అలసిపోయాయి. పాపం.... ముందు వాటికి రెండు బకెట్లతో నీళ్ళ సంపాదించండి. అందులో వాడిదగ్గరున్న తవుడు కలిపి పెడతాడు. కొందరు వాటి విషయమే పట్టించు కోరు" అంటూ వాచ్‌మెన్‌కి డబ్బులిస్తానని చెప్పి నీళ్ళ రప్పించింది.

ఎద్దులు తృప్తిగా తాగుతుంటే విజయ వాటి గంగడోలును జాలిగా నిమి రింది.

"బండబ్బాయ్! ఇప్పుడు నా మనసెంతో తృప్తిగా వుంది. నే స్టౌమీద వంట త్వరగా కానిస్తాను.... వాచ్‌మెన్, నువ్వు కూడా మాతోపాటే భోజనం చేయాలి" అని గంట వ్యవధిలో అన్నం వార్చింది. పప్పుపులుసు చేసింది. ఆవకాయతో అందరూ భోజనం చేశారు.

"అమ్మగారూ! మీ రీ గదిలో నిద్రపొండి...." మేం పైన వరండాలో వుంటామని వాచ్‌మెన్ చెప్పాడు..........

తెల్లవారింది. ముఖం కడుక్కుని వేణుగోపాల్ వాచ్‌మన్ సహాయంతో హెడ్మాష్టరింటికి వెళ్లి వినయంగా నమస్కరించాడు.

"మీ రిక్కడ జాయిన్ కానున్నట్టు ఆర్డర్లు నాక్కూడా వచ్చాయి... నిన్న రాత్రే వచ్చారన్నమాట? నాకు కబురు చేయవలసింది."

"రాత్రిపూట ఇబ్బంది పెట్టటం భావ్యంకాదని నా భార్య విజయ వాదన. తన మాట కాదనలేక వాచ్‌మన్ సహాయంతో స్కూల్లోనే గడిపామండీ."

"పాపం! చాలా శ్రమపడి వుంటారు. ఊరంతా దోమలు- ఎక్కడ చూసినా మలేరియా! అమ్మాయీ నీవూ ఆరోగ్యం విషయంలో చాలా జాగ్రతగా వుండాలి వేణుగోపాల్!

వేణుగోపాల్ మనసులోనే పెద్దమాష్టరు చాలా మంచివారని సంతోషిస్తున్నాడు. విజయ విషయ మాయనకు తెలియనందుకు కూడా ఆనందిస్తున్నాడు.

"ఎక్కడైనా చిన్న గది దొరికితే చాలు మాష్టరుగారూ! ఇద్దరమేగా! సర్దుకుపోతాం"

"అలాగే! యువజన సంఘం సెక్రటరీ కొత్త పేరున్నవాడు. ఆయనతో చెపితే తప్పక చూస్తాడు. నీ వొక్కడివే వస్తావనుకుని ఇంటి ప్రయత్నం చేయ లేదు.

"విజయను వంటరిగా అక్కడ విడిచి రాలేకపోయాను మాష్టరుగారూ!"

"చాలా మంచిపని చేశారు" అంటూ వాచ్‌మన్‌ని పిలిచి "సుధాకర్ ఇంటికి తీసుకువెళ్ళు- ఏదైనా గది చూపిస్తారు." అని చెప్పారు

తిరుగు ప్రయాణానికి సన్నాహమౌతున్నాడు బండివాడు. తవుడు, చిట్టు కొనిచ్చింది విజయ, త్రోవలో ఎద్దుల గురించి ఉపయోగించుమని. బండివాడు విజయను దీవించి ఎద్దుల్ని బండికి పూడ్చి తిరుగుముఖం పట్టాడు. తిరిగి వచ్చిన వేణుగోపాల్ కాఫీ టిఫిన్ పుచ్చుకుని వాచ్‌మన్ రాగా ఆయనతో వెళ్లి సుధాకర్‌ని క్లబ్‌వద్ద కలుసుకున్నాడు.

"మంచి రెండుగదుల ఇల్లు మాష్టరుగారూ! మొన్ననే ఒకాయన దిగిపోయారు. నాకు తెలిసినంత మట్టుకు వెదకటానికి వారం రోజులైనా పడుతుంది. ఈ క్లబ్బు నానుకుని పెద్ద గది కట్టించాము. దాని నెవరికైనా అద్దెకిచ్చి తద్వారా వచ్చే రాబడితో ప్రతినెల మంచిమంచి పుస్తకాలు కొని క్లబ్బుని అభివృద్ధి చేయాలనుకుంటున్నాడు. మీ కభ్యంతరం లేకపోతే ఇద్దరేగా! నెలకు ఎనభై రూపాయలు. దిగండి"

"సరేనండీ" అని గది చూసుకున్నాడు.

"బాగానే వుంది. క్లబ్‌కీ దీనికి సంబంధం లేదు. విజయను వొప్పించి తీసుకువస్తాను.

"ఒప్పించినా ఒప్పించకపోయినా రాక తప్పదండీ! ఇష్టం లేకపోతే స్కూలు వరండాలోనే వుండండి."

"అబ్బే! వస్తామండీ! రానన్నానో వేరెవరైనా దిగిపోతారు" అని విజయను తీసుకువచ్చి చూపించాడు.

"గ్రంథాలయం ప్రక్క గది. పవిత్ర దేవాలయంతో సమానమండీ! నాకు మాత్రం నచ్చింది."

సుధాకర్ విజయ అందాన్ని తనివితీరా చూస్తున్నాడు.

"సామాన్లు పట్టించుకు వస్తాము" అనగానే సుధాకర్ "ఒక నెల అద్దె అడ్వాన్సుగా ఇవ్వండి" అని రశీదు రాసిచ్చాడు.

"ఎనభై అన్నారు- యాభైకి రాశారేం?

"అదంతేనండీ! క్లబ్బుకి చెందేది యాభై రూపాయలు- నా కమీషన్ ముప్ఫయి రూపాయిలు- అందుకే తక్కువ అద్దెకు రశీదు."

"మీ సభ్యుల్ని మీరు మోసంచేయటం కాదా సుధాకర్‌గారూ! మీరు బ్రతకాలి- కాదనను. మోసం చేసి మాత్రం కాదు."

సుధాకర్ కోపం అణచుకుంటూ "యీ విషయంలో నేనూ మీ ఆయన గారూ చూసుకుంటావమ్మా! సామాన్లు పట్టించుకురండి" అన్నాడు.

"మా ఆయనగారైతే మాత్రం! మీతో చేతులు కలిపి అధర్మ పద్ధతి అవలంభిస్తారన్నమాట!"

"అమ్మా! విజయమ్మగారూ! మీరే గెలిచారు. నేనే ఓడిపోయాను. రశీదు చింపేస్తున్నాను" అంటూ వేణుగోపాల్‌ని మూగ సంజ్ఞలతోనే ఒప్పించాడు సుధాకర్.

"ఏదైనా మోసం కిందే వస్తుంది సుధాకర్‌గారూ! కానీయండి. సమయం వచ్చినప్పుడు దాని ప్రస్తావన తీసుకువస్తాను." అని సామాన్లు పట్టించుకు రావటానికి వేణుగోపాల్ వెంటపోతున్న విజయ అందచందాలను ఒంపుసొంపులను చూస్తూ అలాగే నిల్చుండిపోయాడు సుధాకర్!

"........విజయా! మరోమారు ప్రాధేయపూర్వకంగా కోరుకుంటున్నాను. ప్రతి విషయంలోనూ కల్పించుకుంటావు. సమయం వచ్చినప్పుడు ఆ గది






అద్దె గురించి చెపుతానన్నావు. స్థాన బలముంది వాళ్ళకు- ఏమైనా చేస్తారు చేయగలరు కూడా. మనం పొట్ట పోషించుకోవటాని కొచ్చాం. సంఘాన్ని సంస్కరించటానికి కాదు."

"పొట్ట పోషించుకుంటూనే మనల్ని మనం సంస్కరించుకుంటూ ఎదుటి వారిని సంస్కరించాలండీ!"

"మొండివాదన! నీ ఇష్టం...."

"ఆ పుస్తకమేంటి బాబూ? అలా దాచి తీసుకువెళుతున్నావ్?"

"మా పిన్ని తీసుకురమ్మందండీ."

"ఓమారు చూడనీ" అంటూ విజయ ఆ పుస్తకాన్ని చూస్తూ ముఖం చిన్నబుచ్చుకుంది. సరాసరి క్లబ్బువద్దకుపోయి సుధాకర్‌ని పైకి పిలిచి "చూడండి! మీ క్లబ్బులో ఇలాంటి పుస్తకాలు వాళ్ల పిన్ని చదువుతుందట" అని కోపంగా చూసింది.

"రెండో పెళ్లి-పసలేని ముసలి మగడు. పుస్తకాలతో కాలక్షేపంకాక తన్నెలా చావమంటారు చెప్పండి?"

"ఆ పుస్తకం ఆ అబ్బాయి చదివితేనో?"

"పొరవనీయండి- పోతేపోతాడు. మా క్కావలసింది పుస్తకాలకు అద్దె- మా పొట్ట పోషణ- తీరుబడిగా కూర్చుని నాలుగు కబుర్లు చెప్పడం కాదమ్మా! ఉదరపోషణార్థం బహుకృత వేషం"

"సంఘాన్ని తీర్చిదిద్దవలసిన యువకులు- మీరే ఇలా అంటే ఇప్పటికే ప్రతీ విషయంలోను దిగజారిపోయిన దేశం గతి ఏంకాను!"

"దేశం గురించి మన కెందుకమ్మా! ఎవడి బాధ వాడిది. ఏ ఎండకా గొడుగు పట్టడం నేర్చుకుంటేనే రాణించగలం" అంటూ సుధాకర్ స్కూలు కిచన్‌కు దారితీశాడు....

"గురూ! నూనె ఆవాలుపోపు వేసిన ఉప్మా స్పెషల్‌గా మీకు చేసుకొన్నది మిగిలితే మాత్రం పెట్టు- పిల్లలకంటూ చేస్తావే! అది మాత్రం పెట్టకు బాబూ! నూనెచుక్క లేకుండా అతి చాకచక్యంగా ఉప్మాచేసి పిల్లలకు పెట్టిస్తున్న మీ పెద్దమాష్టరుగారికి ఏ బిరుదివ్వాలో తెలియటంలేదోయ్!"

"తెచ్చిందంతా పిల్లలకే పెడితే ఇన్ని నోళ్లు తడవాలా బాబూ!" అంటూ స్పెషల్ ఉప్మా సుధాకర్‌కిచ్చాడు వంటవాడు.

కిచిన్ కార్యక్రమం చూసుకొమ్మని కొత్తగా వచ్చిన వేణుగోపాల్ మాష్టరుగారి కప్పగించారు హెడ్మాష్టరుగారు.

"అలాగా! అయితే అయనను బుట్టలో వేయాలి- అయన మంచివాడిలానే వున్నాడు. అయన భార్య విజయ.... ఏ చిన్న అన్యాయానికైనా ఒప్పుకోవటం లేదు. నాలాంటివాడినే హడలుకొట్టింది."

"అయితేనేం! మీ అక్క కిచిన్‌లోనేగా పనిచేసుకుంటుంది. అవిడ ద్వారా నీ వింటికి చేరవేసేవి ఇకపైని చాకచక్యంగా చేయి బాబూ" అంటుండగా తులసమ్మ కాగితపు పంచుల్లో సామాన్లు పెద్దసంచిలో వేసి తెచ్చి సుధాకర్ కిచ్చింది.

"రేపటినుంచీ చాలా జాగ్రత్తగా మసలుకోవాలి తులసమ్మా! కొత్త మాష్టరొచ్చారు. మనమేం చేసినా కనిపెడుతుంటాడు. అందుకని ఓ వారంరోజులు అయన ప్రవర్తన కనిపెట్టి చూడాలి. మనలో కలిసిపోతే ఫరవాలేదు. కాస్త చాదస్తం. తిక్కమనిషైతే మనం మరోలా మసలుకోవచ్చును."

"అలాగే బాబూ! ఇక్కడ చేరింది మొదలు ఇబ్బందిలేకుండా గడచి పోతోంది.... ఎప్పుడూ సుఖానికి నోచుకోలేదు. ఉద్యోగంలేని నీ దగ్గర వచ్చి చేరాను. నీవు మాత్రమేం చేస్తావు. క్లబ్బులో ఇక్కడా అక్కడా కాలక్షేపం"

అంటుండగా వేణుగోపాల్ చేతిలో కాగితాలతో అక్కడికి వచ్చాడు. సుధాకర్ వెనుక ద్వారంగుండా పైకి జారుకున్నాడు. గుమ్మం ప్రక్కను వినయ గా నిల్చున్న తులసమ్మ వేణుగోపాల్‌ను కళ్లార్పకుండా చూస్తోంది.

అప్రయత్నంగా తులసమ్మను చూసిన వేణుగోపాల్ కళ్లు క్షణకాలం ఆమె దేహంపై నిలిచిపోయాయి.

"ఎవరెవరు చూస్తున్నారేం కిచన్ వ్యవహారం!"

"నే వంటవాడ్ని బాబూ! ఆ వరండాలో మకాం- తులసమ్మ- పాపం.... చిన్నప్రాయంలోనే భర్తను పోగొట్టుకుంది. ఏ అధారమూలేక ఇక్కడ చేరింది" అంటుండగా తులసమ్మ కొస్త ముందుకువచ్చి వేణుగోపాల్‌కు నమస్కారం చేసింది.

"నీ విషయం విని చాలా విచారిస్తున్నాను.... ఒన్నకనం. జీవితంలో ఎన్నెన్నో కోర్కెలు. అన్నీ అణగారిపోయాయి. అడవిన కాచిన వెన్నెలంటారు .. ఇదే కాబోలు" అంటూ అక్కడున్న కుర్చీలో కూర్చున్నాడు.

వంటవాడు చేసిన కాఫీ పట్టుకుని తులసమ్మ పైకివచ్చి "బాబూగారూ! కాఫీ తీసుకోండి" అని చేతికందించింది.

వేణుగోపాల్ మనసు చలించిపోతోంది.

ప్రతీ విషయానికీ రాజీపడకుండా కర్కశంగా మాట్లాడే విజయతో తులసమ్మను పోల్చి చూస్తున్నాడు. అనురాగంతో ముందుకు వెళ్లి ఆనంద సముద్రంలో ఈదులాడాలన్న సమయంలో ఏవేవో పిచ్చి ప్రశ్నలు- ఎందుకో ఆ క్షణంలో విజయెంతందమైన మనిషైనా వెగటనిపిస్తుంది. తీరని తాపం తీరే చోటికి చేరానన్న ఆనందం పొందుతున్నాడు.

"నువ్వు కూడా కొంచెం తీసికో తులసమ్మా."

"నే తీసుకున్నాను బాబూగారూ."

"నే మాత్రం తీసుకోలేదా! మళ్లీ నీ విస్తే పుచ్చుకున్నానుగా! కాఫీకి ఫరవాలేదు. మరో కప్పు తీసుకురా" అని బలవంతంగా తులసమ్మచేత కప్పు రప్పించి కాఫీ పోశాడు. చిలిపిగా చూస్తున్న తులసమ్మ కళ్లలోనికి సూటిగా చూశాడు. తట్టుకోలేని ఆనందం పొందుతున్నాడు. అంతా వంటవాడు కనిపెడు తున్నాడు. తులసమ్మ వశీకరణంలో పడిపోతున్న వేణుగోపాల్‌ని అక్కడనుంచే దీవిస్తున్నాడు. తోడుదొంగల జాబితాలో నీవు కూడా చేరిపో బాబూ అని కోరు కుంటున్నాడు.

"బాబూ! నే ప్రక్క వరండాలో కాసేపు విశ్రాంతి తీసుకుంటాను" అని వంటవాడు తనలో తనే నవ్వుకుంటూ పోయాడు.

వేణుగోపాల్‌కు కొండంత బలం వచ్చింది. నిజంగా వంటవాడు పోయాడో లేదో అని తేల్చుకున్నాడు మరోసారి.

"కొద్దిగా నీళ్లు తీసుకురా తులసమ్మా నా కప్పు కడుక్కోవాలి."

"ఆ పని నే చేస్తాను బాబూగారూ."

"ఎవరి పని వాళ్లే చేసుకోవాలని మా విజయ వాదన."

"విజయెవరు బాబూ!"

"నా భార్య-చాలా అందమైన మనిషి తులసమ్మా! కాని నీతివిద్య చదువు కుందేమో అన్యాయం సహించలేదు. ఇక్కడ కాఫీ విషయం చూడు. అది పిల్లలకు చెందవలసింది. మీ రెందుకు తాగుతారని విరుచుకుపడుతుంది."

"అంత నిక్కచ్చిగా వుంటే వేగటం కష్టం బాబూ! ఇక్కడి సరుకులు మార్చి మనలాంటివాళ్లకు పనికొస్తుందని కాఫీపొడి పాలడబ్బాలు షాహుకారు వద్ద తీసుకువస్తుంటాము."

"పెళ్లయి కాపరంచేస్తున్నామే గాని తృప్తంటూ లేకపోతోంది" అని తులసమ్మ కళ్లలోనికి ఆశగా చూశాడు. శరీరాన్ని చీర చెరగుతో కప్పుకుంటూ సిగ్గుతో ముడుచుకుపోతూ మధ్యమధ్య వేణుగోపాల్‌వైపు కొంటెగా చూస్తోంది.

"తులసమ్మా! లోన స్టాక్ చూసుకోవాలి..... ఇంకా ఎన్ని బస్తాలు నూనె డబ్బాలున్నాయో!" అంటూ గదిలోనికి పోయాడు.

"వంటవాడు వస్తాడా!"

"రాడు బాబూ! అలసిపోయాడు. కాసేపు కొంగనిద్ర."

"అయితే లోనికివచ్చి లిస్టు ప్రకారం సామాన్లు చూపించు" అనగానే తులసమ్మ లోనికి వెళ్లింది. బస్తాలవీ లెక్కపెట్టుకున్నారు.

"స్టాకదీ సరీగా వుందే!"

"ఎందుకుండదు బాబూ! ఇక్కడ లేనివన్నీ ఖర్చయిపోయినట్టేగా! మిగలినవే స్టాక్‌లో చూపిస్తారు."

"అందరి బుర్రల్లోనూ ఒకలాంటి లెక్కలే."

"యీ తోడుదొంగల గూడుపుఠాణీలో మీరు చేరిపోతారా బాబూ."

"చేరదలచుకోలేదు."

"అయితే చిక్కుల్లో పడిపోతారు. నలుగురు నడిచే త్రోవను నడిస్తేనే రాణిస్తారు. మంచి త్రోవన్నారా! అప్పుడే బాబూ బాధలు మొదలుపెడతాయి."

"ఎంతో అనుభవమున్నదానిలా చెపుతున్నావు."

"నా భర్త చనిపోయాడు. ప్రైవేటు కంపెనీ- ఓ అయిదువందలు చేతిలో పెట్టారు. అది ఆయన చావు ఖర్చుల బకాయిలకే సరిపోయింది. మరి నన్నెలా బ్రతకమంటారు? హెడ్మాష్టరుగారి ధర్మమా అని సుధాకర్ చాకచక్యంగా నన్నిందులో పెట్టించారు.... నెలజీతం-రోజూ కడుపు నిండుతుంది. లేదా మరికట్టు కున్నట్టు ఏ అన్యాయానికీ నేను తలపడనంటే నేనెందుకూ పనికిరాను బాబూ! మోసం, అన్యాయం యీ ముసుగుల్లోనే రాణించవచ్చును."

"ఆ చదువులో విజయ యీ చదువులో నీవు డిగ్రీలు సంపాదించినట్టుంది."

"చాలసేపయింది మన మీ గదిలో వుండి- ఎవరైనా ఏమైనా అనుకుంటారు బాబూ!"

"ఎందుకనుకుంటారు? మనమేం కానిపని చేయటంలేదు కదా? నాకు హెడ్మాష్టరుగారు అదనంగా యీ పని అప్పచెప్పారు. నీ పని కిచన్‌లోపని- ఆడ మగ ఒకచోట చేరితే తప్పేమిటి?" అని తులసమ్మ చెక్కిలిపై తేల్చి నొక్కాడు.

"ఒక్క గడియలోనే ఎంత చేరువైపోతున్నారు! మీ విజయ చూస్తే పెళ్లి చేయగలదు."

"పెళ్లి - ఎవరికి? నాకా? పెళ్లయినవాడిని- మరి నీకైతేనో! పాపం! అలా అన్నానని బాధపడకు తులసమ్మా!" అంటూ దగ్గరసా తీసుకున్నాడు. బలహీనతకు లోబడిన రెండు హృదయాలు ఏకమైపోయాయి.

"విజయ నా కివ్వలేని పరిపూర్ణ సౌఖ్యం నా కిచ్చావు తులసీ! ఏనాటి అనుబంధ మంటావిది?"

తాగినవాడిలా మత్తెక్కినట్టు పిచ్చెక్కినట్టు చూస్తూ తులసమ్మ వేణుగోపాల్‌ని విడిచిపెట్టటంలేదు. బలవంతంగా కౌగిలినుంచి విడివడి వేణుగోపాల్ పైకివచ్చాడు. వేలకొలది విజయలు తన చుట్టూ చేరి భయంకరనృత్యం చేస్తున్నట్టని పించింది. చెమటలో తడిసిపోతున్నాడు. తులసమ్మ ముఖం చూడలేక సిగ్గుతో హెడ్మాష్టరు దగ్గరకువచ్చి కిచన్‌లోని సామాన్ల విషయం చెప్పాడు.

"చెపుతున్నప్పుడు తడబడిపోతున్నావ్ వేణూ."

"అబ్బే! గదిలో లైట్లు ఆరిపోయాయి.... తులసమ్మ చిన్న బుడ్డీదీపం వెలిగించింది. ఉక్కలో ఉడికిపోయి వచ్చాను."

"కొన్నాళ్లకు అలవాటైపోతావు. ఇంటికన్న అక్కడే సౌఖ్యంగా వుంటుంది" అన్నాడు హెడ్మాష్టర్ వ్యంగ్యంగా.

ఆ మాటలకు వేణుగోపాల్ బెదరిపోయాడు.

"మధ్యమధ్య క్లాసులు చూసుకోండి. ఒకటి రెండుమార్లు మాత్రం కిచన్ వ్యవహారాలు చూడండి."

"అలాగే సార్!" అని వేణుగోపాల్ ఇంటిముఖం పట్టాడు. కొద్దిసేపటిలో సుధాకర్ తులసమ్మను కలుసుకున్నాడు.

"వేణుగోపాల్ వచ్చి వెళ్లటం చూశాను."

"కిచన్‌లో స్టాకు చూశారు. మనమెంతంటే అంతే!"

"కాని ఆయన భార్య విజయ అట్లా కాదు విరుచుకుపడుతుంది. చిన్నది కాని పెద్దదికాని- అన్యాయం సహించలేదు. వజ్రంలాంటి మనిషి. నిలువునా చీల్చినట్టు మాట్లాడుతుంది."

"అఁ- జరిగిపోతుంటే అట్లానే మాట్లాడతారు. నాలాంటి బ్రతుకు తనకు సంభవిస్తేనో! నీతినియమాలకు తిలోదకాలివ్వాలి సుధాకర్."

"వేణుగోపాల్ చావాలని కోరుకుంటున్నావా?"

"లేదు సుధాకర్! ఆ మాష్టరుగారు చాల మంచివారు" అంటూ పావుగంటలో జరిగిన సంఘటనలను తులసమ్మ నెమరువేసుకుంటూ పులకరించిపోతోంది.

"మరికొన్ని సామాన్లు పట్టుకెళ్లు తమ్ముడూ! వంటవాడు నిద్రపోయాడు. వేణుగోపాల్ కూడా మనల్ని అడగలేదు.... పాపం జాలిగుందె! ఎవరూ చూడకుండా తీసుకువెళ్లు" అని సామాన్లతో సుధాకర్‌ని పంపించింది.

ఆవులింతలు తీస్తూ వంటవాడు లేచాడు. తులసమ్మను నఖశిఖ పర్యంతం కనిపెట్టి చూస్తున్నాడు. తులసమ్మ వంటవాడిముఖం సూటిగా చూడలేకపోతోంది.

"రోజూ మామూలుగా మాట్లాడేదానివి. ఈవేళ సిగ్గుపడుతున్నావేం తులసమ్మా!"

ఏం లేదన్నట్టు తల ముద్దుగా వూపింది.

"ఏదో వుంది. ఆడదానివి. మరో మగాడితో నోరువిప్పి చెప్పలేవుగా! వ్యవహారాలు మూడో కంటికి తెలియకుండా జరిగిపోవాలి. స్టాకు చాలటంలేదని మరికొన్నింటికి పెడతారట! ఇలాంటి సమయంలో మనం వేణుగోపాల్‌తో మంచిగా వుండటం అందరికీ మేలు తులసమ్మా- నీతి న్యాయం అంటే మాత్రం కడుపు నిండదు- అలసిపోయినట్టున్నావు- కాస్తన్నం తిని నిద్రపో" అన్నాడు.

వేణుగోపాల్‌ని తలంచుకుంటూ తులసమ్మ నిద్రపోయింది. నిద్రలో కూడా వేణుగోపాల్ కనుపిస్తున్నాడు. ఆయనతో గడిపిన క్షణాలు మధురంగా కలలు




కంటోంది. వక్కలు తమలపాకులు కొనుక్కోవటానికి పైకివెళ్లిన వంటవాడు హెడ్మాష్టర్ని కలుసుకుని వేణుగోపాల్ వలన తమ వ్యవహారాలేమీ పైనిపడవనీ దానికి ఎరగా తులసమ్మను వాడుకోవచ్చనీ చెప్పాడు.

"ఆ ఊర్లో గొడవలుపడి వచ్చాడు. మన కనుకూలంగా నడచుకుంటే అంతే చాలు. అందుకే కీలకమైన స్థానంలో వేణుగోపాల్ని వేశాను-తిరుగుబాటు చేశాడో తన గోతిలో తానే పడతాడు. తర్వాత విజయ కాళ్లుపట్టుకున్నా లాభంలేదు" అంటుండగా వంటవాడు తిరిగివచ్చాడు.

"ఏమిటి? మీలో మేరే నవ్వుకుంటున్నారు? కారణం తెలిసికోవచ్చా!"

"ఏం లేదు విజయా! చిన్నచిన్న చిలిపి విషయాలు గుర్తుకొస్తుంటాయి- నవ్వుకుంటున్నాను."

"చిలిపి విషయాలు.... అంటే మీరు చేసినవా, మీ బడిపిల్లలు చేసినవా?"

"నే చేసినవైతే ఇంత బాహాటంగా నీ ముందు నవ్వగలనా విజయా!.... బడిపిల్లలు.... వాళ్ల పిచ్చిపిచ్చి ప్రేమపాటలు."

విజయ మౌనంగా వింటోంది.

సమయానుకూలంగా సాకు చెప్పినందుకు తనలో తానే తన వాకచక్యానికి మెచ్చుకుంటున్నాడు వేణుగోపాల్.

"ఆ ఊరుకన్న ఈ ఊరో కుర్రవాళ్లు ఆకతాయితనంగా తిరగటానికి కలవాటుపడినవారిలా కనిపిస్తున్నారు. ఏదో పనున్నట్టు ఇటుఅటు తిరుగుతూ నన్ను తేరిపార చూడటానికి ప్రయత్నిస్తున్నారు. మరీ అందంగా వుండటం.... నాలో నాకే అసహ్యంగా వుంది. వీళ్లందరకూ నాయకుడు సుధాకర్‌లా వుంది. ప్రతీ విషయానికీ ఆయన సలహా అడుగుతుంటారు."

"కిచన్‌లో తులసమ్మనే వితంతు వుంది- సుధాకర్ అక్కట! ఆవిడ పొట్టపోషణక్కడ- సుధాకర్‌కు క్లబ్బు ద్వారా కాలక్షేపం."

"లోన పేకాట కూడా జోరుగా సాగుతోంది. పందెం కూడా కాస్తున్నారు. బడి పుస్తకాలుతప్ప తక్కిన చెడుపుస్తకాలవీ చదివి పాడైపోతున్నారు."

"మన కెందుకు విజయా వాళ్ల విషయం! నీవు కల్పించుకున్నావనుకో! నీ మీద లేనిపోని అబాండాలు వేస్తారు- జీవితాంతం ఆ మచ్చతో బ్రతకలేం!"

"అబాండాలకు నేను భయపడనండీ! ఇది అన్యాయమని చెప్పటం ప్రక్కవారిగా మన విధి. ఎవరికి వారే నాకేమనుకుంటే ఎలా దేశం బాగుపడుతుందండీ! ఇలాంటివి అందరికీ సంబంధించిన విషయం- మీ తమ్ముడినే ఇక్కడికి తీసుకు వచ్చారనుకోండి. వీళ్లతో తిరిగి పాడయిపోతాడు. ఒకరిని చూసి మరొకరు సక్రమమార్గ మవలంభించాలి గాని ఎందుకూ కొరగానివారిగా మారిపోకూడదు."

"పల్లీ మొదటికే వస్తున్నావు విజయా! రౌడీమూకతో మనం వేగలేమంటే వినటంలేదు.... ఇంతలో మరేదైనా గది తీసుకుందాం. లేదా వాళ్ల చర్యవల్ల నీవు రెచ్చిపోవడం- ఏమైనా అనడం- చివరకు నష్టపోయేది మనమే విజయా."

"నష్టపోతామని భయంతో, స్వలాభంతో ముందంజ వేయనక్కర్లేదా! అప్పుడు ఇప్పుడు ఎప్పుడు ఒక మాట మాత్రమే! న్యాయం- అక్రమాల్ని అన్యాయాలను ఎదురించి నిలబడగలగాలి. దేశమంతా ఇలా జరిగితే అన్యాయం జరగటానికి తావంతగా వుండదు కదండీ!"

వేణుగోపాల్ విజయవైపు జాలిగా చూస్తున్నాడు.

"జాలి చూపులకు నేను లొంగను మాష్టరుగారూ! ఎవరైనా నా కొకటే! చీట్లాట, బూతుపుస్తకాలు క్లబ్బునుంచి తొలగించేటట్టు చేస్తాను"

"భోజనం వడ్డించు విజయా!" అనగానే విజయ భోజనం వడ్డించింది....

"సుధాకర్! చిన్న మీటింగు ఏర్పాటుచేసి విజయను మాట్లాడమని చెప్పాలి. అదే సందర్భంలో వీలైనంత చందా కూడ వసూలు చేయవచ్చును" అని ఒక మిత్రుడు సలహా ఇచ్చాడు.

"అలాగే! ఇప్పుడే ఆమెను కలసి సభ్యుల అభిప్రాయాన్ని తెలియ చేస్తాను" అని మెల్లగా వెళ్ళి నిల్చున్నాడు.

"ఎవరది? సుధాకర్! ఏం పని బాబూ!"

"క్లబ్బు మీటింగు సాయంత్రం ఏర్పాటు చేసుకుంటున్నాం. మీరు సభను ప్రారంభించటానికి కంగీకరించాలి."

"నేనా! నే వచ్చినా నాకు నచ్చని పద్ధతులు మీ రవలంభిస్తున్నారు. వాటిని ఎలుగెత్తి చాటుతాను. తర్వాత నన్ను నిందించి లాభంలేదు."

"కుర్రాళ్ళ రెచ్చిపోతారు"

"రెచ్చిపోనీ! అలా ఐతే నే రావటం మానుకుంటాను."

"మీలాంటి సంస్కారవంతులుండటం వలన సభ నిండుగా కళకళలాడు తుందండీ"

"నా అందంతో సభను శోభాయమానంగా తయారుచేయాలని మీరు కోరుకుంటున్నారు. కాని నా సలహాలతో వాళ్లను తీర్చిదిద్దాలని నే ననుకుంటున్నాను."

"మీ ధోరణి మీది విజయగారూ! వాళ్ళందరూ కోరారు. మీరు తప్పక రావాలి. వేణుగారిని కూడ వచ్చి ఆహ్వానిస్తాం" అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఆ సాయంత్రం చేయవలసిన ఏర్పాట్లు చేశారు సభకు. విజయ వచ్చి వేదికపై కూర్చుంది. అందరి చూపులూ ఆమె అందచందాలపైనే! సుధాకర్ సభను ప్రారంభిస్తూ విజయను మాట్లాడమన్నాడు. విజయ వినయంగా లేచి నిల్చుంది.

"గ్రామంలో ఇందరు పెద్దలుండగా నన్నే యీ సభకు ప్రత్యేక అతిథిగా పిలవటంలో ఉద్దేశం నా కర్థంకావటంలేదు. అయినా పిలిచారు కాబట్టి అంగీకరించ వలసివచ్చింది. క్లబ్బులో చదువుకుంటున్నవారు చదువంటే శ్రద్ధలేనివారు కూడ వుండటం గమనించాను. అసలు చదువుకు ఎగనామంపెట్టి క్లబ్బులో అసభ్యకర మైన పుస్తకాలు చదువుతున్నారు దీని వలన విద్యార్థులు పాసవటాని కేమాత్రం అవకాశంలేదు క్రమశిక్షణ లేనివాళ్లు, మాష్టర్లంటే గౌరవంచనివాళ్లు జీవితంలో వృద్ధిలోనికి రాలేరు. చీట్లాట పొగత్రాగటం ఇవి దుర్వ్యసనాలు వీటన్నింటికీ సుధాకర్. బాధ్యుడు తలితండ్రుల ఆదరణలోవున్నవారు మూడుపూటలూ భోజనం-

చదువు మిషమీద క్లబ్బు- చదివేవి చవకబారు సాహిత్యం- తద్వారా తుచ్ఛమైన కోర్కెలు. వయసు దాటిపోయిందో ఏ ఉద్యోగానికీ పనికిరాకుండపోతారు. ప్రక్కవాడితో పోటీపడి చదవాలి. అప్పుడే చక్కటి మార్కులు - ఎక్కువ మార్కులు వలన ఉద్యోగార్హతలు వాటంతటవే వస్తాయి. నా హితవచనాలు సుధాకర్‌కి ఆయన అనుచరులకు సుతరామూ నచ్చవు. రోగికి పథ్యం పెట్టినట్టుంటుంది. ముగించేముందు పెద్దలందరినీ చిన్న కోర్కె కోరుతున్నాను తమ పిల్లల దినచర్య కనిపెట్టి చూడాలి" అంటుండగా కొందరు ఉత్సాహంగా చప్పట్లు కొట్టారు. యువకులలో కొందరామెవైపు క్రోధంగా చూస్తున్నారు

"సుధాకర్! మీరేమైనా చెప్పదలచుకున్నారా!"

"చెప్పవలసినవన్నీ మీరే చెప్పారు. క్లబ్బులవలన పిల్లలు చెడిపోతున్నారని మీ రన్నారు. ఇది చాలా అన్యాయం. ఒకరి భావాలొకరు తెలిసికోవటానికే కొత్త పుస్తకాలు వార్తాపత్రికలు చదవటానికి చేరుతారు గాని చెడిపోవటానికి కానేకాదని ఇక్కడ చేరిన పెద్దలకు మనవిచేసుకుంటున్నాను" అన్నాడు సుధాకర్.

"అయితే యీ పెద్దలను తీసుకుని నేను క్లబ్బులోనికి వచ్చి వాళ్ళు చదివే పుస్తకాలు చూపిస్తాను. వాళ్ళాడే పేకాట కూడ చూపిస్తాను. వాళ్ళక్కడ కాల్చి పారేస్తున్న సిగరెట్లను బీడీలను కూడ చూపిస్తాను. అనుమతిస్తారా సుధాకర్!"

సుధాకర్ తడబడిపోతున్నాడు.

"యీ సభ ఇంతటితో ముగించేస్తున్నాను ఎవరింట్లకు వారు పోవచ్చును" అని మాత్ర మనగలిగాడు. లేచిపోతున్న విజయవైపు క్రోధంగా చూస్తున్నాడు.

"మంచి పనిచేశావు సుధాకర్! సభను ముగించకుండా మా పెద్దలను లోనికి రానిస్తే వాళ్ళ కంటపడకూడనివి కూడా పడతాయి. విలాసంగా తిరగటాని కలవాటు పడినవాళ్ళం. నీకులు వల్లిస్తే కాళ్ళూచేతులూ కట్టినవాళ్ళలా గింజుకోవలసి వస్తుంది. తెలిసికూడా నీవామెను సభకు పిలిచి ప్రారంభించమనటం నీదే తప్పు సుధాకర్" మిత్రులు మందలించారు.

"అందమైన ఆడదానితో సభను ప్రారంభిస్తే సభ నిండుగా వుంటుందని భావించానే కాని ఇన్ని అవాకులూ చెవాకులూ విజయ తెచ్చిపెడుతుందని ఎవడనుకున్నాడు." అని మిత్రులకు సమాధానమిచ్చి శాంతపరిచాడు....

ఇంటికి వచ్చిన విజయవైపు వేణుగోపాల్ జాలిగా చూస్తున్నాడు.

"ఎలా చెప్పను విజయా నీకు! ప్రతీచోట ప్రతీ విషయంలోను కల్పించుకుంటున్నావు. నీకు కావలసినంత స్వేచ్ఛ- అపూర్వ గౌరవం- సన్మానాలు. నీ

దగ్గర నేను కొడిగట్టిన దీపాన్ని-"

"అలా అనుకుంటారేం! నా ఉద్దేశాలతో ఏకీభవించలేక అలా అనుకుంటున్నారు. అంగీకరించి ఏకీభవించారో యీ ఇబ్బందులుండవు కదండీ."

"జీవితాన్ని చేజేతులా పాడుచేసుకుంటున్నావు విజయా! నీ చర్యలన్నీ మీ నాన్నకు రాయాలనుకుంటున్నాను- ఆయన వచ్చి సరిచేస్తే సరి. లేదా విడిపోవలసివస్తుంది విజయా."

"ఒకరినొకరం అభిమానంగా చూసుకుంటున్నాం-ప్రేమించుకుంటున్నాం-విడిపోవడమన్న ప్రశ్నే లేదండీ."

"నీ వెన్ని చెప్పు- కలిసిమెలిసి వుండటం కష్టంగానే వుంది. అటు నా అధికారులతో, ఇటు గ్రామంలోని యువజనులతో.... వేగటం కష్టం విజయా! యీ పరిస్థితుల్లో కొన్నాళ్ళు మీ ఇంటివద్ద వుంటావేమో చెప్పు."

"మీరు తగిలితే పిరికిదానిలా పారిపోడానికి రాలేదు. మీ అర్ధాంగిగా జీవితాంతం జీవించటానికి వచ్చాను."

"మీ నాన్నకు రాయమంటావా?"

"నా మీద మీ అభిప్రాయం ఏదికానీ రాయండి- రాయొద్దని ప్రాధేయపడను. నే దేనికీ భయపడనండీ! తప్పుచేసినవాళ్ళు భయపడతారు. నేరం చేసినవాళ్ళు సిగ్గుతో తలవంచుకుంటారు. నాన్నా అమ్మా వచ్చినా నా నిర్ణయం మారదు.... ముందీ టిఫిన్ చేయండి."

"చేసి ది చేయటం.... కోపం తగ్గించటానికి టిఫిన్ కానీయమంటావు."

"మీరు పొరపడుతున్నారు. నా ఉద్దేశం అది కాదు. టిఫిన్ చేయమనటం నా విధి కాదంటారా?"

"తలనిండా పుట్టెడు మాటలు.... తీసుకురా! కాసేపైనా సంతోషంగా ఒకరి కెదురుగా ఒకరు కూర్చుని టిఫిన్ చేద్దాం...."

...."వేణుగోపాల్‌గారూ! స్కూలుకు బయలుదేరారా?"

"అవును సుధాకర్."

"చూశారా! నిరుద్యోగులం. ఏదో కాలక్షేపం చేస్తున్నాం. మా పరువంతా విజయమ్మగారు అందరి సమక్షంలో తీసిపారేశారు."

"నాకు మాత్రం అది సమ్మతమంటావా సుధాకర్? అలాంటిదని తెలిసి కూడ పిలిచావు. ముక్కుకు సూటిగా చెప్పుకుపోతుంది. నన్నేం చెప్పమంటావో చెప్పు."

"మీ ముఖం చూసికాని, లేదా ఏదైనా చర్య తీసుకునేవాళ్ళం."

"అబ్బే! నా మాట వినండి. తొందరపడకండి."

"కొందరి తలితండ్రులు నా దగ్గరకొచ్చి విజయను సమర్థించారు. సెక్సు పుస్తకాలు చీట్లాట హౌస్‌ఫుల్ ఆటలు తీసిపారేయమన్నారు. దానిమీదే కదా నా రోజువారీ ఖర్చు."

"మధ్యను నేను నలిగిపోతున్నాను. ఎందుకూ కొరగానిదానిని చేసుకున్నా నే నెంతైనా సుఖపడేవాడిని. రాజకీయాలు అవగాహన చేసుకున్న విజయను చేసుకుని క్షణక్షణం నేను చిక్కుల్లో పడిపోతున్నాను. ఆ ఊర్లో ఇన్‌స్పెక్టర్ని ఎదిరించింది. ఫలితం బదిలీ- ఇక్కడ మా జీవితాలెలా తారుమారౌతాయో వేచి చూడాలి."

"వేచి చూస్తే ఎలాగూ తలక్రిందులౌతాయి. అలా కాకుండా విజయ చర్యలకు ఆనకట్ట కట్టగలగాలి."

"తానా పేరుకోసం ప్రాకులాడటంలేదు. మనతోపాటు మన తోటివాళ్ళు సంస్కరించబడాలన్నదే తన వాదన. కాదనను. మన కెందుకంటే మాత్రం ఒప్పుకోదు. ఎవరికి వారే అలా అంటే ముందడుగు వేసేదెవరు? అని ప్రశ్నిస్తుంది సుధాకర్! మీవాళ్ళతో చెప్పు- విజయ నీ తోడపుట్టిన తులసమ్మగా భావించు."

సుధాకర్ ఆ మాటలకు సమాధానం చెప్పలేకపోయాడు. వేణుగోపాల్ చేతిలో చేయివేసి హామీ ఇస్తున్నవాడిలా ముందుకు సాగిపోయాడు సుధాకర్....

వేణుగోపాల్ పాఠాలు చెబుతున్నాడే కాని మనసంతా వికలంగా వుంది. పిల్లలడిగే ప్రశ్నలకు సమాధానం చెప్పలేకపోతున్నాడు. ఒకవైపు విజయ తిరుగుబాటు. మరోవైపు తులసమ్మతో ప్రణయ జీవితం. పరాయిది తులసమ్మ ఇస్తున్న సౌఖ్యం అగ్నిసాక్షిగా పెండ్లాడిన విజయనుంచి పొందలేకపోతున్నానే అని బాధపడుతున్నాడు.

"మాష్టారూ! పేపరు చూసేవుంటారు. ఒకమ్మాయిని దుండగులెత్తుకు పోయి తలితండ్రులు డబ్బిస్తేనే కాని విడిచిపెట్టలేదట! ఇలాంటివారికి తగిన శిక్ష వుందంటారా సార్?"

"శిక్ష? దేశంలో నేరానికి తగిన శిక్ష లేదమ్మా! పొరపాటున కేసు పెడితే గవర్నమెంటుకు వేలకొద్దీ డబ్బు ఖర్చు- సంవత్సరాల తరబడి కేసు నడిచి చివరకు కేసు వీగిపోతుందమ్మా!"









"మీ ఆవిడగారు నిన్న సభలో చాల చక్కగా మాట్లాడారు మాష్టరు గారూ!"

"మా విజయ- ఉన్నదున్నట్టు చెపుతుందమ్మా! ఆ పద్ధతి యీ రోజుల్లో ఎవరికీ నచ్చదు. అందుకే తానందరివద్దా చెడ్డయిపోతోంది" అంటూ పాఠాలు మొదలుపెట్టారు.

కాసేపటిలో టిఫిన్ బెల్ మ్రోగగానే తరగతుల వారీగా పిల్లలు వరుసలో నిల్చున్నారు. ఒకరు ఆకులు పంచుతున్నారు. వంటవాడు గరిటతో ఉప్మా పంచుతున్నాడు. ఆకలితో వున్న పిల్లలు తృప్తిగా తింటున్నారు.... కాని కలిగినవారి పిల్లలు ముఖం చిట్లించుకుంటున్నారు. "ఈ ఉప్మాలో నూనె అంటూ లేదు తులసమ్మా! నూనె లేకుండా ఉప్మా చేసేవిధానం మీకు తెలిసినట్టు మరెవరికీ తెలియదనుకుంటాను."

"దాన్నే పొదుపంటారు పాపా! దేన్నయినా తూచి తూచి వాడాలి."

"ఎప్పటికప్పుడు సరకు సరఫరా చేస్తున్నారు. కాని మీరు మాత్రం శుభ్రంగా చేయటంలేదు. కొందరు పిల్లలకు పడక విరేచనాలు పట్టుకుంటు న్నాయి."

"విజయమ్మ మీటింగుకి వెళ్ళినట్టుంది. అందుకే యీ మాటలు.... దీంతో మా కడుపులు నిండటంలేదు, మధ్యాహ్న భోజన పథకం రావాలి. మా కడుపులు నిండాలి" అంది తులసమ్మ.... పిల్లలందరూ వెళ్ళిపోయారు. తలుపు చాటుగా నిల్చుని ఉప్మా తింటున్న తులసమ్మను ఓరగా చూసిన వేణుగోపాల్ "ఆ పాప అన్న మాటలు మా విజయ మాటల్లానే వున్నాయి తులసమ్మా! నూటికి నూరుపాళ్ళ నిజం. నూనె అంటూ లేకుండా ఉడకబెట్టిన ఉప్పుపిండి వాళ్ళకు పెడుతున్నాం.... ఆ పాపం నాక్కూడా చుట్టుకుంటుంది" అన్నాడు.

"పాపమూ లేదు పుణ్యమూ లేదు. అన్నీ మనం కల్పించుకున్నవే."

"అబ్బో! వేదాంతం."

"సాయంత్రం ఓ మారు రావాలి మీరు- విజయమ్మ అడిగారో స్టాక్ చూసుకోవాలని చిన్న సాకు చెప్పాలి. ఎందుకో ఇద్దరి మనసులూ కలిశాయి. చూడకపోతే మనసెంతో బాధగా వుంటుంది."

"అలాగా! తప్పక వస్తాను తులసమ్మా" అంటూ క్లాసులోనికి పోయాడు...

"....విజయా! ఏడయింది కదూ! అప్పుడప్పుడు స్టోర్‌లో సామాన్లు పోవటం గమనించాను. రహస్యంగా వెళ్ళి నిల్చుంటాను- త్వరగా తిరిగి వచ్చేస్తాను" అని చిన్న సాకుతో వేణుగోపాల్ స్టోరురూమ్‌కి వచ్చాడు....

"రండి మాష్టరుగారూ! వంటవాడు టూరింగు సినిమాకు పోయాడు. పది గంటలు దాటితేనేగాని రాడు. అంతవరకూ నే ఒంటరిగా వుండాలి" అంటుండగా వేణుగోపాల్ మెల్లగా లోనికి వెళ్ళాడు.

"పెద్దమాష్టరుగారు ఎవరైనా వస్తారా తులసమ్మా!"

"రారు బాబూ! మనమీద నమ్మకంతో అంతా మనకే విడిచిపెట్టారు... వచ్చిందగ్గరనుంచీ చూస్తున్నాను.... మీరేమీ స్టోరులో ఆశించటంలేదు."

"అలాంటి అన్యాయపు పనులకు విజయ ఒప్పుకోదుగ!"

"భార్యగా ఆమె మీకు భయపడాలికాని మీరామెకు భయపడుతున్నారు."

"న్యాయం ముందు ఎవరైనా తలవంచాలి తులసమ్మా! బడిపిల్లలు చూడు- ఉప్మా విషయమడిగారు.. అలా అలా ప్రాకి అదే విప్లవజ్యోతిగా మారుతుంది- అన్యాయాని కలవాటుపడినవారు దానిని తిరుగుబాటనీ అభివృద్ధి నిరోధక చర్యలనీ అంటారు."

"అవన్నీ ఇప్పుడెందుకు మాష్టరుగారూ!" అని వేణుగోపాల్‌ని దగ్గరగా తీసుకుంది.

"పాపం విజయమ్మకు అన్యాయం చేస్తున్నారు."

"నిజం తులసమ్మా! కాదనను.... కాని ఎందుకో నీమీద మనసయింది. కన్ను మూసినా తెరచినా నీ కౌగిలి గురించి కమ్మని ఊహలు."

"అలానా! ఈ కమ్మని తీయని కౌగిలిలో ఈ రాత్రంతా వుండగలరా?" .

"అయ్యో! ఓ గంటలో వస్తానని విజయతో చెప్పి వచ్చాను"..........

అలా అరగంట గడిచింది.

వేణుగోపాల్ వరండా దాటి పైకి వచ్చాడు.

"యీ కటిక చీకట్లో ఒంటరిగా విడిచిపోతున్నందు కెంతో బాధపడు తున్నాను తులసమ్మా! ఏం చేస్తాం? ఆక్రమం అక్రమమే! దైవం ఇచ్చిన చూపు చూశాడు" అంటూ ఇంటికి వచ్చాడు వేణుగోపాల్.

"చూడండి! ఈ అమ్మాయి మీ స్కూలుదే! నాలాంటి అభ్యుదయ భావాలు కలది. ఉప్మా ఎలా చేసి పెడుతున్నారనీ కొందరు విశేషాలతో బాధ పడుతున్నారనీ, చాలాకాలంనుంచీ యీ అక్రమం జరుగుతోందనీ చెపుతోంది. నిన్న నా మాటలు విని ధైర్యంగా నన్ను కలుసుకోగలిగింది. అభ్యుదయ భావాల ప్రచారం జరగాలి. అప్పుడే చైతన్యం వెల్లువలా ప్రవహిస్తుంది."

వేణుగోపాల్ చిరునవ్వు తప్ప మరే సమాధానమూ చెప్పలేకపోయాడు.

"సూటిగా సమాధానం చెప్పలేక వెర్రినవ్వు- నిర్వహణ బాధ్యత మీదే కదా! అనాదిగా వస్తున్నదని మాత్రం అనకండి. మీరెందుకిలాంటి విషయాలలో కల్పించుకోవటం లేదు?"

"నే ఒక్కడినీ ఏంచేయగలను చెప్పు విజయా?

"ఎదిరించాలి- వాళ్ళ తప్పుడు పద్ధతి నలుగురికీ చాటగలగాలి. మీ విధి నిర్వహణ సక్రమంగా వుంటే వాళ్ళేం చెయ్యగలరండీ?"

"బలవంతులు.... ఏమైనా చేస్తారు."

"నే కల్పించుకోవలసి వస్తుంది- కారణం మీ అర్ధాంగిని కాబట్టి."

"నీ ఇష్టం" అంటూ వరండాలో ఒంటరిగా కుర్చీలో కూర్చుని తులసమ్మతో గడిపిన కొద్దిక్షణాలు మధురంగా గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. తనలో తానే నవ్వు కుంటున్నాడు.

"అన్ని విషయాలు నేను చూసుకుంటా"నని చెప్పి ఆ వచ్చిన పాపను గుమ్మంవరకూ సాగనంపింది.

"మీలో మీరే నవ్వుకుంటున్నారు.... ఏం ఘనకార్యం చేశారని- నూనె వాడకుండా ఉప్మా తయారుచేసి పిల్లలకు పెడుతున్నారనా?"

"అదికాదు విజయా! నా నవ్వుకు కారణ మదికాదు. అది నాకు తప్పిక మరెవరికీ తెలియదు"

"అవును. పిచ్చిగా వాగుతున్నానని నన్ను చూచి నవ్వుకుంటున్నారు."

"కాదు. కారణం నీ వూహించలేవు విజయా! లౌక్యం తెలియనిదానివి. మానసికానందం కోసం నవ్వుతుంటున్నాను."

"వరండాలో కూర్చుని నవ్వుకుంటుంటే క్లబ్బుకు రాళ్ళు చూడగలరు. ఇలా లోనికి రండి. కలసి నవ్వుకుందాం."

"లోనికి వచ్చిన వేణుగోపాల్ విజయను బాహువుల్లో ఇరికించుకున్నాడు.

'నన్ను మోసంచేస్తున్నావు నవు విజయా!' అనుకుంటూ చెక్కిలి నొక్కాడు.

"ముందు భోజనం తర్వాత ముద్దుముచ్చట" అంటూ విజయ భోజనం వడ్డించింది.

"రుచిగా వుందా? ఉడికింది కదూ!"

"రోజూ రుచిగానే చేస్తున్నావే. యీవేళ ప్రత్యేకంగా నీ వంటగురించి అడుగుతున్నావేం?"

"ఎందుకండీ పిల్లలు ఆహారం [illegible] రుచిగా వుండాలంటారా? పిల్లల ఆరోగ్యం [illegible] పాఠాల్లో [illegible] చెప్తారే! నేటి పిల్లలే రేపు దేశ [illegible] తీర్చిదిద్దవలసిన పౌరులు [illegible] మీరందరూ ఇలా [illegible] భోజనం ముగించారు.

చేతులు తుడుచుకుంటూ మంచంమీద కూర్చుని విజయను గోముగా పిలుస్తున్నాడు వేణుగోపాల్.

"ఎందుకేం? ఇప్పుడే భోజనం చేశాం. కాసేపు సరదాగా మాటలు ఆరోగ్య సూత్రాలు పాటించాలి [illegible]"

"అది కాదు విజయా! [illegible] నిన్నావేమో నీ బుర్రలో పిచ్చిపిచ్చి ఆలోచనలు. నీ కడుపులో బాబు [illegible] పడాలని కోరుకుంటున్నాను. అప్పుడు నీ దృష్టంతా నీ పాపమీద [illegible] బడిపాపలమీదవుండదు."

"అది నిజంకాదు మాష్టరుగారూ! ఎప్పుడూ నా ధ్యేయం ఒకటే!" అంటూ మంచానికెదురుగా వున్న కుర్చీలో కూర్చుని విజయ, యువ మాస పత్రిక చూస్తోంది. విసుగెత్తిపోతున్న వేణుగోపాల్ తానొక పాత పత్రిక ముఖాని కడ్డుగా పెట్టుకుని చదువుతున్నట్లు నటిస్తున్నాడు. మధ్యమధ్య విజయ తనవైపు

చూస్తోందో లేదో అని దొంగచాటుగా చూస్తున్నాడు. దగ్గరకు చేరలేదని విసుగెత్తిపోతున్న భర్తను ఓరగా చూసి ఆయన దొంగచూపులకు దొరికిపోయింది. అప్రయత్నంగా ఇద్దరూ నవ్వుకున్నారు.

లేచి వెళ్ళిన వేణుగోపాల్ విజయను అమాంతంగా ఎత్తి మంచంమీద కూర్చోబెట్టాడు.

"దొరికిపోయింది దొంగ."

"ఇప్పుడంటే మీకు దొరికాను; ఏనాడో మీకు దొరికిపోయాను. మీరు మాత్రం దొరికిపోకండి."

"అంటే?"

"అంటే దానర్థమదేనండీ. వస్తున్న బస్తాలు నూనె డబ్బాలు ఆదిలోనే అమ్ముడైపోతున్నా మీరు సరిగా వస్తున్నట్లు లెక్కలు చూపెడుతున్నారు మీ అధికారులు అదే సమయంలో వచ్చి పూర్తి సామాన్లకు లెక్క చూపించమంటే? అందుకనే ఇప్పటినుంచే హెచ్చరిస్తున్నాను; దొరికిపోగలరని."

"అబ్బో పడక మంచం మీద కూడా అదే ఆలోచనా?"

"ఏ మంచమైనా ఏం? మన బాధ్యతలు విద్యుక్తధర్మం మరచిపోరాదేం కదండీ."

"మాటల్లో నిన్ను గెలవలేను విజయా, మరి మాట్లాడటానికి అవకాశం ఇవ్వను" అంటూ [illegible] కౌగిలిలో విజయను బందీని చేశాడు...... .... మర్నాడు బడిపిల్లల టిఫిన్ సమయంలో విజయ స్కూలుకు వెళ్ళింది. మాష్టరుగారి భార్య కదా అని పిల్లలందరూ గౌరవం [illegible] చేస్తున్నారు.

"నువ్వెందుకు వచ్చావు విజయా?" భర్త ప్రశ్నించాడు.

"మీరు చదువు చెప్తున్న పిల్లలు నా పిల్లలు కారా మాష్టరుగారూ.... చూడాలనిపించింది. వచ్చాను. ఏం బాబూ, నే రావటం మీకిష్టంలేదా?"

"రోజూ రండి మాష్టరమ్మగారూ. మాష్టరుగారితో పాటు మీరు కూడా మాకు చదువు చెప్పండి- శ్రద్ధగా నేర్చుకుంటాము."

"అలా చెప్పినందుకు నీకు జీతం ముట్టదు విజయా."

"నా కెందుకండీ జీతం.... జీతం కాశించి నే చదువు చెప్పను. నా వల్ల వారికి విద్య అలవడితే అదే చాలు" అంటుండగా తులసమ్మ పైకి వచ్చింది విజయను పలుకరించడానికి.

"సుధాకర్ అక్క- తులసమ్మ; ఆయన వంటవాని పాణిగ్రహీ."

"మీ సారథ్యంలో ఈ ఇద్దరి చేతులమీదుగా అంత చక్కని ఉప్మా తయారు చేస్తున్నారన్నమాట" అంటూ కిచన్‌లోనికి వచ్చింది. ఉడకబెట్టి తయారు చేసిన ముద్దవైపు చూసింది.

"తులసమ్మా! నూనె సలసల కాగనిచ్చి పోపుసామాను వేయాలనీ, అది కళ కళలాడేటప్పుడు నూక వేయాలనీ నీకు తెలియదా?"

"తెలుసమ్మా! ఉప్మా అతి తేలికైన వంట- కాని నూనె లేకుండా ఏదో ఉప్పుపిండిగా తయారుచేసి పారేస్తున్నాం."

"నే వచ్చాను. యీనాటికైనా పిల్లలకు చక్కగా ఉప్మా చేసిపెడతాను."

"పిల్లేమ్మా! రోజూ ఇలానే కావాలంటారు.... ఇది అలవాటు చేశామో మరి తిప్పలేం" అంటూనే విజయ మూకుడులో నూనె పోసింది. దగ్గరుండి పద్ధతి ప్రకారం ఉప్మా తయారుచేయించింది.

గంటకొట్టి వరుసగా కూర్చున్న పిల్లలకు తులసమ్మతోపాటు విజయ కూడ వడ్డించింది. తింటున్న పిల్లల్ని అడిగింది రుచి ఎట్లా వుందని.

"బ్రహ్మాండంగా వుందమ్మగారూ! రోజూ మీరే రావాలి తయారు చేయటానికి."

ఎవరికీ తెలియకుండా వంటవాడు వెనకనుంచే వెళ్ళి హెడ్మాష్టర్ని పిలుచుకువచ్చాడు.

"రండి పెద్దమాష్టరుగారూ రండి! ఉప్మా ఇలా వుండాలండీ! పడవలసిన పదార్థాలు పడాలి. ఈ సామాన్లు వాళ్ళవి. వాటిని మరోలా వాడుకోవడానికి ఎవరికీ అధికారం లేదండీ" అంటూ "నే దగ్గరుండి తయారుచేయించిన ఉప్మా! మీరు తినండనుకోండి- అయినా రుచికోసం మీరు తప్పక తినాలి మాష్టరుగారూ."

హెడ్మాష్టరు ఏమి అనలేకపోతున్నాడు. వేణుగోపాల్‌ని ప్రక్కకు పిలిచాడు.

"ఇదేం పనేనా వేణుగోపాల్?"

"నమ్మండి- నాకు తెలియకుండా తానే స్కూలుకు వచ్చింది. తన పిచ్చి తనది. అభ్యుదయ భావాలంటూ."

"ఉప్మాలో నూనె ఎలా తేలుతుందో చూశారా! మూకుడమ్మడిగా ఇంత మంది బడిపిల్లలకు శుభ్రంగా చేసిపెట్టటం సాధ్యమంటారా? ఎందరి నోళ్ళు తడపాలి. మన సంగతేమంటావు? సంసారులమా సన్యాసులమా! పిల్లా పిచ్చుక






లేనివాడివి. జీతంరాళ్ళు తప్ప మరేం ఆశించనంటావు. అదే పిల్లలు పుడితేనో? మరో త్రోవ వెతుక్కోక తప్పదు. అయిందేదో అయింది. రేపటినుంచి విజయ యీ చుట్టుప్రక్కల రాకుండా చూడాలి" అంటుండగా విజయ ప్రతి క్లాసులోకి వెళ్ళింది. ఉప్మా పద్ధతి ప్రకారం చేయకపోతే ముట్టవద్దని అందరికీ చెప్పి వాళ్ళ చేత ఔననిపించింది. హెడ్మాష్టరు లోలోన మండిపోతున్నాడు. పోతున్న విజయను క్రోధంగా చూస్తున్నాడు.... ఇంటికి వచ్చిన వేణుగోపాల్ "మరో అడుగు ముందుకు వేశావు విజయా యీనాడు" అన్నాడు ఉల్లాసంగా.

"రాగానే కోప్పడతారనుకున్నాను. మీలో కూడా మార్పు వచ్చిందన్న మాట!"

"ఎప్పుడూ నీ పక్షనే విజయా! కాని ఉద్యోగం చేసుకుంటున్నాను. బహిరంగంగా సమర్థించలేకపోతున్నాను- హెడ్మాష్టరు మండిపోతున్నారు. రేపు రాకు విజయా!"

"వచ్చి తీరుతానండీ"

"రేపు వంటపని లేదు. వంటవాడికి బాగులేదని వారాని కొకసారి ఎగనామం పెడుతుంటారు. ఇదో రకం పొదుపు పద్ధతి."

"తప్పక వస్తానండీ! వంటవాడు లేకపోతే తక్కినవాళ్ళున్నారు కదండీ! అక్రమాలు ఎన్ని విధాలుగా చేస్తున్నారు...."

మర్నాడు తొమ్మిదిన్నర గంటలకే విజయ స్కూలుకు వచ్చింది. వంట వాడు లేకపోవటం చూసి తులసమ్మను పిలిచి "యీనాడు టిఫిన్ కార్యక్రమం లేనట్టుందే?" అనడిగింది. "వారాని కొకమారు వంటవాడు జబ్బయిపోతుంటాడు. అందుకని ఏ బుధవారం పిల్లలకు టిఫిన్ లేదండి."

"మరంతా ఏం చేస్తున్నారు? వంటవాడికి కావాలని సెలవిచ్చి టిఫిన్ చేయకపోవడం చాల అన్యాయం తులసమ్మా? అన్ని సామాన్లు పైకి తీసిపెట్టు-నే కూడా సహాయం చేస్తాను."

"హెడ్మాష్టరు ఒప్పుకోరమ్మా! అనవసరంగా అల్లరిపాలు కావడం-మధ్యను వేణుగోపాల్ మాష్టరుగారు బాధపడతారు."

"ఎవరు బాధపడితే నాకేం తులసమ్మా? ఆదివారం ఎలాగూ సెలవు-వారానికొకమారు ఏదో సాకుతో పిల్లలకు టిఫిన్ అందించలేకపోతున్నారు. పిల్లలకని కేటాయించింది ఇలా మిగుల్చుకోవడం చాల అన్యాయం."

"అది మాష్టర్లు చూసుకుంటారమ్మా! మధ్యను మీ కెందుకు?"

"సమాజంలో నాక్కూడా అడగటానికి సమాన హక్కుంది తులసమ్మా" అంటుండగా హెడ్మాష్టరక్కడికి వచ్చాడు.

"యీనాడు టిఫిన్ చేయటంలేదు విజయా! బలవంతంగా లోన దూరి వంట ప్రయత్నం చేయటం నేరంకింద వస్తుంది."

"అది నేరంకింద రాదు మాష్టరుగారూ! న్యాయంకింద వస్తుంది" అని వంటప్రయత్నం చేయతలపెట్టిన విజయను ఓమారు ఏదో పనున్నట్టు పైకి పిలవటం తులసమ్మ కిచన్‌తలుపులు మూయటం ఒకేసారి జరిగిపోయాయి. దగ్గరే వున్న వేణుగోపాల్ విజయను తిరిగి ఇంటికి వెళ్ళమన్నాడు.

"నే వెళ్ళటానికి రాలేదండీ! ఆ ఇరుకు జైలుకైనా సిద్ధం" అంటూ క్లాసుల్లో చొరబడింది. ముందురోజు తనింటికి వచ్చిన పాపను పైకి పిలిచింది. సమ్మె చేయమని అందిరినీ పైకి రమ్మంది. అందరు పిల్లలూ వచ్చి పైని శాంతంగా కూర్చున్నారు.

హెడ్మాష్టరు కోపాని కంతులేదు.

"క్లాసు లీడర్లందరకూ ఇదే నా హెచ్చరిక- పిల్లల్ని సమ్మె విరమింప చేసి లోనికి వచ్చేటట్టు చేస్తే సరేసరి. లేదా వచ్చే ఏడు ఇదే క్లాసులో వుండవలసి వస్తుంది."

"ఎలా పాస్‌చేయకుండా పాత క్లాసుల్లో వుంచుతారో మనం కూడ నేచి చూద్దాం- ఒంటిగంటవరకూ ఇక్కడే వుండండి" అంటూ విజయ ప్రతీ క్లాస్ లీడర్‌కూ ధైర్యం చెప్పి 'యీ పూట టిఫిన్ చేయటానికి కనుమతిస్తారా లేదా?' అని మరోమారు అడిగింది.

"వీల్లేదమ్మా! వారానికొకరోజు ఇదే పద్ధతి నడవటానికి వీల్లేదు. తూచి తూచి వాడవలసి వస్తోంది. మా బాధలు మీకేం తెలుసును"

"గ్రామస్థులందరినీ పిలుచుకు వస్తాను. ఎకౌంట్లు చూపిస్తారా."

"మమ్మల్ని తనిఖీచేసే అధికారు లున్నారమ్మా! ప్రతీవారికీ సమాధానం చెప్పుకోవలసిన అవసరం మాకు లేనేలేదు."

"వారానికి రెండురోజులు టిఫిన్ సరఫరా అపినా అడిగే అధికారం గ్రామస్థులకు లేదంటారా?"

"మా బాధలు నీ కెలా చెప్పేదమ్మా!"

"టిఫిన్ తయారు చేయటాని కవకాశం కల్పిస్తారా లేదా?"

"ఏ మాత్రం వీల్లేదమ్మా!"

"మీ లెక్కల్లో ప్రతీరోజు సరఫరా జరుగుతున్నట్టు చూపెడుతున్నారా లేదా?"

హెడ్మాష్టరా ప్రశ్నకు తికమకపడ్డారు.

"వచ్చేవారంనుంచీ సక్రమంగా జరిగేటట్టు నే హామీ ఇస్తున్నాను విజయా- ప్లీజ్. యీ విషయంలో నా మాట నమ్ము. ఇప్పటికి పిల్లలు ఇళ్లకు వెళ్ల వచ్చును. మధ్యాహ్నం మామూలుగా రమ్మని చెప్పు" అని బ్రతిమాలుకుంటున్నాడు.

"యీ పట్టీ చూడు-ఈనాడు సరఫరా చేయలేదని రాసి దాని కెదురుగా నా సంతకం పెట్టాను" అని విజయను ఒప్పించాడు.

విజయ సూచనపై పిల్లలందరూ తమతమ ఇళ్లకు వెళ్లారు.... విరామ సమయంలో హెడ్మాష్టరు సుధాకర్‌కి కబురుపెట్టి రప్పించాడు.

"చూడు సుధాకర్! విజయ స్కూలు విషయాల్లో కల్పించుకుంటోంది! చిన్న సమ్మెకూడ చేయించింది. బ్రతిమాలవలసి వచ్చింది."

"మా క్లబ్బు విషయంలో నా పరువు తీసింది మాష్టరుగారూ! కొందరు సభ్యులు నన్ను నమ్మటంలేదు. వాళ్లకూడా నన్ను లెక్కలడుగుతున్నారు."

"అయితే ఏం చేద్దామంటావు?"

"ఊర్లో ఎవ్వరూ గది అద్దెకివ్వకుండా చూడాలి. క్లబ్బు విస్తరింప చేయటానికి వాళ్లున్న గది తక్షణం కావాలని చెప్పి వాళ్లను పైకి గెంటిస్తాను. మార్కులు అవరణలో మీరు చేరనివ్వకండి నడివీధిలో ఎండకు ఎండి వానకు తడిసేటట్టు చేస్తే నెత్తికెక్కిన కళ్లు యథాస్థానానికి వస్తాయి."

"అదే సరైన మందు సుధాకర్...."

సుధాకర్ తన స్నేహితుల్ని కలుసుకుని తన నిర్ణయం చెప్పాడు.

"ఎక్కడినుంచి వచ్చారో ఏమో! వాళ్లనట్లా అవమానించటం భావ్యంకాదు సుధాకర్" అని ఓ మిత్రుడు సలహా ఇచ్చాడు.

"మనల్ని అవమానించింది. గర్వ మణగాలీ అంటే ఇదే సరైన మార్గం బ్రదర్."

"మొదట నేనూ అదే అనుకున్నాను.... తాను మనల్ని అవమానించలేదు. కళ్లు తెరిపించింది. కారణం చెప్పమంటావా! మా తమ్ముడు క్లబ్బులో చేరాడు. మార్కుల స్థాయి దిగజారిపోయింది. క్లాసు పుస్తకాలు బదులు బూతుపుస్తకాలు చదువుతున్నాడు. తాత్కాలికానందం_ ఆరోగ్యం పాడు."

సుధాకర్ కళ్లెర్ర చేశాడు.

"ఇన్నాళ్ల స్నేహాన్ని తృటిలో మరచి ఎక్కడినుంచో వచ్చినవాళ్లను వెనకవేసుకువస్తున్నావు కదూ!"

"మంచిని గౌరవించాలి_ దానికి పవిత్రంగా పట్టాభిషేకం కట్టాలి.... అర్జన ద్వారా కాలక్షేపం చేస్తున్నావు. అదే నీవు సక్రమ మార్గమనుకుంటున్నావు. ఇంతకన్న నే చెప్పేదేమీ లేదు. తర్వాత మీ ఇష్టం" అంటూ ఆ యువకుడు జారుకున్నాడు.

అప్పుడే ఇంట్లో అడుగుపెడుతున్న వేణుగోపాల్‌ని సుధాకర్ పలుకరించి ఆపాడు.

"గది జరూరుగా ఖాళీచేయాలి మాష్టరుగారూ. క్లబ్బుకు కావాలి."

"క్షణాలమీద ఖాళీచేయిస్తే ఎక్కడికి పోతాం! గడువు కావాలి" అంది విజయ కల్పించుకుని.

"రేపు కావాలమ్మా! లేదా బలవంతంగా సామాన్లు పైన పారేయవలసి వస్తుంది."

"దౌర్జన్యానికి దిగుతున్నారన్నమాట! తాగి దొర్లటానికి యీ గది తక్షణం కావలసొచ్చిందన్నమాట!"

"మాటలు మించిపోతున్నావు విజయా! దేనికైనా హద్దుండాలి."

"ఆ హెడ్మాష్టరు పోరుపడలేక మమ్మల్నిలా ఇబ్బందుల్లో పెట్టాలని చూస్తున్నావన్నమాట!"

"నాకు స్వహతాగా పుట్టిన బుద్ధి."

"కాదు మీరంతా తోడుదొంగలు- తర్వాత మాట్లాడుకుందాం పొండి" అని కసరికొట్టి తలుపు మూసింది. వేణుగోపాల్ ఎటూ చెప్పలేకపోతున్నాడు. విజయ వలన తనకు సంక్రమిస్తున్న బాధల్ని తలచుకుని భయపడుతున్నాడు.

"వాళ్ల దౌర్జన్యం చేస్తేనో?"

"ముందుగానే పోలీసు రిపోర్టిస్తాను."

"సమస్యలు తీరవు కదా జఠిలమైపోతాయి."

"ముందు భోజనం కానీయండి- జరూరైన పనుంది" అని ఇద్దరూ భోజనం ముగించారు.

"మొన్న వచ్చిన పాపఇల్లు దగ్గరిలోనే వుంది, వెళదాం పదండి" అని ఇద్దరూ కలసి వెళ్లారు.

"రండమ్మా రండి- ఎప్పుడైనా వస్తారనే అనుకుంటున్నాను. అలానే వచ్చారు. మీ విషయాలన్నీ మా లలిత చెప్పిందండి."

"ప్రతీ చిన్న విషయంలోను కక్కుర్తిపడిపోవటం దేశంలో ఆచారమైపోయింది బాబాయ్‌గారూ! అడిగినవారిది తప్పు- మేమున్న గదిని బలవంతంగా ఖాళీ చేయిస్తానంటున్నాడు సుధాకర్! అంతవరకూ రానీయకుండా ముందుగానే మేల్కొవడం మంచిదనుకుంటున్నాను.... ఇద్దరమేగా! మీ అబ్బాయి కోడలూ అయితే కాదనలేరు కదండీ!"

"ఎంతమాటన్నావమ్మా! తప్పక ఆశ్రయమిస్తాను. వెనుక వరండాలో కాలక్షేపం చేయండి. మా పిల్లల్లా మాతో కలసిపొండి."

"చాల సంతోషం బాబాయ్! అందరూ కఠినంగా వుండరు. తమలాంటి సౌమ్యులుంటారు. అలానే నాలా నిలదీసి అడిగేవారు చాల అరుదు-రేపు వుదయమే సామాన్లు మోయించుకు వస్తాను."

"అలాగేనమ్మా! మా బండివాడిని సహాయంగా పంపిస్తాను" అంటుండగా లలిత రెండు గ్లాసులతో మజ్జిగ తీసుకువచ్చిచ్చింది.

"ఇప్పుడే భోంచేసి వచ్చామమ్మా! అప్యాయతతో ఇస్తున్నావు- తీసుకుంటాంలే" అని దంపతులిద్దరూ తీసుకున్నారు. లలిత భుజంతట్టి విజయ

భర్తతో తిరిగివచ్చింది....

తెల్లవారింది. వేణుగోపాల్ బండివాడి సహాయంతో సామాన్లను లలిత ఇంటికి మోయించుకు వెళ్లాడు. సుధాకర్‌కు గది అప్పగించాడు. విజయపై కోపం సుధాకర్ లలిత తండ్రిపై చూపిస్తున్నాడు.

"బాబూ సుధాకర్! మన గ్రామానికి వచ్చిన ఆడపడుచు విజయ.... ఆవిడ సంస్కారం చూశావుగా! ఇదేనా వాళ్లను ఆదరించి ఆదుకునే విధానం? నాగరికతకు చాల విరుద్ధంగా ప్రవర్తిస్తున్నారు బాబూ!"

"ఆ మత్తుమందులో మీరు మునిగిపోతున్నారు."

"అది మత్తుమందు కాదు దాబూ!.... ఉద్యమం— పవిత్ర ఉద్యమం— ఆ ఉద్యమం ఆగిపోకూడదు."

"ఎలా ఆగిపోదో మేమంతా చూస్తామండీ."

"నీ వన్నది కూడా నిజమే! విజయ చర్యల్లో నీతినిజాయితీలున్నాయి— ఏకాకిగా మీ బలంముందు తానోడిపోక తప్పదు.... బాహాటంగా కాకపోయినా నీ మనసులోనైనా ఆమె మంచిపనులు అంగీకరించాలి సుధాకర్— మరోమారు ఆలోచించుకో— ఆమె కన్నివిధాలా మనం చేయూతనివ్వాలి." అని ఆయనను తంపించాడు.

"అమ్మా విజయా! చూశావుగా! సుధాకర్ చిన్నప్పటినుంచీ ఆకతాయి తనంగా తిరగటాని కలవాటుపడిపోయాడు. స్టోరులో సామాన్లు తులసమ్మ ద్వారా రాబడుతుంటాడు. ఇదొక రకం వ్యాపారమమ్మా! ఆయనే నీతివాక్యాలు మనకు చెపుతున్నాడు." అంటుండగా విజయ వంటప్రయత్నంలో వుంది.

"వరండాలోనే పర్దుకుని మాతో కలసిమెలసి తిరగాలి."

"అలాగే బాబాయ్! ఎందుకైనా మంచిది. సుధాకర్ దౌర్జన్యాన్ని అధికారు లకు తెలియదేస్తాము. కృతిమించేక ఎవరితో చెప్పుకున్నా ఏం లాభం? వంట కానిచ్చి స్కూలుకు వెళ్లాలి, వంటకాలెలా చేస్తున్నదో దగ్గరుండి చూస్తాము." అంటూ అరగంట వ్యవధిలో వంట పూర్తిచేసి స్కూలు కిచెన్‌కి వెళ్లింది.

వంటవాడు, తులసమ్మ విజయ నొకంట కనిపెట్టి చూస్తున్నారు. ఇంతలో సుధాకర్‌కూడా అక్కడికి వచ్చాడు.

"స్కూలు విషయాల్లో మీరేం కలుగచేసుకోకూడదు విజయగారూ!"

"నే ఒంటరిగా కాకుండా మీరూ నేనూ తదితరులు కలసి కలుగచేసు కోవాలి. సంఘంలో మన కెన్నో బాధ్యతలున్నాయి— అందులో ఇదొకటి—







ఖావి పౌరులని మనమంటుంటామే! వాళ్ల ఆరోగ్యం."

"పిల్లల్లో పూటకు గతిలేనివారున్నారన్న సంగతి మరచిపోకండి. ఆకలి చంపుకోవటాని కాహారము- దానిని శుభ్రంగా రుచిగా చేసిపెట్టమంటున్నారు. పద్ధతి ప్రకారం పోతే పక్షంరోజులు రాదమ్మా రేషన్."

"తక్కువ కావటానికి కారణం మీరుకూడా వున్నారు సుధాకర్."

"నేనా!"

"ఆఁ, రోజూ మీ అక్కద్వారా ఇంటికి చేరవేస్తున్న సామాన్లు."

అవమానం భరించలేక సుధాకర్ చిందులు తొక్కుతున్నాడు. ఇంతలో వంటవాడు పిలువగా హెడ్మాస్టరక్కడికి వచ్చాడు.

"నిన్న నా కిచ్చిన హామీ ప్రకారం యీనాటినుంచీ అల్పాహారం అన్ని సామాన్లతో చేయించాలి మాష్టరుగారూ."

"మళ్లీ మొదటికే వచ్చావమ్మా! నూనె డబ్బాలు ఖిందుకున్నాయి."

"ఆదిలోనే అమ్మి డబ్బుచేసుకోవడం వలన నాలుగు వారాలూ పూర్తిగా పిల్లలకు మీరు సరఫరా చేయలేకపోతున్నారు- పై అధికారులకు తెలియచేస్తాను."

"కిచెన్ నిర్వహణ వేణుగోపాల్‌ది తెలుసా!"

"పాపం పండితే ఆయనే దొరికిపోవచ్చును. ఆయనైనా మీరైనా నా కడుపున పుట్టిన బిడ్డయినా నాకొకటే! సగానికి సగం పదార్థాలు మీరెందుకు

పంచుకు తింటున్నారు? వారానికొకమారు వంటవాడనారోగ్యమని సరఫరా అపు చేస్తున్నారు. ఈ అన్యాయార్జనలో మీరుకూడా వున్నారా వేణుగోపాల్‌గారూ!"

"నీకు భయపడి ఇక్కడ టిఫిన్ ముట్టటంలేదు విజయా."

"భయపడి.... అన్నమాట మాత్రం వాడకండి- వినడానికి చాలా అస హ్యంగా వుంటుంది. చదువు సంస్కారాలున్నవారలాంటి మాటలు వాడ కూడదు- నా ధర్మపద్ధతి మీకు నచ్చి అని అనగలగాలి."

అందరూ ఆ మాటలు ఆశ్చర్యంగా వింటున్నారు.

ఇంతలో వంటవాడు తనపనిలో తానున్నాడు. ఉడకబెట్టినా ఉప్పుడు రవ్వపై అక్కడక్కడ నూనె చల్లాడు. విజయ కోపాని కంతులేదు.

"మీ హామీలు శుద్ధ అబద్దాలు మాష్టరుగారూ!" అంటూ విజయ గ్రామం లోనికి వెళ్ళి తల్లితండ్రులందరినీ ప్రోగుచేసి తీసుకువచ్చింది,

"చూడండి! మీ పిల్లలకిచ్చే ఆహారం. దీని వలన పిల్లల ఆరోగ్యం పాడై పోతుంది. నూక చెరక్కుండానే మూకుడులో పోస్తున్నారు. కారణం? బాగుంటే మళల అడుగుతారని. ప్రభుత్వం పిల్లలకని ఇస్తున్నది వాళ్ళకు ఎందుకు సక్ర మంగా వండిపెట్టటంలేదని మొదటినుంచీ నొక్కినొక్కి అడుగుతున్నాను "

"పిల్లల చదువు మాష్టరుచేతిలో వుందమ్మా! మీ మీది కోపం బడిపిల్లల మీద చూపిస్తారమ్మా."

"అలాగని అన్యాయాన్ని ధైర్యంగా ఎదుర్కొరన్నమాట! మనకెందుకులే అన్నవారేగాని ఇది మన పిల్లల ఆరోగ్య విషయమని ముందుకొచ్చే తలితండ్రులు లేరమ్మా." అంటుండగా లలిత తండ్రి ముందుకొచ్చి "హెడ్మాష్టరుగారూ! ఉడి కించి ఉప్పుకారం వేసి దించిన ఉప్మాముద్దను వాళ్ళకిస్తున్నారు అరగక విరేచ నాలు- అనారోగ్యం. విజయమ్మ చెప్పినట్టు కాస్త శుభ్రంగా చేసిపెట్టండి బాబూ" అన్నాడు.

"ఆవిడ పాఠాలు మీరూ జీర్ణించుకున్నారన్నమాట నాయుడుగారూ! ఇష్టంలేకపోతే మీ లలితను ముట్టవద్దని చెప్పండి."

"ఇంతో అంతో కలిగినవాళ్ళం. ఇది పేద విద్యార్థులకు బాబూ! అదే సమయంలోన మీరు మీకని వేరుగా వంట శుభ్రంగా చేయించుకు తింటున్నారు. అలానే బడిపిల్లలకు కూడా తయారుచేయించండి- పేదవాళ్ళను ఉడకబెట్టిన ముద్ద తినమనీ- ధనవంతులను పద్ధతి ప్రకారం చేసిన ఆహారం తినమని ఎక్క డుంది బాబూ! నాకు విజయ పద్ధతులు నచ్చాయి. అందుకే ఇంత ధైర్యంగా

చెప్పగలిగాను."

"ఇంకా ఎవరైనా చెప్పేవాళ్ళున్నారా?"

ఏ ఒక్కరూ ముందుకు వచ్చి మాట్లాడలేకపోతున్నారు.

"పేదవారు పిల్లల మార్కులు తగ్గిపోతాయని భయపడి అడగలేక పోతున్నారు."

"చదువుకుని అడిగిన ప్రశ్నకు సరైన సమాధానం రాస్తే అవేవస్తాయమ్మా మార్కులు."

"కోపగిస్తే తగ్గిపోతుంటాయి మాష్టరుగారూ? మీరు కాస్త అన్యాయానికి ఒడిగట్టబడే కదా పూర్తి సరఫరాను సగానికి సగం తగ్గించారు- అలాగే మార్కులు కూడా."

"నిన్ను వాదనలో జయించలేను విజయా!"

"టైం కావస్తోంది- సరఫరా మొదలుపెట్టండి" అనగానే బెల్ మ్రోగటం పిల్లలు వరుసగా వచ్చి నిల్చోవటం, తులసమ్మ వంటవాడు వడ్డించటం జరుగుతోంది.

"నేను వచ్చి ఇక్కడ నిల్చోబట్టి పైని కాస్త నూనె అద్దినట్టుంది. లోన పచ్చిముద్ద- అక్కడక్కడ ఎం మిర్చి- ఇక లాభంలేదు- అధికారులకు తెలియచేయాలి." అంటూ ఇంటికి వచ్చింది.

"అమ్మాయిలూ! ఆరోగ్యాన్ని చూసి ఏవేవో మాత్రలిస్తున్నారు. స్కూలు పిల్లలకు అజీర్తి- విరేచనాలు. దీనికాకారణం స్కూల్లో వాళ్ళకిస్తున్న ఉడికీ ఉడకని ఉప్మాముద్ద- మీరు వచ్చి చూసిన విషయాలు హెల్తాఫీసరుకి తెలియ చేస్తారా?"

"ఆ విషయాలు చూడటానికి వేరే అధికారులున్నారమ్మా! మేం కల్పించుకున్నామనుకోండి, గ్రామగ్రామాలకూ పొలాల మధ్యనుంచి కాలినడకను వెళ్ళవలసి వస్తుంది. రౌడీమూక తలచుకుంటే ఏమైనా చేస్తారు."

"పోనీ అక్కడి అధికారులకు ఇక్కడి అక్రమాలు తెలియచేయండమ్మా!"

"చూస్తాంలెండి" అంటూ వాళ్ళు తప్పుకున్నారు.... "వచ్చిపోతున్నప్పుడు భయంగా వుంది విజయా! సుధాకర్ సామాన్యుడు కాదు. ఏమైనా చేయిస్తాడని భయంగా వుంది."

"భయమెందుకండీ! నే నీవేళ పోలీసు కంప్లెయింటు ఇస్తాను. ముందు జాగ్రత్త మంచిదే కదా!"

"సరే నీ ఇష్టం" అంటూ "మధ్యను నేను నలిగిపోతున్నాను" అని మౌనంగా తనలో తా ననుకున్నాడు. "భోజనంచేసి మళ్ళీ కిచన్‌కు వెళ్ళాలి. సామాను వస్తుంది. లెక్కపెట్టి లోన వేయించాలి" అని భోజనంచేసి కిచన్‌కు వెళ్ళాడు వేణుగోపాల్.

విజయ ఆలోచనల కంతులేదు. తాను కూడ భోజనంచేసి లేచింది.

"బాబాయ్! మీతోపాటు మరికొందరు పెద్దలను కూడగట్టుకు తీసుకు రావాలి. కిచన్‌కు ఎన్ని బస్తాలు, డబ్బాలు వచ్చినట్టు చూపిస్తున్నారో అసలు వచ్చినవి ఎన్నో మీరే చూడ్డరుగాని. అసలు అధికారులు వచ్చినప్పుడు మీరు అందరూ సాక్ష్యముండాలి- సంశయించకండి- యుద్ధరంగంలో దిగినవారు ప్రాణం సంగతి ఆలోచించరు. అలా అయితేనే ముందుకు సాగుతూ శత్రు సంహారం చేయగలరు."

"కానీ అమ్మా!" అంటూ నాయుడు పదిమంది పెద్దల్ని ప్రోగుచేశాడు. విజయ సారథ్యంలో అందరూ వెన్నుడిగా నడిచి వెళ్ళారు

"ఏం విజయా! వీళ్ళందరినీ వెంటబెట్టుకు వచ్చావు" వేణుగోపాల్ ప్రశ్నించాడు.

"మీ చేతిలోని బిల్లులు చూపిస్తూ తీసుకున్న బస్తాలు, నూనె డబ్బాలు బిల్లులో రాసినన్ని కిచన్‌లో లేవండీ- వాటిని సరిచూడాలి."

"ఎప్పటినుంచో ఇలా జరుగుతున్నా విజయా! తెలిసిన విషయమే కదా!"

"మీకు తెలుసు తెలుసు- మరి ప్రాణపెద్దలకు తెలియాలి కదండీ! అందుకే వీరందర్నీ తీసుకువచ్చాను." విజయ అందరి సాక్షిలో స్వయంగా సామానులు లెక్కపెట్టింది. ప్రతీ విషయమూ కాగితంమీద రాసి క్రింద పెద్దలందరితో సాక్షి సంతకాలు చేయించింది. "డీన్ గారు మీరు కూడ సంతకం చేయాలి. బలవంతంగా మాత్రం కాదు. అంగీకరిస్తేనే!"

కాదనకుండా వేణుగోపాల్ కాగితంపై సంతకం చేశాడు.

"మా బదులు అధికారులే వచ్చి లెక్కలడిగితే ఏం సమాధానం చెప్ప గలరు చెప్పండి. ఈ నేరం మీమీద పడుతుంది. ఎవ్వరూ తప్పించలేరు."

"నిజమే విజయా! నన్నరకాటంలో పెట్టాలన్న దురుద్దేశంతోనే హెడ్క్వార్టర్ నన్నిందులో పెట్టారు. ఒకటి రెండుమార్లు తప్పించమన్నాను. నీ కేచింతా పిల్లాజెల్లా లేనివాడివి. నీకు చిక్కిన తీరుబడి తక్కినవాళ్ళకేదీ






అని సమాధానపరిచారు."

"ఇదే మీ ఇష్టం.... ఇదండీ నాయుడుగారూ! అల్పాహార విక్రయం
తరంగా రెండు బిస్కెట్లు వచ్చాయి నాలుగు బిస్కెట్లు వచ్చినట్టు బాగా పేలి
ముద్రలతో రశీదులు- నెల కర్తల ఇప్పు మూడింతలెక్కువ చూపిస్తున్నారు.
పనిమనుషుల్ని దగాగా చూపించి జీతభత్యాలిస్తున్నట్టు రాస్తున్నారే కాని
అంతా తులసమ్మ, వంటవాడు మోసుకుంటున్నారు" అంటూ ఎవరినీ ఎవరింట్లకు
వారు పోయి విశ్రాంతి తీసికొమ్మని చెప్పింది ....

లోపల స్టోరురూమ్‌లో నిల్చున్న వేణుగోపాల్ వీపును తులసమ్మ నిమురు
తోంది.

"ఒక ప్రక్క అందరి మధ్య అవమానం- మరోవైపు నీ సరసం."

"మంచీ చెడూ, సరసం విరసం, నవ్వు ఏడ్పు, వెలుగు చీకటి ఇవి
మామూలే కదండీ మాష్టరుగారూ!- అలానే ఇది కూడా" అంటూ మరీ దగ్గరగా
వెళ్ళింది తులసమ్మ.

"వంటవాడు చూస్తున్నాడేమో!"

"నిజమేనా?" అని ముఖం అదోలా పెట్టాడు. తులసమ్మ వేణుగోపాల్
రెండు బుగ్గల్నీ తేల్చి నొక్కి "ఊరికే అలా అన్నాను. మీ ముఖం ఎలా

మారుతుందో చూడాలని అలా అన్నా" నంది.

"తిరిగి ఇంటికి వెళ్ళేక విజయ ఎన్ని ప్రశ్నలనుకున్నావు. సరియైన సమాధానం చెప్పేవరకూ విడిచిపెట్టదు. మా ఇంటి నాయుడుగారికి లలితకు కూడ సమాధానం చెప్పుకోవాలి" అంటూ తలుపులు మూసి వేణుగోపాల్ ఇంటికి వచ్చాడు.

విజయ అప్పటికప్పుడే తెల్లకాగితంమీద జరుగుతున్న అన్యాయాలను విపులంగా రాసి గ్రామస్థుల సంతకాలున్న కాగితాన్ని జతపరచి కవరుపై ఇన్‌స్పెక్టర్ అడ్రసు రాసి పెట్టెలో పెట్టింది. ఇంటికి వచ్చిన వేణుగోపాల్ ఎవరి ముఖమూ సూటిగా చూడలేకపోతున్నాడు.

"ఎవరో చేస్తున్న దొంగతనాన్ని మీమీద వేసుకోవటం భావ్యంగా కనుపించలేదండి."

"ఒకసారి కాదు. వందమార్లడిగినా అదే సమాధానం విజయా! నీవు తలపెట్టిన ఉద్యమంలో ధైర్యంగా ఒక్కొక్క అడుగు ముందుకువేస్తున్నావు-ఫలితం వేచి చూడాలి."

ఇంతలో లలిత అక్కడికి వచ్చింది.

"క్లాసులో యీవేళ నా రెండు పుస్తకాలు ఎవరో దాచేశారు మాష్టరుగారూ! ఎప్పుడూ లేని దొంగతనాలు ఇప్పుడు జరుగుతున్నాయంటే కారణం ఒకటే కనుపిస్తోంది. మా నాన్న వచ్చి అడిగినందుకు సుధాకర్‌వాళ్ళు రహస్యంగా వెనకనుంచి చేయిస్తున్న తుంటరిపనులు"

"నిజమే కావచ్చమ్మా! ఏటూ చెప్పలేకపోతున్నాను" అని మంచంపై విశ్రాంతి తీసుకుంటున్నాడు.... మర్నాడు ఎనిమిదిగంటల సమయంలో విజయ బ్రాంచి పోస్టాఫీసుకు పోయి ఇన్‌స్పెక్టర్ పేర కవరు రిజిష్ట్రేషన్ చేయించి వచ్చింది. విజయ రాకపోకలను రహస్యంగా కనిపెట్టి చూస్తున్న సుధాకర్ పోస్టుమాష్టర్ని కలుసుకుని విజయ పంపుతున్న కవరుపై విలాసం చదివి ఎకాఎకిని హెడ్మాష్టర్‌ని కలుసుకుని జరిగిన విషయాలు చెప్పాడు.

"ఇన్‌స్పెక్టర్‌గారు మన పక్షానే వుంటారు. అయినా ఎందుకైనా మంచిది. విజయపై నేను కూడా క్లుప్తంగా రాసి పంపుతా"నని అప్పటికప్పుడు జాబు తయారుచేసి సుధాకర్‌కిచ్చి పంపించాడు....

ఇన్‌స్పెక్టర్ రెండు జాబులూ ఒకేరోజందుకున్నారు. కోడూరులో విజయ తన్నవమానించిన సంఘటనలు గుర్తుకు తెచ్చుకున్నాడు. రోజురోజుకూ మితిమీరి

పోతూ గ్రామస్థుల సమక్షంలో సామాన్లు లెక్క పెట్టటం భయభక్తుల్లేకుండా భర్తతోనే సంతకం.... ఇదే జాబు హైదరాబాద్ అధికారులకు చేరితేనో? ఆపదలో పడటమే కాక ఆహారపథకం రద్దుచేయటం నెలనెలా తింటున్న లాభాలు పోవటం తలచుకుని ఆందోళనపడుతున్నాడు....

ఎవరికీ తెలియకుండా ఇన్‌స్పెక్టర్ రహీంకోట చేరుకుని హెడ్మాష్టర్ని కలుసుకున్నాడు

"ఏం చేయమంటారో చెప్పండి మాష్టరుగారూ"

"పిల్లలందరిచేత తిరుగుబాటు చేయిస్తోంది."

"వేణుగోపాల్ సంతకం చేసిన కాగితం కూడా పంపించింది. ఆయనను ఇరకాటంలో పెట్టటం మంచిదనుకుంటాను- అలా అయితేనే విజయ ఆటలు కట్టేది- ఇక్కడనుంచి మహోచోటికి వెళ్లినా నోరెత్తకుండా చేస్తాను" అని వేణుగోపాల్‌ని విజయను హెడ్మాష్టరింటికి రప్పించారు.

"రండి వేణుగోపాల్‌గారూ! దసరా సెలవలు- మిమ్మల్ని చూడటానికి వచ్చాను. కొత్త ఊరు- ఎలావుందేం?"

"అన్ని విషయాలు మా విజయ రాసింది కదండీ" అని భార్యవైపు చూశాడు వేణుగోపాల్.

"మీరు దసరా సెలవులని రాలేదు. దసరా వసూళ్లకు వచ్చారు."

ఇన్‌స్పెక్టర్ విజయపై రెచ్చిపోలేదు. శాంతంగా సమాధానం చెప్పాడు.

"నే దసరా మామూళ్లు పుచ్చుకోడానికి రాలేదమ్మా! దసరా బహుమతి వేణుగోపాల్‌గారి కివ్వాలని వచ్చాను" అంటూ విజయ తనకు పంపిన కాగితాలు పైకి తీశాడు.

"ఈ అక్రమాలకు ఒకే ఒక వ్యక్తి బాధ్యుడు- నీ భర్త వేణుగోపాల్"

"ఆయనను చక్రబంధంలో ఇరికించటానికి మీరు, హెడ్మాష్టరుగారు కలసి కిచన్ వ్యవహారాలాయన కప్పచెప్పారు- నామీది కోపం ఆయనమీద చూపిస్తున్నారు. ఇది భావ్యంగాలేదు ఇన్‌స్పెక్టరుగారూ! అడగవలసినవారి నడగలగాలి. మావారు చేసిన తప్పు ఒకటే. ఎంత స్టాకు వచ్చినా సరిగానే వస్తున్నట్టు చూపిస్తున్నారు. కారణం మీలాంటి అధికారులకు భయపడి. కోపం వస్తుందని కిమ్మనలేకపోయారు."

"ఏది ఏమైనా తప్పు వేణుగోపాల్‌దే! దానికాయన సంజాయిషీ ఇవ్వాలి. పైఅధికారులకు పంపాలి."

వేణుగోపాల్ భయపడిపోతున్నాడు.

విజయలో మాత్రం ఏమాత్రం తొట్రుపాటు కనుపించలేదు. వంటవాడిని, తులసమ్మను పిలుచుకు వచ్చింది.

"తులసమ్మా! నిజం చెప్పు- చాలకాలంనుంచీ ఇలా జరుగుతుంది కదూ!"

"లేదు బాబూ! వేణుగోపాల్‌గారు వచ్చిందగ్గరినుంచీ ఇలా జరుగుతోంది. ఎక్కడ తమపై ఈ నేరం పడుతుందో అని ముందుగా విజయమ్మగారు యీ ఎత్తువేశారు."

వేణుగోపాల్ నిర్ఘాంతపోయాడు.

తులసమ్మ తనపై చూపిన కపటప్రేమ కామెను అసహ్యించుకుంటున్నాడు.

"చూశారా! పాపం తులసమ్మ వితంతువు- రాత్రింపగళ్లు ఇక్కడే వుండి సుధాకర్ ద్వారా తాను కూడా కొంత దోచుకుతింటోంది. మీ మంచికి వాళ్లిచ్చిన బహుమతి చూశారా!"

"సంజాయిషీ అనేసరికి తడబడతారు. నే చిత్తుప్రతి తయారుచేశాను. చదివి అదే విధంగా మీ స్వదస్తూరితో రాసివ్వాలి. పై అధికారులకు పంపితే వారే పరిశీలిస్తారు."

హెడ్మాష్టరు వేణుగోపాల్‌ని ప్రక్కకు పిలిచి "ఏమైనా ముట్టచెప్పండి-లేదా విడిచిపెట్టడు- నీ వ్రేలితో నీ కన్ను పొడుచుకున్నావు. అడపెత్తనం అదుపులో పెట్టుకోలేకపోయావు - విజయ బరితెగించిన ఆడది. నిన్నడకత్తెరలో ఇరికించింది."

"వేణుగోపాల్ సంశయిస్తున్నాడు. విజయచర్య తన పాలిటి శత్రువైందనుకుంటూ ఏదో చెపుదామనుకునేసరికి విజయ కల్పించుకుని "లంచం కావాలంటున్నారు కదూ! ఏమాత్రం వీల్లేదని చెప్పండి. నెలజీతం తప్పించి అన్యాయార్జన లేనివాళ్లు లంచాలెలా ఇవ్వగలరు ఇన్‌స్పెక్టరుగారూ" అనడిగింది.

"చింత చచ్చినా పులుపు చావదన్నారు. ఆ పద్ధతిలో వున్నావు విజయా! ఆయన పీకలమీదికి తెచ్చిపెట్టావు. ఒక మెట్టు కిందికి దిగాలి. కాదనకూడదు."

"నే సుతరామూ అంగీకరించను. తప్పుచేసినవాళ్లు లంచమిస్తారు- తప్పు చేయనివాళ్లు లంచమివ్వవలసిన అవసరంలేదు."

"మళ్లీ మొదటికే వస్తున్నావు- మీ యిష్టం- మీ రిచ్చిన సంజాయిషీతో పట్నం పోతున్నాను...."

"తమ్ముడూ సుధాకర్! విజయ కల్పించుకోవటంవలన మన బ్రతుకులు బైటపడిపోయాయి. కిచన్ నుంచి మనం రోజూ ఇంతో అంతో రాబట్టుకుంటున్నామని ఇన్‌స్పెక్టర్‌గారి ముందే ధైర్యంగా చెప్పింది— అదే విజయ మాటలు నమ్మి నన్ను పనినుంచి తప్పించేస్తేనో? మన బ్రతుకులేం కాను?"

"నిజమేనక్కా! తన భర్తమీద తానే ఫిర్యాదుచేసిందన్న సంగతి మరచి పోయింది"

"నేను కూడా చేసేదిలేక వేణుగోపాల్‌గారికి వ్యతిరేకంగా చెప్పవలసి వచ్చింది. తెలివితక్కువకాక తక్కినవాళ్లలా నాలుగురాళ్లు చేసుకోక పట్టిన పట్టు విడిచిపెట్టటంలేదు విజయ" అంటుండగా అటువైపు వస్తున్న హెడ్మాష్టరుకు సుధాకర్ వందనం చేశాడు.

"వేణుగోపాల్‌కే ఆపద తెచ్చిపెడతారో తెలియటంలేదు ఇన్‌స్పెక్టర్‌గారు. పదిమంది సమక్షంలో మన నిజాయితీ మీద దెబ్బతీసింది విజయ. దీనికేమైనా విరుగుడు కనిపెట్టకపోతే మచ్చ మచ్చగానే మిగిలిపోతుంది సుధాకర్."

సుధాకర్ దీర్ఘంగా ఆలోచించి హెడ్మాష్టరువైపు చూసి నవ్వాడు. ప్రక్కగా పిలిచి చెవిలో గుసగుసలాడాడు.

"మాష్టరుగారూ! మీరు మరోలా భావించకండి. నే కూడా విజయతో చేతులు కలుపుతున్నాను. వచ్చే నెల స్టాక్ గ్రామం గ్రామం కదలివచ్చి పట్టుకుంటుంది. జాగ్రత్తగా వుండండి. దాంతో యీ సమస్య ఇటోఅటో తేలిపోతుంది" అంటూ సుధాకర్ అక్కడినుంచి వెళ్లిపోయి క్లబ్బు సభ్యుల్ని కలుసుకున్నాడు.

"ధైర్యమంటే విజయదేరా బ్రదర్! భర్తపైనే ఫిర్యాదు చేసింది. ఎంత నిజాయితీ గల మనిషో ఆలోచించండి. దేశాన్ని దోచుకుతింటున్న మనుష్యులతో కాదు మనం చేతులు కలపవలసింది. క్షణక్షణం రంగులు మార్చే ముఠాతో మనం కూడా మూర్ఖంగా భజనచేస్తున్నాం. విజయది ఒకే రంగు— ఒకే ధ్యేయం. ఆ యజ్ఞంలో తాను మిడతలా మాడి చనిపోవటానికైనా అంగీకరిస్తుంది కాని అన్యాయం సహించదు. అన్యాయం చేసినవాడిలా బాధపడుతున్నాను" అంటూ వరండాలోనున్న వేణుగోపాల్‌ని పలుకరించాడు.

"మీరేం భయపడకండి మాష్టరుగారూ! మీరు చేయవలసిందల్లా ఒక్కటే! మరో ఇరవైరోజుల్లో స్టాకు వస్తుంది. బిల్లులు చేతపట్టుకుని సామాన్లు లెక్కపెట్టి లోనపెట్టటాని కేమాత్రం వీల్లేదని హెడ్మాష్టరుకు కబురుచేయండి. ఇంతలో మేంకూడా మూకఉమ్మడిగా వచ్చి నిలదీసి అడుగుతాం— సంతకం దేనిమీదా

పెట్టకండి- ఇలా ఐతేనే మీరు దొరికిపోరు కదా అసలు దొంగలు తేలిపోతారు. మొన్న పదిమందివద్దా మీరిదే చేయవలసింది. అధికారులకు భయపడిపోయారు."

"అలాగే సుధాకర్."

"తులసమ్మ మీ మీద పెద్దగా చెప్పినందుకు వెక్కి-వెక్కి ఏడ్చింది. ఆ స్థితిలోవున్న అడవారికి ఉదరపోషణార్థం అంతకన్న గత్యంతరం కనుపించటం లేదు మాష్టరుగారూ."

"ఇంతలోనే సుధాకర్‌లో మార్పు" అని లోన్నుంచి చూస్తున్న విజయతో సుధాకర్ "ఈ రహస్యం మరెవరికీ చెప్పకండి. మొన్న పదిమంది మాత్రమే అసలు రహస్యం కనుక్కోగలిగారు. ఈ మారు గ్రామమంతా ఉప్పెనలా విరుచుకు పడుతుంది. దోషులు దొరికిపోతారు- యీ మా నిర్ణయానికి మరి తిరుగులేదమ్మా విజయమ్మా" అన్నాడు.

"కొద్దిరోజులు ఎందులోనూ కల్పించుకోలేనిదానిలా మసలుకోవాలి విజయా" అని వేణుగోపాల్ తన అభిప్రాయాన్ని వెల్లడిచేశాడు.

మర్నాటినుంచీ క్లబ్బులో వికవికలు పకపకలు వినిపించటంలేదు. విజయ ఇంటివద్దనే మౌనంగా అభ్యుదయభావాలుగల పుస్తకాలతో కాలం గడుపుతూ సుధాకర్ చెప్పిన రోజుకొరకు ఎదురుచూస్తోంది.

"బాబాయ్! ఈ విషయం మీలోనే వుంచండి. మొన్న పదిమంది మాత్రమే అసలు స్టాకు చూడగలిగారు. దానికి పూర్తి బాధ్యులుగా నా భర్తను పేర్కొన్నారు. యీమారు సుధాకర్ గ్రామమందరినీ తీసుకువచ్చి అసలు దొంగల్ని పట్టిస్తా మన్నారు. బిల్లులోవున్న స్టాకు సరిపోతేనే కిందికి దింపించమన్నాడు. అంత నమ్మకంగా చెపుతున్న సుధాకర్‌ని నమ్మమంటారా బాబాయ్!"

"వేణుగోపాల్‌పై చర్య తీసుకోకముందే ఇది జరగాలమ్మా! ఆ రోజు త్వరగా రావాలని కోరుకుంటున్నాను. ఉద్యమ ఫలితం చూశావా తల్లీ! మూర్ఖులు సహితం నీ పాదాక్రాంతులయారు...."

రోజులు త్వరితగతిని గడచిపోయాయి. ఏ రోజుకోసం అందరూ ఎదురు చూశారో ఆ రోజే వచ్చింది.

"విజయమ్మా హెడ్మాష్టరుగారికీ విషయం తెలియనీయకూడదు. ఏ ఆర్భాటమూ చేయకూడదు. రహస్యంగా అందరికీ చెప్పివుంచాను. ఆ సమయానికి అందరూ చుట్టుముట్టడం- నేరం బయటపడటం జరుగుతుంది" అన్నాడు సుధాకర్.

ఒకరితోనొకరు మౌనంగానే మాట్లాడుకుంటున్నారు.



మధ్యాహ్నం రెండుగంటల సమయం. సామాన్లతో రెండు నాటుబళ్లు మామూలుగా వచ్చి నిల్చున్నాయి. దించటానికి కూలీలు వచ్చి నిల్చున్నారు. సుధాకర్ ముందు నడువగా నలుప్రక్కలనుంచి గ్రామప్రజలు కిచన్ ఆవరణను చుట్టుముట్టారు. వేణుగోపాల్, విజయ అందరి ముఖాలు పరికిస్తున్నారు.

సుధాకర్ స్వయంగా సామాన్లు లెక్క పెట్టడం బండ్లలోనున్నవీ బిల్లులలో నున్నవీ సరిపోవటం గమనించాడు.

వెనకనుంచి పొంచుని చూస్తున్న హెడ్మాష్టరూ ఇన్స్పెక్టరూ అకస్మాత్తుగా అందరి మధ్యకూ వచ్చారు.

"ఏమయింది సుధాకర్ ఏమయింది? వేణుగోపాల్ దొరికాడా లేదా? తాను చేస్తూ మనమీద నెట్టటానికి ప్రయత్నిస్తున్నాడన్నమాట!"

"అన్నీ సరీగానే వున్నాయి ఇన్స్పెక్టర్‌గారూ."

"ప్రజల నుద్దేశించి ఇన్స్పెక్టర్‌గారు మాట్లాడతారట" అన్నారు హెడ్మాష్టరు.

ఆసక్తిగా అందరూ ముందుకు వచ్చారు.

"ప్రభుత్వం దయాధర్మంకొద్దీ పిల్లలకు అల్పాహార పథకం ప్రవేశ పెట్టింది. నిర్వహణలో సాధకబాధకా లుంటాయి. కాదనను. ఇలా ఫిర్యాదులు వంపటంవలన ఉన్న సౌకర్యాలు పోతాయి. ఎందరో పేదపిల్లలకు ఆకలి తీరుతున్న సమయం– మధ్యాహ్న భోజనపథకం కూడా ప్రవేశ పెట్టాలనుకుంటు న్నారు. కాని విజయ, వేణుగోపాల్‌ల చర్యలవల్ల రాకుండా పోవడానికి కవకాశా లున్నాయి. మీరందరూ చూశారుగా స్టాకు సరీగా వచ్చిందీ లేనిదీను"

విజయ, వేణుగోపాల్ ముఖాల్లో చిక్కితే నెత్తురు లేదు.

"పోయిన నెల విజయ వేణుగోపాల్‌ని స్వయంగా పట్టుకుంది. అందుకనే యీమారు స్టాకు హెచ్చుతక్కువలు లేకుండా వచ్చింది. ఆ సామాన్లకు పూర్తి బాధ్యత వేణుగోపాల్‌ది. కాబట్టి అయనను ఇటువంటి పథకంలేని ఊరుకు బదిలీ చేయమని రాశాను– అంతవరకూ అయనను నెలరోజులు బలవంతంగా సెలవుపై పంపవలసివచ్చింది. విధినిర్వహణలో నిజాయితీలో తనకుతానే సాటనిపించుకున్న హెడ్మాష్టరుగారి కోరికపై అదనంగా నెలకు ఐదు గోధుమనూక బస్తాలు, పది నూనె డబ్బాలు మంజూరు చేయమని పైఅధికారులకు రాయటం జరిగింది."

చేతిలోని బిల్లులు తదితర పుస్తకాలు హెడ్మాష్టరు కందచేసి విజయ వెనుక నిర్జీవంగా నడచి వెళ్లాడు వేణుగోపాల్ నాయుడిగారింటికి.

అంతవరకూ వున్న నిశ్శబ్దం కలకలారవంగా మారింది.

ఎప్పటికప్పుడు రంగులు మారుస్తున్న దుండగుల అక్రమాల ఉద్యమం తిరుగులేని రీతిలో స్వైరవిహారం చేస్తోంది.

విజయ నీతినియమాల ఉద్యమం ఆ గ్రామంలో చచ్చినవాడి దేహంలా చప్పున చల్లారిపోయింది.

——




''ఆదివారం వస్తున్నాను. పాపని తీసుకు
వెళ్ళాలన్న నిశ్చయంతో."
విశ్వనాథ్."

ఇన్‌లాండ్ కవర్లో వున్న ఆ రెండు పంక్తుల్నీ చదవగానే శారద మనస్సున దుఃఖం సముద్రంలా ఘోషించింది.

"విశ్వనాథ్!" వట్టి 'విశ్వనాథ్.' ఇంతేనా? ఇంతకు మించి నా కేమీ కాలేరన్నమాట!" ఆమె గొణిగింది కళ్ళు వత్తుకుంటూ.

"పాపా! నాన్నగా రొస్తున్నారు! నువ్వు.... వెళ్తావా?" ఆరేళ్ళపాప ఆట బొమ్మని జోకొడుతూ అడిగింది-

"నాన్నంటే.. గోపాలం అంకులేనా?"

కాదన్నట్లు తలూపింది శారద.

"అయితే లాజాలావ్ బాబాయా?" కళ్ళనిండుగా వుత్సాహాన్ని మెరిపించుతూ ప్రశ్నించింది.

"నీకు నాన్న గుర్తులేరా చిన్నా?" ఆమె గొంతులో ఆవేదన. వణికి పోసాగింది.

"ఓస్!.... అ! నాన్నా! వుందమ్మా! ఇప్పులే తెచ్చేత్తున్నా!" పరుగెట్టుకెళ్ళింది లోనికి.

"ఈ బొమ్మ- మా నాన్నంటమ్మా! చిట్టిమామ్మ చెప్పింది మొన్న!" అంటూ ఓ బొమ్మ తెచ్చి చూపించింది. శారద కాదని చెప్పలేక 'ఆడుకోమ్మా!' అని లోనికి వెళ్ళిపోయింది.

"ఆదివారం రాకుండా వుంటే బావుండును!" శారద మనస్సు నిండుగా దిగులు చుట్టుకొంటోంది.

ఆ తరువాత నాలుగురోజు లెలా గడిచాయో ఆమెకు గుర్తేలేదు. భయంతో, ఆ వేదన తో ముడుచుపోయిందామె అన్నాళ్ళూ! పాపని గుండెలకు హత్తుకుని మౌనంగా ఏడ్చింది ఆ రాత్రంతా. తనను తాను శపించుకుంది! విశ్వనాథ్‌ని చూడాలన్న కోరిక తో తహతహలాడిపోయింది! గత స్మృతులతో ఆమె గుండెల్లో ఆనందం పొంగి పైకిరాబోయి హఠాత్తుగా కరిగి కన్నీరయిపోయింది.

"నన్ను.... న న్నేమని పిలుస్తారో? అసలు నా వంక చూస్తారా? ఎలా వున్నారో?..." ఆమె ఆలోచనలు తెగనే లేదు. ఆదివారం రానేవచ్చింది.

"ఆనందం! బాధ! భయం! వుద్వేగం! దుఃఖం ఆమెని మనిషిలా ఆలోచించనీయనేలేదు. వాకిట్లో రిక్షా ఆగిన చప్పుడయింది. గభాలున రాబోయి ఆగిపోయింది. తలుపుచాటున నిలబడి పాపని ముందుకు తోసింది- "నా...న్న. .పాపా! నాన్నమ్మా! వెళ్ళు!" గొంతు తగ్గించి చెప్పింది. రిక్షా దిగి లోనికివచ్చి విశ్వనాథ్ పాపని చూడగానే నవ్వాడు.

"రామ్మా! నేనురా-నాన్నని!" చేతులు చాపాడు.

పాప మనస్సు న ఆనందంగానూ వుంది! దిగులుగానూ వుంది. నాలుగేళ్ళ క్రితం 'నాన్న'ని చూసిన జ్ఞాపకాలేమి ఆ చిన్నారి గుండెల్లో లేవు.

"మరి.... మరి.... నాన్నయితే.... నీకు....మీ సా లెం దు కు న్నా య్? మా బొమ్మలో నాన్నకి.... లేవు.... మరి.... మా లా జా లా వు మామయ్యకూ-లా లేవు!"

విశ్వనాథ్ పాపని ఎత్తుకుని పదేపదె ముద్దు పెట్టుకున్నాడు. గుండెలకు హత్తుకుని "పాపా! నా తల్లీ!" అంటూ అప్యాయంగా కళ్ళపైన ముద్దు పెట్టుకున్నాడు మళ్ళీ! కన్నీటితెరలు అడ్డువస్తున్నా ఆగకుండా, మాట్లాడ్డానికి భాషే రాదన్నంతగా వివశుడై పోయి ఆ చిన్నారి చేతుల్ని తన చెక్కిళ్ళకేసి రుద్దుకున్నాడు.

"ఎందుకు నాన్నా? ఏడుత్తున్నావ్?" పాప ప్రశ్న అతణ్ణి మరింత చిన్నపిల్లవాణ్ణి చేసివేసింది. పాప ముఖానికి ముఖం అన్చి వెక్కి-వెక్కి- ఏడ్చాడు.

"కాదు తల్లీ! కాదు! ఏడుపు కాదిది! సంతోషం!" అంటూ తనను తాను నిగ్రహించుకున్నాడప్పటికి రుమాలుతో కళ్ళు

కుడుచుకుని పాపని క్రిందకి దింపి బిస్కెట్స్, స్వీట్స్, బొమ్మలూ సూట్ కేస్‌లో నుంచి తీసి ఇచ్చాడు.

"ఈ బిస్కెట్ తియ్యగా వుంటుందమ్మా! ఇదుగో! ఈ స్వీట్ చూడు! మరీ బావుంటుంది! అరరే! పాలకోవా వుందమ్మా! ముందు యిది తినాలిరా!" సంతోషంతో అతనికి మతేపోయింది.

"అబ్బ! వుండు మరీ! అన్నీ ఒక్కసాలే.... తింటారేంటి!" పాప విసుక్కుంది.

"నిజమేరా తల్లీ! సరే నువ్వు తింటూ యీ రైలుబొమ్మ ఎలా చక్రాలమీద పరుగెడతుందో చూడు!" అంటూ రైలు తీసి పట్టాలమీద వదిలాడతడు. కారు తీసి కీయిచ్చి మరోవైపుకు తోశాడు.

"మన రైలు.... కి.... కూత లాదా నాన్నా!"

"ఏవిటి!! ఓహో! కూతా! వస్తుందమ్మా!" అంటూ తానే యీలవేశాడు రైలింజనులా. పాప పకపకా నవ్వేసింది.

"రైలు కూత ... యిలా వుండదు నాన్నా!"

"మరెలా వుంటుందమ్మా!"

'కూ!' అని అరిచి చూపించింది! 'గుప్! గుప్!' అనాలని సరిదిద్దింది!

అతడు పసిపిల్లవాడిలా తలూపాడు నవ్వుతూ.

"నాదగ్గిర అమ్మ బొమ్ముంది మరి నీకొక్కటివాలా!"

"వద్దమ్మా!" అతని ముఖాన నవ్వు క్షణంలో మాయమైపోయింది. అంత వరకూ గుండెల్ని చిక్కబట్టుకుని తలుపుచాటునుంచి ఆ తండ్రీకూతుళ్ళ ఆటల్ని చూస్తూన్న శారద మనస్సుని నిర్దాక్షిణ్యంగా ముక్కలుముక్కలుగా కోసివేసిందతని జవాబు.

అతడు తలెత్తి కూడా చూడనేలేదంత వరకు.

"ఇదుగో! మహారాజు బొమ్ముందమ్మా! మరి....కోతిబొమ్మ కూడా! ఆ! అసలైన బొమ్మ యిదమ్మా! చూడు 'డోలు' వాయిస్తుంది!" అంటూ భజంత్రీ బొమ్మని తీసి కీయిచ్చి చూపించాడు.

తండ్రి మెడచుట్టూ చేతులు వేసి కళ్ళల్లోకి చూస్తూ సంతోషంగా అడిగింది—

"నాన్నా! మరీ....మరి.... మీ అమ్మ నీకు బోలెడన్ని డబ్బులిస్తుందా?"

"ఇవ్వకపోతే నేనూరుకోనుగా మరి!"

"మరి.... యీదనుకో! ఏలుత్తావా? మరే! నాన్నాలూ! నేనూ ఏలుత్తా! అయినా అమ్మ బొమ్మలకి డబ్బులీను పో!" అనేసింది.

"నేనిస్తానమ్మా! బజారుకెళ్ళి నీకొక్కవలసిన బొమ్మలన్నీ కొనుక్కుందాం! ముందు కాసిని మంచినీళ్ళు త్రాగమ్మా! గొంతు పడుతుంది!" అంటూ బిస్కెట్టు తినడం ఆపించి మంచినీళ్ళు గ్లాసులో పోసి త్రాగించాడు.

"బలే! బలే! చల్లగా వున్నదీ మంచినీళ్ళు!" పాప మరో గ్లాసుడు త్రాగింది.

"దీంట్లో పోస్తే నీళ్ళు చల్లగావుంటాయమ్మా! నీ కోసమే తెచ్చానమ్మా యీ ఫ్లాస్కు!" మురిపెంగా పాపకి చూపించాడు ఫ్లాస్కుమూత తీసి.

"చిన్నా! కాఫీ తీసికెళ్ళమ్మా," శారద పిలుపు విన్పించి పాప వెళ్ళబోయింది.

"వద్దమ్మా! మనం బజారు కెళ్ళి మంచి మంచి గౌన్లు కొనుక్కొద్దాం పద!" అంటూ లేచి పాపని ఎత్తుకుని వాకిట్లోకి వెళ్ళి రిక్షా ఎక్కాడు.

శారద వరండాలోకి వచ్చి చూసింది. అక్కడున్న బొమ్మల్ని జాగ్రత్తగా తీసి పెట్టెల్లో పెట్టింది. తెరిచివున్న సూట్‌కేస్‌ని మూయబోతూ ఆగిపోయింది. ఓ పుస్తకంలోనుంచి ఎవరికో వ్రాసిన వుత్తరం సగం బయటికివచ్చి తొంగి చూస్తోంది! దాన్ని తీసి సరిగా పెట్టబోతూ ఆగిపోయింది,

"అక్కా!

నాలుగేళ్ళ తరువాత నీ కీ వుత్తరం వ్రాయకుండా వుండలేకపోతున్నాను. నేనెలాంటి మనిషినో నీకు తప్ప మరొకరికి తెలియదు! నా మనస్సు ఎంత కోమలమో! కానీ ఆ కోమలత్వాన్ని ముక్కలుచేసి వెళ్ళిపోయింది శారద! స్త్రీ అంటే నాకు ఎనలేని గౌరవం! శారదని ఎంతగా ప్రేమించానో నీకు తెలుసు! తనకోసం నాన్నతో యుద్ధంచేసి వుద్యోగం సంపాదించుకుని అమ్మ కన్నీటికి కూడా కరగనంత పాషాణమూర్తినైపోయి శారదని నా జీవితంలోకి ఆహ్వానించాను. ఆస్థిని కాదని వెళ్ళి శారదతో కొత్త జీవితం ఆరంభించాను విశాఖపట్టణంలో.

ఆమెలోని అందం నన్ను పిచ్చివాణ్ణి చేసింది. బహుశా ఆ వయస్సు నన్ను ఏమీ ఆలోచించనీయలేదేమో! యౌవ్వనంలో ఆలోచనకి సమయమే లభించలేదు నీ వన్నట్లు!

శారదకి ఏ లోటూ రానీయలేదు. లెక్కలేదుగా సంపాదించినదంతా తన చేతుల్లోనే పోసేవాడిని!

పాపపుట్టింది రెండో సంవత్సరంలో! వాళ్ళన్నయ్య వచ్చి తీసుకువెళ్ళాడు మమ్మల్ని! అక్కడే యిద్దరం విడిపోయాం!

శారదవాళ్ళన్నయ్య స్నేహితుడు శేఖరం వచ్చాడోనాడు. పాపని చూసి 'బ్యూటిఫుల్' అంటూ ముద్దెట్టుకున్నాడు. వాళ్ళో సినిమా తీస్తున్నారోజుల్లో! పాపని ఎత్తుకుని ఓ సీనులో నిలబడింది శారద! హీరోకి పాప నందించడంకోసం! ఆ తరువాత నేను విశాఖ వచ్చేశాను శారద పదిరోజులైనా రాలేదు. టెలిగ్రాం యిచ్చాను. సమాధానం రాకపోయేసరికి నేనే వెళ్ళాను.




'శారద హీరోయిన్‌గా సెలక్టయ్యింది బావగారూ! శేఖరే తీస్తున్నాడు! సినిమా బాగా వస్తోందిలే! శారద ఎంత బావుందని! చక్కగా ఏక్టు చేస్తోందండీ! చూడండి!' అంటూ ఫోటోలు తెచ్చి చూపించాడు వాళ్ళన్నయ్య! నేను శారద ఏదని అడిగాను. షూటింగుకి 'వూటీ' వెళ్ళిందన్నాడు! పిలిపించమన్నాను. ఫోను చేశాను నేనే! "శారదగారా! లేరండీ! మైసూరు వెళ్ళారు! ఇప్పుడే హీరోతో!" అంటూ ఫోను పెట్టేశాడు శేఖర్! అంతే! ఆ తరువాత శారదని నేను చూడనేలేదు. పాపకోసం వెళ్ళాలనుకునేవాణ్ణి! కానీ కనీసం ఒక్క అక్షరమైనా రాయని శారదని చూడ్డానికి నాకు మనసొప్పలేదు!

ఆరేళ్ళు గడిచిపోయాయి! శారద నన్ను కాదని సినిమాల్లోచేరిందని బంధువులందరికీ తెలిసిపోయింది. ఆ తరువాత రెండు మూడు సినిమాలు వచ్చాయి. శారదే హీరోయిన్! చూడాలనిపించేది! కానీ గుండెలు పగిలిపోతాయన్న భయంతో, చూడలేకపోయాను.

ఆర్మీలోకి వెళ్ళిపోయాను, ఆ వాతావరణం భరించలేక.

శేఖర్‌ని కాదని గోపాల్‌గారి పిక్చర్లోకి వెళ్ళిపోయిందని ఓ స్నేహితుడు వ్రాశాడు కొన్నాళ్ళ క్రిందట! ఆ తరువాత శారదకి ఎవరి పిక్చర్లోనూ ఛాన్సు రాలేదట! ప్రస్తుతం రాజారావుగారి కంపెనీతో డ్రామాలు వేస్తోందట!

నాకు యీ జీవితంకూడా సంతోషాన్నివ్వడం లేదక్కా! పాపని తీసుకుని బొంబే వెళ్ళిపోవాలనిపిస్తోంది! అక్కడ అన్నయ్య ఫ్యాక్టరీలో స్థిరంగా వుద్యోగం

జేస్తూ పాపని పెంచుకుంటాను.

ఇన్నాళ్ళూ యీ క్షోభని భరించలేక, నీకు చెప్పే ధైర్యంలేక సతమతమై పోయింది నా మనస్సు! ప్రాణంలో ప్రాణంలా ప్రేమించిన శారద నన్ను కాదని ఎందుకు వెళ్ళిపోయిందో నా కిప్పటికీ అర్థం కాదక్కా!'

అమ్మా నాన్నా ఏడ్చారు! మళ్ళీ పెళ్ళి చేసుకోమని బ్రతిమాలారు! ఎందుకు? మళ్ళీ మరో శారద నా కెందుకు! నా మనస్సులో యిప్పుడు ప్రేమలేదు! ద్వేషం కూడా లేదు? చావాలనీ అన్పించదు! బ్రతకాలనీ అన్పించదు! పిచ్చివాణ్ణయి పోయానేమో నన్పిస్తోంది. ఎవరికోసం బ్రతకాలి నేను? చనిపోయినా ఏడ్చేవాళ్ళెవరున్నారు? శారదా! ఏడ్చినా నేన్నమ్మను నా కామె ఏదో అవుతుందని! పాపకి నేను గుర్తే లేనేమో! పాపకోసం బ్రతగ్గూడదా! అన్పించుతోంది మధ్య, అన్నగారి పిల్లల్ని చూస్తోంటే!

అందుకే యీ ఆదివారం వెళ్తున్నానక్కా! నా జీవితం గడ్డిపువ్వులా...."

మధ్యలో ఆగిపోయిందా వుత్తరం. రాజ్యలక్ష్మి అతని పెదనాన్న కూతురు. వాళ్ళిద్దరూ మంచి స్నేహితులు! అందుకే వ్రాశాడామెకి.

శారద వుత్తరం చదువుతూ ఏడ్చేసింది.

"మీ జీవితాన్ని.... నేను నాశనంజేసి వేశాను! నన్ను.... కాల్చి.. చంపెయ్యండి! నాకా బ్రతకాలని లేదు! మీరు గుర్తురాని క్షణంలేదంటే నమ్మరెవ్వరూ! అన్నయ్య నన్ను డబ్బుకోసం యీ బురదలోకి దింపాడు! ఆ పిచ్చిఆకర్షణలో నా అందం నాలో అహాన్ని పెంచి మీనుంచి దూరం చేసింది...." శారద గుండెలు పగిలి పోతాయన్నంతగా దుఃఖించింది. అతని వస్తువుల్ని స్పృశించుతూ కళ్ళు వత్తుకుంది. అడుగునవున్న వుంగరం తీసి చూసింది.

"దీన్నింకా భద్రంగా దాచుకున్నారా? .... భగవాన్!" 'శారద' అన్న అక్షరాలు చదివి బొమ్మలా కూర్చుండిపోయింది చాలా సేపటివరకు.

"నేనో రాక్షసిని! మీరిచ్చిన కానుక కూడా మిగుల్చుకోలేకపోయాను! నా గుర్తుగా మీరు...." ఆమె గొంతునిండుగా దుఃఖం పొంగింది.

"అమ్మా! చూడు! నాన్నా రెన్ని కొన్నాలో!" పాప సంతోషంగా గంతులు వేసుకుంటూ వచ్చేసింది. శారద గభాలున లేచి నిలబడింది. ఆమె చేతిలో వుంగరం అలాగే వుందింకా.

"ఆ వుంగరం నీకివ్వాలనే తెచ్చాను!" అన్నాడు, అప్పుడే వచ్చిన విశ్వనాథ్ ఆమెవైపు చూడకుండా తలవంచుకుని.

శారదకి తల నేలకేసి పగలగొట్టుకోవాలన్నంత కోపం వచ్చింది! సిగ్గుతో దహించుకుపోసాగింది.



"పాప, నేనూ వెళ్ళిపోతున్నాం!" అతడు యీసారి తలెత్తి ఆమెవంక చూశాడు.

శారదకి ప్రాణంపోతున్నంత బాధగా వుంది లోలోన.

"ఈ ఒక్కపూట ఆగండి! పాప నగలు బేంకులో వున్నాయి! రేపు యిస్తా నన్నారు!" గొంతుపెగుల్చుకుని చెప్పింది.

అశ్రుపూరితాలైన ఆమె కళ్ళు అతడిని నోరెత్తనీయలేదీసారి! ఏదో గొణుక్కున్నాడు లోలోన.

ఆ రాత్రి భోజనం వడ్డించి పాపతో

కబురంపించింది. 'రా రే మో' అని భయంతో వణికిపోయింది. కానీ అతడు లేచి వెళ్ళాడు. మౌనంగా భోజనంచేసి వరండాలోకివచ్చి పాపని పిల్చాడు.

"ఎన్నేళ్ళో అయిందమ్మా! యింత కమ్మని భోజనం తిని! మళ్ళీ దొరికిందీ వేళ! ఈ అయిదూ లోపల యిచ్చిరా! ఎవరికీ ఋణపడకూడదమ్మా!" అతడు అయిదురూపాయల నోటు పాపచేతికిచ్చి పంపాడు.

శారద సంతోషం యిట్టే ఆవిరై పోయిందా నోటు చూడగా నే!పిచ్చిదానిలా నోటువంకే చూస్తూండిపోయింది!

"మిమ్మల్ని యింత పాషాణంగా మార్చింది నేను! నాకీ శిక్ష చాలదసలు!" గుమ్మానికి చేరగిలబడి తనను తానే శపించుకుందామె.

విశ్వనాథ్ వరండాలోనే పక్క పరుచుకున్నాడు దుప్పటి తీసి.

"లోపల పడుకోగూడదనా!" శారదని దుఃఖం దహించివేస్తోంది.

అతడు పాపని గుండెలపైన పడుకో బెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు.

"రాకూడదన్న నియమేమీ లేదు! కానీ రేపు నన్నీమాట అడిగేవాళ్ళెవరూ లేరు! నేను అర్మీ మనిషిని! చేయవలసిన పని తప్ప సుఖంగురించి ఆలోచించద మన్నది మాకు గుర్తుండకూడదు!"

శారద మనస్సుని పిండిచేసిందా సమాధానం.

"మీరు మరో పెళ్ళిచేసుకోండి! నే ..........అడ్డురాను!"

"నువ్వు చేసుకున్నావా!"

అతడి ప్రశ్న కామె వణికిపోయిం నిలువెల్లా.

"నేను.... నేనో శిలని! ప్రాణంలే శిలని! నా కెందు కింకా అవన్నీ!"

"నాకా అదృష్టం కూడా లేదు! అవ కోసం బ్రతకాలి! కన్నతల్లిని శిక్షించలే మనిషిగా బ్రతుకుతున్నట్టు నటి న్నాను!"

"నా తప్పు మిమ్మల్ని శిక్షిస్తుంద నే ననుకోలేదు!"

"నావంటి మనిషికి బ్రతకడ ఓ శిక్ష! అందుకే నే నెవర్నీ నాకో కన్నీళ్ళు పెట్టనీయను!"

ఆమె మాట్లాడలేకపోయిందిసారి—

అతడూ నోరెత్తలే దాపైన. రెం మూడు గంటలలాగే కూర్చుండిపోయిం అయినా విశ్వనాథ్ మాట్లాడలేదు.

నిట్టూరుస్తూ లేచివెళ్ళింది— మం నీళ్ళు కూజా తెచ్చి అతని ప్రక్కన వెళ్ళిపోయింది.

ఆమె సన్నగా ఏడుస్తోందని అత గ్రహించీ నిశ్శబ్దంగానే వుండిపోయా

అర్ధరాత్రి మంచినీళ్ళకోసం తాగబోతూంటే "అబ్బా! అమ్మా!! మూల్గడం విన్పించి లోనికి వెళ్ళా శారద మెలికలు తిరిగిపోతోంది.

"గుండెలో నొప్పండీ!.... అ



య

భరించలేనిక.... నన్ను.... కాల్చి.... బూడిదచేసి వెళ్ళండి.... ప్లీజ్! నా కిక... బ్రతకాలని లేదు.... అబ్బా!" అతనికేం చేయాలో తోచలే దొక్క_క్షణం! ఆ తర్వాత వెంటనే వెళ్ళి టాక్సీ తీసుకు వచ్చాడు. శారదని పసిపిల్లలా భుజాన వేసుకుని, టాక్సీ దగ్గరకి తీసికెళ్ళి కూర్చోబెట్టాడు. పాపని లేపి, తాళం వేసి టాక్సీ ఎక్కాడు. "మంచి డాక్టరు దగ్గరకి వెళ్ళనీయమన్నాడు డ్రైవరుతో.

హాస్పిటల్లో చేర్చగానే డాక్టరు గుండె జబ్బు మనిషి అని చెప్పాడు.

ఇ.సి.జి. తీసి, యింజక్షనిచ్చి ఆక్సీజన్ పెట్టాడు. విశ్వనాథ్ పిచ్చివాడిలా చూస్తూండిపోయాడు. రెండు గంటలకి శారద నొప్పి కొంత తగ్గిందేమో సొమ్మసిల్లి నిద్రపోయింది.

"యూ ఆర్ లక్కీ! మిస్టర్ విశ్వనాథ్! మీ భార్య హార్ట్ అటాక్ నుంచి కోలుకుంటుంది!" అన్నాడు డాక్టరు.

"వైఫ్! నా వైఫ్!" నవ్వుకున్నాడు విరక్తిగా.

అయిదింటికే లేచి బయటకి వస్తూంటే రాజ్యలక్ష్మి కన్పించింది.

"అక్కా! ఏమిటి! నువ్విక్కడు న్నావ్!" అడిగాడు.

"అరే! నువ్వటరా! విశ్వం! మీ బావగారికి పక్షవాతం వచ్చింది! కాలూ చేయీ పనిచేయడంలేదురా! మద్రాసులో యీయన మంచి స్పెషలిస్టని వచ్చాం విన్నానే! ఏమిటి సంగతులు!"

"బావగారు లండన్ నుంచి వచ్చారా! మరి...."

"మనిషి వయస్సులో ఎన్నో తప్పులు చేస్తాడు విశ్వం! ఆయన లండన్ భార్య రానన్నదట! కూతురు పొమ్మంది! మరి యీ రాజ్యలక్ష్మి కాదనదన్న ధైర్యం వుండే వచ్చేశారిక్కడికి!" ఆమె నవ్వింది నిర్లిప్తంగా.

"నువ్వింకా బావనే ప్రేమిస్తున్నావా! ఆయన...."

"అవునా! ఆయన త్రాగుబోతు! వ్యభిచారి! కానీ.... నేను.... నేను.... మనిషినా! నీతినియామాలున్న మనిషిని! అందుకే ఆయన్నింకా ప్రేమిస్తున్నానురా! అయినా యీ నిస్సహాయ స్థితిలో నేను తప్పనిసరిగా మీ బావగారిని ప్రేమించగల గుండెధైర్యం ఎవరికుంటుందిరా! తప్పు తెలుసుకున్న మనిషి ప్రేమకర్హుడే విశ్వం! అవును గానీ నువ్విక్కడున్నావేమిటీ!"

అతడు జరిగిందంతా చెప్పాడు.

"విన్నావురా! నువ్వేం చెబుతావోనని ఆగాను! మగవాడు తప్పుచేస్తే ఆడది క్షమించాలి! కానీ ఆడది తప్పుచేస్తే మగవాడు క్షమించలే దెందుకని!" విశ్వనాథ్ నవ్వాడు హాయిగా, చాలా రోజుల తరువాత.

"అది మగవాళ్ళలో వున్న బలహీనత! నిజం చెప్పాలంటే మేము 'మీ

కన్నా ఓ మెట్టు పైనున్నామన్న 'అహం' కూడా! అందుకా్కరణం మీ ఆడవాళ్ళే! మమ్మల్ని 'మగమహారాజు' అన్న బిరుదు లిచ్చి తెలివిగా మాలోని అహాన్ని రెచ్చ గొట్టి— తప్పులు చేశాక— క్షమించేశాం పొండోయ్!' అంటారు మీరు దేవతలై పోయి!"

రాజ్యలక్ష్మి నవ్వింది—

"శారద చేసిన తప్పుల్ని నన్ను చూసి క్షమించరా విశ్వం" ఆమె కళ్ళ నిండగా కన్నీళ్ళు!

"నువ్వు ఏ జన్మలోనో మా అమ్మవి! అందుకే నా శారదకి అన్యాయం జరగ నీయకుండా చేసి నా ప్రాణాల్ని నిలబెట్టా వక్కా!"

"అయితే మీ అమ్మాయి మా యింటి కోడలుగా రావలసిందేరా విశ్వం!"

"శారద కీ మాటలు చెప్పివస్తా నుండక్కా!" విశ్వనాథ్ సంతోషం మెరుస్తున్న కళ్ళతో నవ్వి పరుగెత్తాడు.

"మీరు.... మీరున్నారా?" శారద ప్రశ్నించింది.

"తగ్గిందా శారూ! జబ్బు! హడిలిపోయా ననుకో!" ప్రేమగా ఆమె కళ్ళల్లోకి చూస్తూ అడిగాడతడు.

"ఒక్కసారి పిలవండి మళ్ళీ 'శారూ' అని!" ఆమెకు భయంగా వుంది లోలోన—

"ఇక రోజూ అదేపనిగా యీ పీ విళ్ళానికి!"

"మీరు.... అయితే.... నన్ను.... క్షమించారా?" ఆమె గుండెల్లో కొండంత ఆనందం.

"నేను బ్రతికేదే నీకోసం శారదా!"

"విశ్వం! శారదకి మేలుకొలుపు పాడావా!" అంటూ వచ్చింది రాజ్యలక్ష్మి.

శారద ఆమెను చూసి అశ్రుసిక్త నయనాంతో చేతులెత్తి నమస్కరించింది.

"మళ్ళీ నాకు బ్రతుకుమీద ఆశ కల్గించారు!" అన్నది.

"లేకపోతే మా కోడల్నెవరు పెంచు తారమ్మా!"

శారద కళ్ళనిండగా జీవకాంతి మెరిసింది. విశ్వం శారద చేతినందుకుని ప్రేమగా నవ్వాడు—

"మన పాపకి మంచి అత్తగారు దొరికింది!" అన్నాడు, రాజ్యలక్ష్మి వంక చూసి. శారద భర్త చేతిని మరింత ప్రేమగా అందుకుంది.



# కాకులు

## వేముల శకుంతల



వరండాలో చివరగా ఓ చిన్న స్టూలుమీద కూర్చునివుంది ఆమె. భుజాలనిండుగా కొంగు బిగించుకున్నా మనసు నిండా కొండంత దిగులు - కళ్ళనిండా గుబులు నింపుకొని నిముషనిముషానికి, సన్నగా నిట్టూరుస్తూ - నుదుట పేరుకుంటున్న చిరుచెమటల్ని కొంగుతో తుడుచుకుంటోంది.

ఆ వీధిలో రోడ్డుకవతల సగం ఎండి కొమ్మలు నరికిన తుమ్మచెట్టుమీద-కొన్ని కాకులు అదేపనిగా అరుస్తున్నాయి. కొన్ని రెక్కలు విప్పుకుని టపటప కొట్టుకుంటుంటే మరికొన్ని కిందకీ పైకీ ఎగురుతూ శ్రుతి కలుపుతున్నాయి.

పావుగంట క్రితం- ఓ కాకి రెండు సార్లు అరిచింది. ఐదునిముషాల తరువాత మరో నాల్గు కాకులు- గుబగబా వచ్చి టెలిగ్రాపు తీగమీద వాలేయి. సరిగ్గా

మరో ఐదారు నిముషాల్లో- అరడజను కాకులు తుమ్మచెట్టు కొమ్మల్లో దూరి- గొంతు కలిపేయి!

ఇప్పుడవన్నీ మూకుమ్మడిగా గోల చేస్తున్నాయి! వాటన్నిటి చూపు - చెట్టు కిందవున్న చెత్తకుండీ పక్కన ఓ చచ్చి పడున్నట్టున్న 'పదార్థం'మీదే వుంది!

నిర్మానుష్యంగా- నిశబ్దంగా వున్న ఆ వీధిలో ఆ కాకుల గోల తప్ప మరేమీ వినిపించటం లేదు—

వరండాలోని ఆమె- తల తిప్పి అటు చూసింది. ఆమె కూర్చున్న వరండా నుంచి కొద్దిగా పక్కగావున్న ఆ తుమ్మ చెట్టుమీద కాకులు మరింతగా రెచ్చి పోతున్నాయి.

విసుగ్గా - భరించలేనట్టుగా కళ్ళు మూసుకుని మళ్ళీ తెరిచింది- అప్పుడు పావు తక్కువ రెండు కావస్తోంది సమయం!

సరిగ్గా అప్పుడే లోపల గుమ్మంలో నుంచి 'ఓ తల' బయటకి చూసి మళ్ళీ లోపలికి తప్పుకుంది. ఆ తల తాలూకు రెండుకళ్ళు-ఆమెను సూటిగా చూసేయి!

ఆమె చిన్నగా నిశ్వసించుకుంది!

వాచీ చూసుకుంది- అప్పుడే తను వచ్చి అరగంట దాటింది.ఈ అరగంటలో తన అనుభవాన్ని గుర్తుచేసుకుంది.

బస్సు దిగి అడ్రసు చూసుకుంటూ రెండు మెయిన్ బజార్లు నాలుగైదు చిన్న సందులూ దాటి ఈ వీధిలోకివచ్చి గేటు తీసుకుని లోపలికి వచ్చింది. లోపల్నుండి ఓ పెద్దమనిషి వరండాలోకి వచ్చి 'ఎవరు కావాలి?' అని అడిగేడు.

తను చెప్పింది- 'రఘుప్రసాద్‌గారు వుండేది ఇక్కడేనా? వారికోసం హైద్రాబాదు నుండి వచ్చాను-'

ఆ పెద్దమనిషి పైనుంచి కిందకి- కిందనుంచి పైకీ చూసి, కనుబొమ్మలు పైకి లేపి- 'ఓహో! అలాగా! వాడితో ఏమిటి పనీ?' అనడిగేడు.

తను వెంటనే చెప్పలేకపోయింది. అయినా రఘుతో తప్ప తనకి ఎవరితోటీ పరిచయం లేదు- కొత్త వ్యక్తులతో తన వ్యక్తిగత విషయం ఎలా చెప్పగలదు! సిగ్గుగా ఇబ్బందిగా అనిపించి- 'వారు లేరా?' అన్నది.

'ఏం? వాడితో కానీ చెప్పకూడనిదా? నేను వాడి మేనమామని! ఫర్వాలేదు చెప్పవచ్చును.' అన్నాడా పెద్దమనిషి- ఆ మాటతీరులో వినిపించిన వ్యంగ్యం, హేళన- తనకి చురుక్ మంది. మనస్సు గాయపడింది. గిర్రున వెనక్కి తిరిగి వెళ్ళిపోదామనుకుంది. కాని అతికష్టంమీద నిగ్రహించుకుని- తన అవసరాన్ని గుర్తు చేసుకుని- చిన్న నవ్వు నవ్వి- 'ఇంతకీ వారు ఇంట్లో లేరా? మీరు మేనమామ గారా! నమస్కారం!' రెండు చేతులు జోడించింది.

ప్రతినమస్కారం చెప్పలేదు సరి కదా- విసురుగా ఇంట్లో కెళ్ళిపోయాడు!

ఏం చేయాలో తోచక- రెండు నిముషాలు తటస్థంగా నిలబడిపోయింది తను. అప్పుడు లోపల్నుంచి ఓ అమ్మాయి సరిగ్గా తన వయస్సుదే- అంటే ఇరవై- ఇరువై ఐదు సంవత్సరాల మధ్యలోవున్న అమ్మాయి బయటికి వచ్చింది.

'ఎవరండీ? ఎవరు కావాలి?'

'నేను హైద్రాబాదు నుంచి వచ్చానమ్మా! రఘుప్రసాదు వున్నారా? వారితో మాట్లాడాలి!'

'మా అన్నయ్యతో మీ కేం పనండీ?' అని నిలదీసింది.

'అంటే___రఘుగారి చెల్లెలా మీరు? నమస్కారం!'

'నమస్కారం! అవును రఘు మా అన్నయ్యే! హైద్రాబాదు నుంచి మా అన్నయ్యకోసం వచ్చారా? ఎందుకు? వాడెలా తెలుసు?' ఆ అమ్మాయి కళ్ళలో ఆశ్చర్యమో- అనుమానమో తెలియని భావం తొంగిచూసింది.

తను మళ్ళీ చిన్నగా నవ్వి- 'మీ అన్నయ్య మా ఆఫీసులోనే పనిచేసేవారు. మాకు బాగా ఫ్రెండ్! వారితో కొద్దిగా పనుండి వచ్చాను. ఇంట్లో లేరా!' అన్నది తను.

'అదే ఏం పనో చెప్పండి! వాడు వచ్చాక చెప్తాను. ఊళ్ళో లేడు___'

'అయ్యో ఊళ్ళోనే లేరా? ఏ ఊరు వెళ్ళేరు? ఎప్పుడు వస్తారు?' తను ఆ క్షణంలో హతాశురాలై పోయింది___

ఆ అమ్మాయి అదోలా చూసి 'ఇంట్లో అడిగి చెప్తాను' అంటు గిర్రున ఇంట్లోకెళ్ళిపోయింది- పది నిముషాల తర్వాత బయటికి వచ్చింది. అంతసేపు తను వరండా మెట్ల మీదే నిలబడి పోయింది!

'మా అన్నయ్య ఈ రెండు గంటల ట్రైనులో వస్తాడు! మరి వుంటారా?'

'వుంటాను' అని తను అన్నాక 'అక్కడ కూర్చోండి' అంటూ ఇదిగో ఈ స్టూలు చూపించి లోపలికి వెళ్ళిపోయింది

తను- అదే మహాభాగ్యంగా భావించి కూర్చుండిపోయింది. మనసంతా చికాకుగా వుంది. బ్రతుకంతా శూన్యంగా కనిపిస్తోంది!!

తనకి ఉద్యోగం వుంది. తన కాళ్ళ మీద తను బ్రతకగల ధైర్యం వుంది. పరువుగా మర్యాదగా జీవించాలనే ఆకాంక్ష వుంది! ఎప్పటికీ తనలోని సంస్కారం, నిలబెట్టుకోవాలనే తపన వుంది. నీతికి నిజాయితీకి కట్టుబడి వుండాలన్న తలంపు వుంది! గొప్ప పనులేమీ చేయలేకపోయినా కనీసం మనిషి స్థాయి నుంచి దిగజారిపోకూడదన్న మంచి మనసు వుంది!

కానీ ఏం లాభం??

సమస్యల ముడిలో చిక్కుకుంది, తను! ఆ ముడి జాగ్రత్తగా విప్పుకోకపోతే- తను అగాధంలో పడిపోతుంది!

అందుకే ఆలస్యం చేయకుండా ఇలా రఘుని వెతుక్కుంటూ వచ్చింది! స్వయంగా రఘుతో మాట్లాడాలి కానీ— తనకి పరిచయంలేని అతని కుటుంబీకులతో ఏమని చెప్తుంది?—

అయినా వీళ్ళ ధోరణి చూస్తే-ఏమిటో బాధగా వుంది! తను ఇక్కడ కూర్చున్న ఈ అరగంటసేపట్లో— ఎదురుగా వచ్చి ఎవరూ పలకరించలేదు సరిగదా బయటికి వెళ్తూ ఒకసారి, లోపలికి పోతూ ఒకసారి— తలమాత్రం బయటికి పెట్టి ఒకసారి— చూస్తున్నారు. నోరువిడిచి మంచి నీళ్ళు కావాలని తను అడిగేదాకా—కనీసపు మరాద్యకూడా చేయలేదు. గ్లాసుడు నీళ్ళు తాగేక 'పర్వాలేదు చల్లగానే వున్నాయి' అనుకుంది— అవి తాగి అప్పుడే— చాలా సేపైంది. మళ్ళీ దాహం వేస్తున్నా అడిగే ధైర్యంలేక గుటకలు మ్రింగుతూ— రఘు కోసం ఎదురుచూస్తూ కూర్చుంది, ఆమె.

ఈ అరగంటనుంచి ఇంటిలోపల చాలా పార్పులు జరుగుతున్నాయి— ఆ ఇంటి పెద్దావిడైన రఘు తల్లి—కళ్ళనీళ్ళు కారుస్తూ— సన్నసన్నగా గొణుక్కుంటోంది—

'పెద్దకొడుకు, ఇంటిని ఆదుకోవల్సిన వాడు—ఇలా తను దారి తను చూసుకుంటే— మా గతేం కానూ? ఇలా నాశనం చేస్తాడనుకోలేదు— నేను ఇప్పుడేం చేయనూ?'

'ఊరుకో అక్కయ్యా! అలా కొంప మునగనిస్తామేమిటి? రఘు వచ్చాక చీవాట్లేద్దాం!' అని ఓదారుస్తూ భుజం రాస్తోంది ఆవిడకి స్వయాన చెల్లెలైన మరొకావిడ.

'ఎంత బరితెగించింది కాకపోతే— ఇలా ఇంటికే వస్తుందా? నేను ఎన్నాళ్ళ నుంచో అనుకుంటూనే వున్నాను.ఎప్పుడు పెళ్ళిమాట ఎత్తినా— వీడు 'ఇప్పుడే వద్దు ఇప్పుడే వద్దు—' అని దాటేస్తుంటే— ఇలాంటిదేమైనా జరిగిందేమో అని అనుమానపడుతూనే వున్నాను. వెధవ ఆడపిల్లలు! మరీ పెట్రేగిపోతున్నారు! కట్నాల బాధ లేకుండా— ఇలా మగపిల్లలమీద వల విసిరి— లోబరుచుకుంటున్నారు. ఇలాంటివాళ్ళు రేపు మరొకడితో వెళ్ళిపోరని నమ్మకమేమిటి? దాని తల్లితండ్రులకి బుద్ధివుండొద్దూ? పెళ్ళి చేయలేకపోతే బ్రతుకుతెరువుకి ఉద్యోగం చేసుకుంటూనే వుందిగదా? అలా జీవితం గడుపుకోక— మంచిపిల్లాణ్ణి చూసి ఇలా మాయలో పడేస్తుందా? గుళ్ళో చేసుకున్నారో— రిజిష్టర్ మ్యారేజ్ చేసుకున్నారో?—

'అయినా ఒక మాట చెల్లెమ్మా!' అని మరింత రహస్యంగా— 'మన రఘుకి దాని మోజు తీరిపోయినట్టుందిలే— లేకపోతే ఇక్కడికి ట్రాన్స్ఫరై వచ్చాక ఈ నెల్లాళ్ళనుంచి పెళ్ళిమాట ఎత్తితే విసుక్కోవటం లేదు— అందుచేత ఏం భయపడక్కర్లేదు— దాన్ని వదిలించుకునే పద్ధతి నేను చెప్తా గదా? ఏడవకు

ఊరుకో!'- అంటూ అభయం ఇస్తున్నాడు, అవిడ అన్నయ్య!

ఒకవేళ అన్నయ్య- అవతల వున్న ఆ అమ్మాయిని- వదినగా స్వీకరిస్తే-తనకి కట్నం ఇచ్చి పెళ్ళి ఎలా చేయగలడూ? వాడు కట్నం తీసుకుని చేసుకుంటే కదా తనకి మళ్ళీ ఘనంగా కట్నంయిచ్చి పెళ్ళి చేయగల స్థోమత్తు వస్తుంది- లేకపోతే తనకి పెళ్ళెలా అవుతుంది? తనకి పెద్ద చదువు- ఉద్యోగం కూడా లేవు. ఇక తనకి పెళ్ళెప్పటికి అవుతుంది? అని రఘు చెల్లెలు దిగులుగా కూర్చుంది.___

మూల మంచంలో- మూల్గుతూనే రఘుబామ్మ-యధాశక్తి గొణుగుతోంది -

"ఏమిటో! నా కొడుకే బ్రతికివుంటే ఈ రఘుగాడు ఇలాంటి అప్రాచ్యపు పని చేస్తాడా? ఓక్కుమాలిన ప్రేమలు___ పెళ్ళిళ్ళు! కులం - మతం - అన్నీ భ్రష్టత్వం అయిపోతున్నాయి! దానిది ఏ వర్ణమో? ఏం పాడో? దాన్ని కొంపలో తెచ్చిపెట్టే నేను బ్రతకలేనే కోడలా? ఈ ప్రాణం ఇంక పలవదు___' అంటూ గుండెలమీద రాసుకుంది.

'నువ్వూరుకో బామ్మా! మామయ్య రానిస్తాడేమిటి? ఎక్కువగా మాట్లాడకు ఆయాసం వస్తుంది. మందు అయిపోయింది కూడా! అన్నయ్యవచ్చి తెచ్చేదాక ఆగాల్సిందే!' అని పెన్తుక్లాసు చదువుతున్న రెండో మనమడు బామ్మని గదమాయించి___ తనను మందు తెమ్మని చెప్పకుండా ముందే హద్దులో వుంచేడు!

అరగంటసేపు ఇలా లోపలి గదిలో రహస్యంగా తిట్టుకోడాలు- విమర్శలు- తర్జనభర్జనలు నానా భంగిమల్లో జరిగిపోతున్నట్టు ఏమాత్రం తెలియని- బయటి వరండాలో ఆమె___ రఘు నిరీక్షణలో-తన సహనాన్ని పరీక్షించుకుంటూ చూపులన్నీ గేటుమీదే నిల్పివుంచింది

చెట్టుమీద కాకులు___ ఒకటే గోల చేస్తున్నాయి! చెవులు అదిరిపోతున్నా___ భరించుకుంటోంది ఆమె!

మరొక పావుగంట దాటిపోయి రెండైంది! సెకన్లు నిముషాలు గడిచిపోతున్నాయి! రఘు వచ్చేజాడ లేదు. ఆమెలో ఓపిక క్షీణించిపోతోంది___ లోపలివాళ్ళు బయటకి వస్తున్నారు. ఓర ' ఆమెను చూసీచూడనట్టు గేటు తీసుకుని బయటికి వెళ్ళి మళ్ళీ వస్తున్నారు-

కొద్దిసేపటి తర్వాత ఆమె లేచి వరండాలో అటు ఇటు తిరుగుతూ తల తిప్పి చూసింది. ఎదురింటి కిటికీలో రెండు తలలు తొక్కినిక్కి చూస్తున్నాయి! చప్పున తలతిప్పుకొని పక్కకి నడిచింది. పక్కింటి అరుగుమీద ... ఆ ఇంటి ఇల్లాలు, ఆమె భర్త కళ్ళు పైకెత్తి చూస్తూ- కనిపించేరు- వెంటనే తల దించుకుని మళ్ళీ వచ్చి స్టూలుమీద కూర్చుంది ఆమె-

చెట్టుమీద___ టెలిగ్రాఫ్‌తీగల మీద కాకులసంఖ్య పెరిగిపోయింది!! అరుపులు

మరీ నిర్జనంగా, భయంకరంగా వుంది.

అప్పటికి సమయం రెండున్నర దాటింది.

ఆమెలో ధైర్యం- ఆశ సన్నగిల్లి పోయాయి. బహుశా రఘు ఈ రైలుకి రాడేమో అనుకుంది. పోనీ ఏ ఊరు వెళ్ళేదీ— ఏ పనిమీద వెళ్ళేదో అని అడుగుదామన్నా-ఇంటివాళ్ళెవరూ తనని లోపలికి పిలవటమే లేదు.

తనే తెగించి లోపలికి వెళ్తే?

అవును ఇంత దూరం వచ్చి బిడియ పడ్తే ఎలా?

అవుసరం తనది. అనుకుని చటుక్కున లేచింది. వివరాలన్నీ అడిగి- తనను గురించి చెప్పి ఒకసారి హైద్రాబాదుకి రఘుని రమ్మని చెప్పాలి- అనుకుంటూ గుమ్మంవైపు అడుగువేసింది—

సరిగ్గా అప్పుడే- మరో రెండు కొత్తముఖాలు తలుపుదగ్గర నిలబడి. తనవైపు చూస్తూ సైగలు చేసుకుంటు న్నాయి కళ్ళతో.

ఇంతవరకు బయటికీ-లోపలికీ తిరిగిన ముఖాల్లా లేవు అవి.

ఆమెకి ఎందుకో భయం వేసింది. వెంటనే వెనక్కి- తిరిగి చూసింది. ఎదు రింటి కిటికీల్లో- పక్కింటి అరుగుమీద అందరు తనవైపే చూస్తున్నారు.

ఒక్కసారి నిలువెల్లా సిగ్గుతో కుంచుకుపోయింది ఆమె. మనస్సంతా అవమానంతో నిండిపోయింది.

ఛీ. నేనెంత తొందరపడి వచ్చాను? కనీసం ఉత్తరం రాయాల్సింది. నా ఆవేదనలో ఆరాటంలో ఏదీ తోచలేదు.— ఇంకా రఘుకి ఏదో చెప్పాలనుకోటం- పొరపాటు- వెంటనే వెళ్ళిపోవాలి. నాల్గు గంటల రైల్లో వెళ్ళిపోవాలి. ప్లాటుఫారం మీదే కూర్చోవచ్చును— అనుకుని— 'ఏమండీ నేను వెళ్తున్నాను. బహుశా రఘుగారు ఇవాళ రారేమోలెండి.' అని లోపలికి వినిపించేలా గట్టిగా అనేసి చర చరా మెట్లుదిగి గేటు తీసుకుని బయట పడింది.

బిలబిలలాడుతూ చీమల్లా ఇంట్లో వాళ్ళంతా వరండాలోకి వచ్చారు — వీధిలో అల్లంత దూరంలో కొంగు నిండా కప్పుకుని గబగబా వెళ్తున్న ఆమెను చూసి— 'మంచి పనే జరిగింది. వాడు రాలేదు.' అని ఒకరంటే- 'అబ్బో. పెద్ద పతివ్రత వేషం చూడు!' అని మరొకరు- 'ఆ. ఎన్ని వేషాలు లేకపోతే ఇంత ధైర్యం చేస్తుందని' ఇంకొకరు—

'ఎలా వచ్చిందో అలా వెళ్ళింది.' అని మేనమామ నవ్వేడు- 'పోనీలే మీ అక్కయ్య అదృష్టవంతురాలు. గొడవ జరగకుండా ఆ పిల్ల తనదారిని తను పోయింది." అని పొంగిపోయిందొకావిడ.

అప్పుడే అందరు గమనించినట్టు- 'ఇదేమిటి? ఈ కాకులగోల విపరీతంగా వుందే.' అని విసుక్కున్నారు- వాళ్ళలో ఒకళ్ళు వెళ్ళి- వాటిని అదలించేరు



యు:





అయినా అవి మానలేదు అరుపు-చింకుగా ఎక్కడివాళ్ళు అక్కడి కెళ్ళిపోయారు.

ఓ గంటన్నర తర్వాత- రఘు బ్యాగ్ ఊపుకుంటూ వచ్చాడు.

'అదేమిట్రా! ఇప్పుడు ఏ రైలుందీ?' అని తెల్లబోతూ అడిగేడు మేనమామ.

'ఇప్పుడే రైలు లేదు. నేను రెండు గంటల రైల్లోనే వచ్చాను అన్నాడు రఘు- బ్యాగ్ బల్లమీద పెట్టి-

'మరి! లేశావెందా!'

'కాదు. స్టేషన్ దగ్గర మా ఫ్రెండ్ ఒకడు కనిపించి మాటల్లో పెట్టేసేడు— అలస్యమైంది. ఇంతలో.... సావిత్రి కనిపించింది— మళ్ళీ ఆమెతో స్టేషన్ కెళ్ళేను—'

'సావిత్రా? అదెవ్వర్రా?' అంది తల్లి.

మంచంమీద కూర్చుని బూటు లేసులు విప్పుకుంటూ—

'మనింటికి వచ్చి— నా కోసం చూసి— తిరిగి వెళ్ళిపోయి నావిడ!' అన్నాడు తాపీగా!

'ఆ!? అయితే అది నీకు కనిపించిం దన్నమాట?'

'ఆ! కనిపించేరు మామయ్యా! అది గిది అనకు! పరువు మర్యాదా గల కుటుంబంలో మనిషి! రాకరాక మన వూరు వస్తే— సమయానికి ఇంట్లో నేను లేను. వెనక్కి రమ్మంటే నానని, తనకి చాలా అర్జెంటు పనివుందని నాల్గుగంటల రైలుకే వెళ్ళిపోతాననన్నారు.కనీసం రైలు వచ్చేవరకు అక్కడే వుండి ఎక్కించి వచ్చాను— మీవాళ్ళు చాలా మంచివాళ్ళ అని చెప్పేరు— కాఫీ టిఫిను బాగా పెట్టేరు కాబోలు'— అన్నాడు నవ్వుతూ—

అంతా ముఖాలు చూసుకుని వెర్రి నవ్వు నవ్వి ఊరుకున్నారు. 'బామ్మా! ఎలా వున్నావు? మందు ఐపోయినట్టుంది తెస్తాలే సాయంత్రం! నేను వెళ్ళిన పని సక్సెస్ అయింది మామయ్యా! ఆఫీసర్ ఓ.కే. చేసేడు! త్వరగా ప్రమోషన్ రావచ్చును నాకు! ఇక పెళ్ళిప్రయత్నాలు మొదలెట్టండి!' అని బూట్లు మంచం కిందకి తోసి లేవబోయాడు—

'ఒరే రగ్గూ! ఇంతకీ ఆ సావిత్రి ఎవర్రా' అని చేయి పట్టుకుని ఆపింది బామ్మ.

'ఆవిడ మా ఆఫీసులో పనిచేసే వారు. ఇప్పుడూ అక్కడే వున్నారనుకో! పాపం! మంచి సంబంధం అని చెప్పి తల్లితండ్రులు పెళ్ళి చేసేరు. వాడూ మా ఆఫీసులో వాడే! కానీ వట్టి తిక్క— వెధవ! చచ్చే అనుమానం! డబ్బు కావాలి— కాని పెళ్ళాం మగాళ్ళ మధ్య కూర్చో కూడదు— మాట్లాడ కూడదు— ఎలాగ? ఉద్యోగంచేసే పీరు హద్దులు దాటకుండా పీలవుతుందా? పోనీ జాబు వదిలేస్తా నన్నారు, ఆవిడ! అబ్బే! వద్దన్నాడు— పైగా తాగివచ్చి నానా బాధ పెడ్తాడు— ఆవిడకి ఎంత వోర్పో? ఏదీ చెప్పరు— ఈ త్రాష్టుడే తాగిన మైకంలో వున్న ప్పుడు— తను చేసే ఘనకార్యాలన్నీ చెప్పేవాడు!

'ఇప్పుడు— వెధవ ఎవరో అమ్మాయిని పట్టేడు— బాగా డబ్బుందిట! అందుకని సావిత్రిని వదిలేయాలనుకుంటున్నాడు— పాపం ఆవిడ తల్లితండ్రులు ఈ మధ్యనే ఏక్సిడెంట్ లో పోయేరు— అందుకని కష్ట సుఖాలన్నీ మా కొలీగ్స్ కే చెప్పుకుం టుంది! నన్ను అన్నయ్యలా చూస్తుంది. 'డైవోర్స్ తీసుకోను నువ్వు వచ్చి

అయనతో చెప్పు' అని నాతో చెప్పడానికి ఈ ఊరు వచ్చేరుట! పోనీ వదిలేయ కూడదా వెధవని అని నేను చెప్తే- 'మా పాపకి తండ్రి కావాలి_ నాకు భర్త అక్కర్లేకపోయినా!' అన్నారు. అన్నట్టు వాళ్ళకి రెండేళ్ళ పాప వుందిలెండి!_ ఏమిటో పాపం_ చాలా మంచావిడ_ జాతకమే బాగులేదు_ సరే ఒకసారి హైద్రాబాదు వెళ్ళిరావాలి నేను_' అంటూ లేచి- 'మరి మామయ్యా నాకు ప్రమోషన్ ఖాయం! ఇన్నాళ్ళూ అందుకే పెళ్ళి వాయిదా వేసేను. ఇంక నా ఆలస్యం ఏం లేదు_' అనేసి సిగ్గుపడినట్టు నవ్వేడు రఘు

'శుభం! అలాగే. వెళ్ళి స్నానంచేయి!' అన్నాడు మామయ్య. రఘు బాతురూమ్‌లో స్నానం చేస్తున్నప్పుడు_ వాళ్ళంతా అనుకున్నారు__

'పాపం! ఆ ఇల్లాలు ఆ భర్తతో ఎలా పడుతోందో! సావిత్రి పేరుకు తగిన మనిషన్నమాట!'

'మరే! వెధవ మగాళ్ళ- అడవాళ్ళని కాల్చుకు తింటుంటే సావిత్రులు, అనసూయలు భరించక ఏంచేస్తారూ!' అన్నది చెల్లెలు అక్క భుజం తడుతూ__

'వెధవ మొగుణ్ణి తిరగబడికొట్టరాదూ! ఉద్యోగం చేస్తున్నావిడ కూడా ఇంత పిరికితనమా!' అనుకుంది రఘుచెల్లెలు.

'అయ్యో! అలాంటి పిల్ల ఈ ఇంటి కోడలైతే ఎంత అదృష్టమో' అని గొణిగింది బామ్మ__

రఘు స్నానంచేస్తూనే వున్నాడు!

వీధిలో కాకులు ఎప్పుడో ఎగిరి పోయాయి.

చెట్టుకింద చెత్తకుండీ పక్కనవున్న నల్లటి పదార్థాన్ని ఓ కుక్క లాగింది! అది నూనెగుడ్డ! చచ్చిన కాకి కాదు!



# అనుభూతి



కె. లలితాచలం

"'బాబూ!" అని ఓ కీచుగొంతు భయంకరంగా అరిచింది సాయం సంధ్య వేళ. చల్లగాలికి పిల్లల కేరింతలతో సముద్రపు ఒడ్డు కలకలలాడుతోంది. తల్లులు తండ్రులు, జంటలు, దుకాణాలు తినుబండారాలు, ఒకటేమిటి అతి కోలాహలంగా ఉన్న ఆ సముద్రపు ఒడ్డు.

సముద్రపు హోరును కూడా మింగేసి వచ్చిన 'బాబూ' అన్న ఆ అరుపుకు అందరూ అదిరిపోయారు.పిల్లలు తల్లుల్ని కరుచుకుపోయారు భయంతో.

ఏమిటా కేక? ఎక్కడ్నించి? ఏమైంది? ఆ కేక విన్నవారందరికీ అనేక ప్రశ్నలు పుట్టుకొచ్చాయి మరుక్షణం. అందరి చూపులు దిక్కులు వెతికాయి విషయం తెలుసుకోవాలని. కొందరి కాళ్ళు ఆ కేక వచ్చిన దిక్కుకు అడుగులు వేశాయి వెంటనే.

అప్పటికే అక్కడికి గుంపు చేరింది. వారిని తోసుకుంటూ కొన్ని తలలు తొంగి చూశాయి. అక్కడ వారికి కనిపించిన దృశ్యం హృదయ విదారకంగా ఉంది.

ఒక స్త్రీ స్పృహలేకుండా పడిఉంది. "బాబూ!బాబూ" గొణుగుతోంది. కాళ్ళూ చేతులు కొంకర్లుపోతున్నాయి. అక్కడ చేరినవారిలో ఎవరో ఇనుప తాళం చేతులు వాసన చూపిస్తున్నారు. అందరూ ఆమెని కళ్ళింతింతచేసుకుని చూస్తున్నారు.

ఆమె బట్టలు, నగలు, రూపం ఆమె ఒక గొప్పింటి స్త్రీ అని చెప్పకుండానే తెలుస్తోంది. వయసుకూడా నడివయసే. అయినా అందంగా ఉందామె. ఆమె చుట్టూ చిన్నపిల్లలాడుకునే బొమ్మలు, పాలబుడ్డి పడిఉన్నాయి. ఆమెకు కొంచెం దూరంలో ఒక తోపుడుబండి మాత్రం ఉంది. అది ఆమెకు సంబం

ధించింది అవునో కాదో తెలీదు. కానీ ఆమె త్వరగానే కళ్ళు తెరిచింది. తన చుట్టూ పడిఉన్న బొమ్మల్ని, పాలబుడ్డినీ చూసింది. అమాంతంగా వాటిని గబ గబా పోగుచేసుకుని అమాంతం తోపుడు బండి దగ్గరకెళ్ళింది, అందులో తడుము కుంటూ, ఏడుస్తూ

"బాబూ! నా బాబూ, నా బాబేడీ! నా బాబు నెవరో తీసుకుపోయారు" అంటూ పిచ్చిదాన్లా దాంట్లో ఉన్న బట్టలన్నిటినీ తీసి విసిరేసింది. అందరివంకా అనుమానంగా చూసింది ఓ క్షణం. మరుక్షణం అందర్నీ తోసుకుంటూ,

"బాబూ! బాబూ! నా బాబునెవరో ఎత్తుకుపోయారు. బాబూ! బాబూ!" అంటూ అరుస్తూ పరిగెట్టుకుపోయింది ఆమె వెతుక్కుంటూ. "ఆమె ఎవరో ఏమిటో!" అనుకున్నారు కొందరు.

"పాపం! ఆమె పిల్లాడ్నెవరో ఎత్తుకు పోయినట్లున్నారు. పోలీసు రిపోర్టిస్తే సరి." అనుకున్నారు కొందరు ఉచిత సలహా మాత్రం గాలిలోకి వదిలేస్తూ.

"పిచ్చిదేమో!" అనుకున్నారు మరి కొందరు, ఆమె చూపులు చూసి.

"పిల్లాడ్ని ఎత్తుకుపోతే ఆ తల్లి తట్టుకోలేక మూర్ఛపోయినట్లుంది.ఏదైనా మూర్ఛలరోగం ఉన్నప్పుడు ఒంటరిగా బయటికి రావడం ప్రమాదమే!" అని జాలిపడినవారు కూడా ఉన్నారు వచ్చిన గుంపులో.

"అసలు ఆమె ఎవరో! తెలీనివారు రోడ్డుమీద జరిగే విషయాలు మనకెందుకులే అని వెళ్ళిపోతూ . నోరూరుకోక అనుకుంటూ వెళ్ళిపోయారు

కొందరు మాత్రం ఆమెని పిచ్చిదిగా, మూర్ఛల రోగిగా అనుకోలేదు.

కారణం ఆమె అరగంట క్రితం హుందాగా నవ్వుతూ, తోపుడుబండిని తోసుకుంటూ, మెల్లగా నడుస్తూ మధ్య మధ్య బండిలోకి వంగి ముద్దెట్టుకుంటూ మురిసిపోతూ వీధిఒడ్డున నడవటం చాలా మంది చూశారు. బొమ్మలు కొనటం చూశారు.

ఆమెని జమీందారు రాజారామ్మోహన్ గారి భార్యగా గుర్తించారు. గౌరవ పూర్వకంగా నమస్కరించారు కూడాను.

కాని ఆశ్చర్యపోయారు కూడాను.

కారణం ఆమె ఎన్నడూ ఒంటరిగా రావడం ఎవరూ చూడలేదు. వెంట భర్తో, నౌకర్లో రావటం వారికి తెలుసు. కాని పిల్లల్నెప్పుడూ వెంటపెట్టుకురాగా చూడకపోయినా బొమ్మల్ని కొనడం చూశారు. వీధికొచ్చిన చిన్నచిన్న పిల్లల్ని ఎత్తుకు ముద్దాడటం, బొమ్మ లియ్యటం చూశారు. కాని ఈ రోజు ఆమె ఒంటరిగా పసిబిడ్డని బండిలో పడుకోబెట్టుకుని తోసుకురావటం వారికి అమితాశ్చర్యాన్ని కలిగించింది. కాని ఎవరూ దాన్నంతగా పట్టించుకోలేదు.

కాని ఆమె మూర్ఛిల్లి 'బాబూ! బాబూ!' అంటూ హృదయవిదారకంగా అరిచిన అరుపు, ఆమె బిడ్డకోసం కొన్న బొమ్మలు పాలబుడ్డి ఆమెచుట్టూ పడిఉన్న దృశ్యం, ఆమె బిడ్డకోసం తీసిన పరుగు - ఆ దృశ్యాల్ని చూసినవారి హృదయాన్ని పిండేసింది. ఎంత వద్దనుకున్నా పాపం! ఎవరో ఆమె! ఆమె బిడ్డ ఆమెకు దొరికితే బావుణ్ణు! అని పదేపదే అనుకున్నారు...

* * *

ఆ దృశ్యం చూసినవారి గుండెలు బరువై పేగులు కదిల్చే ఆమె ఆక్రందన మరవలేకపోవడం ఆశ్చర్యకరమైన విషయం కాదు.

కాని ఆ దృశ్యం చూడనివారి గుండెలు కూడా పిండేస్తోంది మాటి మాటికీ రేడియోలో వినిపించే ఒక స్త్రీ కంఠం. కార్యక్రమానికీ కార్యక్రమానికీ మధ్య వ్యాపార ప్రకటనలొచ్చినట్లు. దుఃఖంతో పూడుకుపోయిన ఓ స్త్రీ కంఠం గద్గదికమై చెపుతోంది.

"తల్లులారా! తండ్రులారా! చేయ్యెత్తి నమస్కరిస్తున్నాను. నా బాబుని ఎవరెత్తుకుపోయినా నా బాబునేం చెయ్యకండి. పట్టుమని పాతికరోజులు చూడని పసిగుడ్డు వాడు. తృప్తిగా నా చనుబాలు కూడా తాగని నెత్తురుగుడ్డు వాడు.

"నన్ను మీ తల్లిలా, చెల్లిలా, బిడ్డలా తలచి నామీద జాలిచూపమని అడగను. నా బిడ్డకు కడుపారా తల్లిపాలు తాగే అదృష్టాన్ని కలిగించండి, చాలు."

"తల్లులారా! పసిబిడ్డ లేని పచ్చిబాలెంత ఎంత బాధపడుతుందో తల్లులందరికీ తెలుసు. దయుంచండి. తల్లులారా! అన్నలారా! తమ్ములారా! నా బిడ్డని నాకు దూరం చెయ్యకండి. వాణ్ణేంచెయ్యకండి. మీకు దణ్ణం పెడతా బాబూ" హృదయాన్ని తొలిచేట్లు ప్రతిమలాడుతోంది ఆ స్త్రీ కంఠం.

ఆ ప్రకటన, ఆ స్త్రీ ఆక్రందన ప్రతి స్త్రీని కలచివేస్తోంది. కదిలించేస్తోంది. గగుర్పాటు కలగచేస్తోంది. తమ బిడ్డల్ని కూడా ఎవరైనా ఎత్తుకుపోతారో! అన్న భీతి కలుగుతోంది అందరికీ. తమ బిడ్డల్నెవరైనా ఎత్తుకుపోతే ఎలా విల విలలాడిపోతారో! ఊహించుకుని విల విలలాడిపోతున్నారు. స్త్రీజనంతో పాటు పురుషులు కూడాను భయకంపితులౌతున్నారు.

ఎవరి నోట విన్నా ఇదేమాట "ఇంత పిల్లల్నేకాకపసిపిల్లల్నెత్తుకెళుతున్నారుట కూడాను" అని.

"పాపం! అంత పసిగుడ్డుని తల్లి దగ్గర్నుంచి ఎలా ఎత్తుకెళ్ళారో!" అను మానం కొందరికి.

"వేటకొచ్చిన పులి పొంచిఉన్నట్లు దొంగలు పొంచే ఉంటారు. అదనుకోసం ఇవాళ రేపు పసిపిల్లల్ని చంపి గుండె కాయల్ని ఎగుమతి చేస్తున్నార్ట. మన దేశంలో జనాభా ఎక్కువ. పాపిష్ఠి

సంతానాలు ఎక్కువేనాయె. ఆ బిడ్డని ఈపాటికి చంపి గుండెకాయని విదేశాలకు పంపుంటారు".

అమ్మో! ఈ వార్త తెలిస్తే ఆ తల్లి బ్రతుకుందా! ఇదేమంత పెద్ద విషయం కాదన్నట్లు తేలిగ్గా అనుకుంటూనే జాలి నిర్లిప్తత ప్రకటించారు కొందరు.

"విదేశాలకే ఎగుమతి చెయ్యక్కర్లేదు. దుష్టశక్తుల్ని పూజించే మంత్రగాళ్ళు దేశంలో పెచ్చుపెరిగిపోయారుగా! కాది వాళ్ళ పనే అయివుండొచ్చు. అయినా అమావాస్య అర్ధరాత్రిగానీ వాళ్ళు బలులు ఇయ్యర్ధ. అమావాస్యరెండురోజులుందిగా. ఆ పాపిష్టిముండావాణ్ణి పట్టుకోగలిగితే బిడ్డ ప్రాణాలతో దొరుకుతుంది" తరుణోపాయం తలుచుకునిత్ప్తిపడ్డారుకొందరు.

"పసివాడ్ని గుర్తుపట్టడమెలా! నెల లోపు పిల్లలంతా ఒకేతీరునుంటారు తెలుపు నలుపు తేడా తప్ప" మార్గం తెలియక విలవిలలాడారు అమాయకులు.

"జంతు క్రిమికీటకాదులకు మనిషి శత్రువైతే, మనిషే మనిషికి శత్రువై పోయాడు. విదేశస్థులకి బిడ్డల్నమ్మి డబ్బు చేసుకుంటున్నార్ధ. అలా జరిగితే పాపం తల్లికి బిడ్డ దూరమౌతదన్న బాధ. బిడ్డకు తల్లి కరువౌతున్నదన్న వేదన తప్ప చావుబాధ లేదు. పాపం ఆ తల్లి కడుపుశోకంతో ఎంతతల్లడిల్లిపోతోందో. బిడ్డ చచ్చిపోయాడంటే గుండె బండ చేసుకుని బ్రతకొచ్చు. కాని కుండల్లా నిండి బండలా బరువయే పాలకుండల బరువుబాధ స్త్రీకి మాత్రమే తెలుసు" తల్లులు తల్లడిల్లారు.

"బిడ్డ చన్నుకుడిస్తే మైమరపు, పాలు నిండితే పులకింత, పాలుతాగే బిడ్డను చూస్తుంటే కలిగే మమతానుభవం స్త్రీ జాతికే ఒక అందమైన అనుభవం. అదో అమరానుభూతి పాపం! ఆ తల్లి పిల్లవాడ్ని గురించి ఎన్ని కలలుకన్నదో! భగవంతుడు ఆ అనుభవానికి దూరంచేశాడు" వేదాంతం, విమర్శ. ఎన్ని ఎందరు అనుకున్నా ఆ తల్లిమీద అందరికీ జాలి ఎవర్నీ నిలవనివ్వటంలేదు.

"పసివాడి కళ్ళో కాళ్ళో తీసేసి ముష్టివాణ్ణి చెయ్యటానికి ఎత్తుకెళ్ళారని కొందరి అనుమానం.

ఆమె బిడ్డను ఆమెకు చేర్చాలని అందరి యత్నం.

కాని ఆమె ఎడ్రస్ ఇవ్వలేదు. రేడియో స్టేషన్లోగాని, టి.వి. స్టేషన్లోగాని, పోలీసు కంట్రోల్రూమ్కుగాని నిర్ణీత సమయాల్లో తెలియబరచమని అన్ని పేపర్లలోనూ ప్రకటించారు.

ఇన్ని రకాలుగా ఆ పసిబిడ్డకోసం ప్రకటిస్తున్నారంటే, ఆ స్త్రీ డబ్బుగలదై ఉండొచ్చనుకున్నారు కొందరు. ప్రభుత్వం, పోలీసులు, ఆస్పత్రులూ ఉచిత సేవచేస్తున్నట్లు రేడియో, టి.వి., పేపర్లు ఉచిత సహాయం చేసుంటారని కొందరు.

బహుమతి ప్రకటించకపోవటం కూడా వారికి ఆశ్చర్యకరమే అయింది.

కాని బీచిఒడ్డున ఆ దృశ్యం చూసిన వారు మాత్రం ఏ మాత్రం అనుమాన పడలేదు.

తాము బిడ్డను తీసుకెడితే మంచి బహుమతి లభిస్తుందని ధైర్యపడ్డారు.

అందరి కళ్ళూ పసిబిడ్డల్నే చూస్తు న్నాయి. మానవత్వమున్న మనుషుల్లా అందరిదీ ఒక్కటే ధ్యేయం. బిడ్డను తల్లిదగ్గరకు చేర్చాలి. ఆ తల్లిని చూడాలి.

* * *

ప్రకటన వచ్చిన కొన్ని గంటలకే నిర్ణీత సమయాల్లో రేడియో, టి.వి. పోలీసుస్టేషన్ల దగ్గర పసిపిల్లల్నెత్తుకుని క్యూ వరసలు వరసలుగా నిలిచారు.

కాని ప్రతి బిడ్డని లోపలికి తీసుకెళ్ళి, "ఈ బిడ్డకాదు. ఈ బిడ్డ కాదని" తిరిగి ఇచ్చేస్తుంటే నిరుత్సాహపడిపోయా రంతా. తాముపడ్డ కష్టం వృధా అయి నందుకు విసుగుచెందారు కొందరు.

కొందరు ఇదేదో రాజకీయ కుట్రను కున్నారు. ఏదైనా సినిమా ప్రకటన ప్రచారమై ఉండొచ్చనుకున్నారు.

నీలివార్త అనుకుని తమ పిచ్చికి తామే సిగ్గుపడ్డారు. నవ్వుకున్నారు.

కాని పోలీసుశాఖవారు తలలు వంచుకుంటున్నారు. ఇంతమంది ప్రజల సహకారమున్నా, రవికాననిచోట కూడా కనుగొనగలమని ప్రజ్ఞలు పలికే తమ శాఖ ఒక పసిగుడ్డు ఆచూకీ కనుక్కో లేక తికమకపడిపోతున్నారు.

పుండుమీద కారంలా పోలీసువారికో ఫోను అర్జంటుగా రమ్మని.

అదే ఫోను డా॥ ద్వారకీదేవికి కూడా వచ్చింది అర్జంటుగా రమ్మని. పోలీసు జీపు, డాక్టరు కారు రెండూ ఒకేసారి వచ్చి ఆ ఇంటిముందు ఆగాయి. పోలీసుల్ని చూసి ఓ క్షణం బిత్తర పోయిందామె ఆ ఇంట్లో ఎవరి ముఖానా నెత్తురుచుక్క లేదు. అందరి ముఖాల్లో భయం, ఆందోళన తాండవిస్తున్నాయి. జమీం దారు రాజారామ్మోహన్ ఎదురొచ్చారు వారికి ఆయన ముఖం వాడిపోయింది. ఆయన భార్య కుముదినికి విపరీతంగా మూర్ఛవచ్చినప్పుడల్లా అమె చావు బ్రతుకులమధ్య కొట్టుమిట్టాడటం ఆయన ఆందోళనచెంది అలా అయి పోవటం డా॥ ద్వారకీదేవికి మామూలే.

పోలీసుల్ని, ద్వారకినీ లోపలికి రమ్మని సంజ్ఞచేసి మౌనంగా లోనికినడిచారాయన.

ద్వారకీదేవికి పోలీసులకు అసలు విషయం అర్థంకాక ఆయన్ని అనుస రించారు. ప్రశ్నించకుండా. లోన ప్రవేశించగానే కుముదిని నవ్వులు, పిల్లల కేరింతలు ఆటబొమ్మలు ఏవీ ఇంట్లో కనిపించకపోయేసరికి డాక్టరుగా కాక కుముదిని స్నేహితురాలిగా ఆందో ళన చెందింది ద్వారకీదేవి కుముదిని

ఏదీ? ఏమైంది? అనడిగింది, ఏదో కీడు శంకిస్తూ. భయంకర నిశ్శబ్దం రాజ్యం చేస్తున్న ఆ సమయంలో రాబందు అరుపులా ఉంది ఆమె అడిగిన తీరు.

"నేను నాలుగు రోజులుగా ఊళ్ళో లేను. ఇవాళే వచ్చాను రెండురోజులుగా కుముదిని ఆ గదిలోంచి బయటకు రావటంలేదుట. పిలిస్తే పలకటంలేదు. తలుపు తియ్యటంలేదు. అసలు బ్రతికుందో లేదో! ఏది ఏమైనా చావుబ్రతుకుల నిర్ధారణకు డాక్టరు, చట్టబద్ధమైన సాక్ష్యానికి పోలీసులు అవసరమనిపించి ఫోను చేశాను" అంటూ పూరించిన బుగ్గలు బిగించి దుఃఖాన్ని ఆపుకుంటూ ఎటో చూశారాయన.

పరిస్థితి కొంత అర్థమై అయ్యన్ని నిబ్బరించుకోమని ధైర్యం చెప్పి మెల్లగా గదితలుపు దగ్గిరకెళ్ళి,

"కుముదినీ! తలుపు తియ్యి" అని పిలిచింది డా॥ ద్వారకి. సమాధానంలేదు. చడీచప్పుడులేదు. తలుపు తెరుచుకోలేదు. తలుపుమీద గట్టిగా కొడుతూ పిలిచిందామె. దానికీ సమాధానం రాలేదు.

మామూలుగా అయితే ద్వారకీదేవి గొంతు అల్లంత దూరాన వింటేనే పసిపిల్లలా కిలకిలా నవ్వుతూ పరిగెట్టుకొచ్చి కౌగలించుకుంటుంది కుముదిని.

డా॥ ద్వారకీదేవి ఆమె చిన్ననాటి స్నేహితురాలు. అందుకే ఆమంటే కుముదినికి ఇష్టం.

ఆమంటే కుముదినికి చాలా గౌరవం. ఆమె హిత ధైర్యవచనాలు కుముదిని మనసుకు ఆ మాటలపేటలు ఊరట. ద్వారకీదేవంటే భయం కూడా ఉంది. మారాంచేసి మంకుపట్టి మందు వేసుకోకుంటే, మత్తుమందిచ్చి నిద్రపుచ్చేస్తుంది. అప్పుడు కుముదిని పిల్లలదగ్గిర కెళ్ళలేదు. పిల్లలు తన దగ్గిరకు రాలేరు. పిల్లల్ని చూడకుండా కుముదిని ఉండలేదు. అందుకే ద్వారకి చెప్పినట్లు చేస్తుంది కుముదిని

ద్వారకీదేవికి ఈ మధ్య కుముదిని అతి దగ్గరైంది. మాటిమాటికీ భయంకరంగా ఫిట్సురావడం ఫోనుమీద తను పరిగెత్తుకొచ్చి తగ్గిందాకా ఉండివెళ్ళడం వారిద్దర్నీ గట్టిగా బంధించింది.

కుముదిని త్వరలో అందరిలా ఆరోగ్యంగా ఉండి ఆయుష్షు కలది కావాలని మనస్ఫూర్తిగా దేవుని ప్రార్థించేది.

అటువంటి ఆత్మీయురాలి దగ్గరనుండి ఏ సమాధానం లేక ఆమెలో భయం, ఒణుకు పుట్టుకొచ్చాయి.

నిస్సహాయంగా అందరివంకా చూసింది ద్వారకీదేవి.

తలుపులు బలవంతాన తెరిచారు.

చిమ్మచీకటి నిండిన గదిలో తెరచిన తలుపులు వెలుగు నింపాయి.

దడదడలాడే గుండెలు గట్టిగా ఉగ్గపట్టుకుని అందరూ లోన అడుగు పెట్టారు

ఎలాంటి దృశ్యం చూడాల్సొస్తుందో! అని గుమ్మందగ్గిరే ఆగారంతా.

మంచంమీద కుముదిని వెనక్కి తిరిగి కూచుని కనిపించింది. అందరికీ ఊపిరొచ్చింది ఆమె బ్రతికున్నందుకు. కాని ఆమె వీరి రాకను గమనించినట్లు లేదు. తలైనా తిప్పి చూడలేదు. ఏదో పరవశంతో ఏదో ఆనందానుభూతిని పొందుతోందామె.

తమ రాకను ఆమె గమనించాలని శబ్దాలు చేసింది ద్వారకీదేవి.

దానికీ చలించలేదామె. కాని చిన్నగా బాధతో, "అబ్బా!" అని మాత్రం అంది.

ద్వారకీదేవి మరి ఆ శబ్దం విన్నాక ఆగలేదు అమాంతం ఆమె ముందుకెళ్ళి "కుముదినీ! ఇటు చూడు ఎవరొచ్చారో!" అంది, మెల్లగా తానొక్కతే మంచం దగ్గిరగా వెళ్ళి.

"ఉష్" అని శబ్దం చెయ్యవద్దంది కుముదిని నోటితోనే. అక్కడి దృశ్యం ద్వారకిని విభ్రాంతురాల్ని చేసింది. మరి నోట మాటరాలేదు. దుఃఖం పొల్లు కొచ్చింది ద్వారకీదేవికి. పట్టరాని దుఃఖంతో.

"కుముదినీ! ఆపు కుముదినీ! అలా చెయ్యకు" అని అరిచింది. కాని కుముదినికి ద్వారకీదేవి మాటలేం వినిపించటంలేదు.

కాని ద్వారకీదేవి మాటలకు రామ్మోహన్‌గారు లోనికిపరిగెట్టుకొచ్చారు ఏమైందో! ఏమిటో! అని.

ద్వారకీదేవిని కలచివేసిన దృశ్యం రామ్మోహన్‌గారిని నిలవనివ్వలేదు. చూడలేకపోతున్నారాయన ఆ దృశ్యం.

కుముదిని స్తనాలు వాచి రక్తపుముద్దల్లా రక్తాన్ని చిముతున్నాయి. వాటిని తన రెండు చేతుల్తో పిండుకుంటోంది. క్షీరధార నివ్వాల్సిన స్తనాలు రుధిరాన్ని కుమ్మరిస్తు న్నాయి. వాటి బాధ ఓర్చుకోవాలనే విశ్వ ప్రయత్నంచేసి ఓడిపోయి, బాధతో మూలుగుతోంది కుముదిని. అయినా తన ప్రయత్నం విడవకుండా పిండుకుంటోంది ఏ అనుభూతికోసమో!

అందరి కళ్ళూ అప్రయత్నంగా ఆమె ఒడిలోకి వాలాయి. ఆమె రుధిరభాండాలు తన ఒడిలోని బిడ్డ నోట్లో కుక్కుతూ బాధామయసంతో సానుభూతిని పొందటానికి ప్రయత్నిస్తోంది.

ద్వారకీదేవి రామ్మోహన్‌గార్లు ఆ బిడ్డను చూసి విస్తుపోయారు. ఇద్దరి మనసుల్లో ఒకటే ప్రశ్న.

ఎవరీ బిడ్డ? ఎక్కడ్నించొచ్చింది?

ఆ చోట్లో తమకేం పనిలేదనిపించి పోలీసు ఇన్‌స్పెక్టర్ కలవడిగాడు రామ్మోహన్‌గార్ని.

కాని ఇనస్పెక్టర్ కోరినట్లుగా కలవు దొరకలేదు సరికదా, మరో బాధ్యత నెత్తినొచ్చిపడింది.

"ఎంతోమంది చనిపోయిన బిడ్డల్ని కని మానసికంగా చితికిపోయిన తన భార్య తల్లి ప్రేమను పొందాలన్న

తపనతో పిల్లల్ని ఎత్తుకొస్తోంది. కాని అంతవరకూ ఎవరి పిల్లల్ని వారికి అప్పచెప్పటం జరిగింది. కాని నేను ఊళ్ళోలేని సమయంలో ఎక్కడినుంచో ఒక పసిబిడ్డను తెచ్చించి. ఆమెను క్షమించి ఈ బిడ్డను వారి తల్లితండ్రులకు అప్పజెప్పే బాధ్యత మీ కప్పగిస్తున్నాను. ఉధృతంగా ప్రకటనలివ్వండి. దానికయ్యే ఖర్చు కూడా ఇస్తాను" అన్నారాయన ప్రాధేయపడుతున్నట్లుగా.

ఇప్పటికే బిడ్డను పోగొట్టుకున్న ఒక తల్లికోసం నానా తిప్పలూ పడుతున్నారు పోలీసులు ఆ బిడ్డని వెతకలేక. మళ్ళీ మరో కేసా!తల్లిని వెతికే కేసు! అనుకుని కొంచెం తటాపటాయించి కంట్రోల్ రూముకి ఫోనుచేశాడు ఇనస్పెక్టరు.

ఏం మాట్లాడాడో ఏమో! పది నిమిషాల్లో పోలీసు వానొచ్చింది. దాంట్లోంచి ఒక స్త్రీని మెల్లగా దింపి లోనికి తెచ్చారు.

ఆమె ముఖం వాడిపోయి జుట్టు రేగిపోయి నీరసంతో ఊగిపోతోంది. లోతుకుపోయిన ఆమె కళ్ళు దేనికోసమో వెతుకుతున్నాయి. ఆరిపోయిన పెదవులు తడుపుకుంటూ, "ఏదీ! నా బాబేదీ! అనడిగింది పోలీసుల్ని. ఆమె కళ్ళలో ఆశ, మాటల్లో నిరాశ, నిస్పృహ, నిస్సహాయత నిండిఉన్నాయి.

"ఈమె రెండురోజుల క్రితం బీచి ఒడ్డున తన బిడ్డను పోగొట్టుకుందిట. ఎవరో ఎత్తుకుపోయార్ట. రేడియోలో ప్రకటన మీరు వినే ఉంటారు. ఈ బిడ్డ ఆమె బిడ్డేమో చూస్తుందని పిలిపించాను" ఆమె రాకకు కారణం అడక్కుండానే చెప్పాడు ఇనస్పెక్టర్.

"నీ బిడ్డని నువ్వు గుర్తుపట్టగలవా!" అనడిగింది ద్వారకి ముందుగా ఆమెని లోపలికి తీసుకెళ్ళడం ఇష్టంలేక.

"పట్టగలనమ్మా! ముఖంమీద కుట్లు వేశారు కాను పైనప్పుడుక త్తెరతగిలిందని" అంది ఆమె.

"అసలు నీ బిడ్డ ఎలా పోయింది!" కుముదిని దగ్గరకు బిడ్డ ఎలా వచ్చిందో తెలుసుకోవచ్చని అడిగింది ద్వారకీదేవి.

"ఏం చెప్పనమ్మా! బీచి ఒడ్డున బొమ్మలమ్ముకుని బ్రతికేవాళ్ళం పిల్లల్ని వెంటేసుకునే వెడతాం. రోజూ అలాగే వెళ్ళాం. బేరం పెద్దగా లేదు. ఓ గొప్పింటి అమ్మ తోపుడుబండిలో బిడ్డనెట్టుకొచ్చి బోల్డు బొమ్మలుకొంది. ఆమె బిడ్డనట్లా బండిలో తోసుకెళ్తుంటే ముచ్చటేసి ఆమె వెడుతున్న వేపే మైమరచి చూస్తూనుంచున్నా. నా బిడ్డని కూడా అలాబండిలో పడుకోబెడితే ఎట్లా ఉంటుందో ఊహించుకుంటూ నుంచున్నా.

"అంతలో ఓ తల్లి ఏడుస్తూ వచ్చింది. తన బిడ్డనెవరో ఎత్తుకుపోయారంటూను. ఆ తల్లి వెళ్ళిన కొద్దిసేపటికే పెద్ద కేక వినిపించింది, 'బాబూ' అంటూ. మేమంతా అక్కడికి పరిగెట్టాం. ఎంతైనా అది అడకూతురు కేక కదాని. మే మెళ్ళే సరికి ఆమె అక్కడలేదు. ఆమె బిడ్డని

ఎవరో ఎత్తుకుపోయారని ఏడ్చుకుంటూ వెళ్ళిపోయిందట మూర్ఛతేలి. ఆక్కడ బండి చూసి గుర్తుపట్టానమ్మా నేను. ఆ బిడ్డని పోగొట్టుకున్న తల్లి ఎవరో కాదు నా దగ్గిర బొమ్మలు కొన్నత ల్లేనని. అంతే నా గుండె గుభేలుమంది. పిల్లల్ని ఎత్తుకెళ్ళేవాళ్ళెవరో వచ్చారని, వెంటనే బండిదగ్గిరకెళ్ళి కిందకొంగి బిడ్డకోసం చూసుకున్నా. బిడ్డ లేడు.

"నా బిడ్డని కూడా ఏ పాపిష్టోళ్ళో ఎత్తుకుపోయారు. వాళ్ళింట్లో పీనిగెళ్ళ! పాలుతాగే బిడ్డ ఏమైపోయాడో! ఏం చేశారో" నోట్లో గుడ్డకుక్కుకుని ఏడ్చింది ఆ దీనురాలు.

కుముదిని చేతులో బిడ్డ ఈమెదే అనిపించి వెళ్ళి చూసింది ద్వారకీదేవి. ఆ బిడ్డ ముఖాన కత్తిగాటు కుట్టు కనిపించింది.

"కుముదినీ! ఆ పాప తల్లొచ్చింది ఇవ్వు బిడ్డని" అంది కొంచెం కర్కశంగా ఆజ్ఞాపిస్తున్నట్లు.

కుముదిని ఆ మాట వినగానే బిడ్డని గుండెల కదుముకుని "ఇవ్వను. ఈ బిడ్డ నాది. నాక్కావాలి. నేను పాలు తాగించు కుంటా! కావాలంటే నా దబ్బంతా ఇస్తా తీసుకుపొమ్మను ద్వారకీ" అంటూ విలవిలా ఏడ్చింది.

"మీకు డబ్బుందొమ్మ. నాకు దరిద్ర ముండి డబ్బుకు ఆశ కక్కుర్తిపడొమ్మ తల్లీ! కాని నా బిడ్డక్కావలసిందిచనుపాలు. అవి పీ దగ్గిర్లేవు నా దగ్గిరున్నాయి. నా బిడ్డనిప్పించండి బాబూ! మీకు దణ్ణం పెడతా!" అంటూ ప్రాధేయపడింది ఆ దీనురాలు బరువౌతున్న స్తనాలు ఒత్తు కుంటూ. కుముదిని స్థితికంటే, దొంగి లించటం, తల్లి వొచ్చి ప్రాధేయపడు తున్నా ఇవ్వనంటున్న కుముదినంటే కోపం, అందరి ఎదుట అవమానం భరించలేకపోయారు రామ్మోహన్‌గారు. కుముదిని చేతులో బిడ్డను అమాంతం తీసుకున్నారు బలవంతంగా. "బాబు. నాకుబాబుకావాలి ఇవిగో పాలొస్తున్నాయి" అంటూ ఆ హఠాత్‌సంఘటన తాకిడికి కుముదిని తట్టుకోలేక ఎగిరెగిరి ఏడుస్తూ పడిపోయింది. పడిపోతున్న కుముదినిని పట్టుకున్న ద్వారకి ముఖం వెలవెల బోయింది. చల్లగా ఆమె ఒళ్ళు తగలగానే "కుముదినీ!" అంటూ భోరునేడ్చింది. క్షణాలలో వాతావరణం రంగులు మారింది ఆ యింట్లో.

రామ్మోహన్‌గారు మరి ఆ చోట నిలవలేక చేతులో బిడ్డని తీసుకుని బయటకు వచ్చారు.

బిడ్డని గుర్తుపట్టిన ఆ తల్లి ఒళ్ళు పులకరించింది. సంతోషంతో స్తనాలు ఎగిసిపడ్డాయి. ఎండిన కళ్ళు ఆనందంతో నిండిపోయాయి. "బాబూ!" అంటూ చేతులుచాచి బిడ్డనందుకుని హృదయానికి హత్తుకుంది. పొంగుతో బరువైన ఆమె క్షీరఘటాలు పొంగిపొర్లి కిందకు జారాయి పాలు.

"నన్ను క్షమించమ్మా! తల్లిగా స్తనమిచ్చి తన్మయత పొందాలని ఆశించి దానికి కరువై జరిగిన అఘాయిత్యం తల్లీ ఇది. ఇంక కుముదిని ఎవరి బిడ్డల్నీ ఎత్తుకుపోదు. తానే పసిబిడ్డగా మారి చనుబాలు తాగి తరించాలని ఎక్కడికో వెళ్ళిపోయింది. నీ బిడ్డని తీసుకెళ్ళమ్మా"





నిండిపోయిన దుఃఖంతో నమస్కరిస్తున్న రామ్మోహన్‌గారిని చూస్తుంటే బిడ్డ దొరికిందన్న సంతోషం మరచి దుఃఖం పొంగింది ఆమెకు. ఆ నిండిన కన్నీటితో బిడ్డని చూసుకుంది. పెదవులు తాకిన చనుబాలు చప్పరించటానికి ఆ బిడ్డలో ఊపిరి ఎప్పుడో ఎగిరిపోయింది! కుముదినే వాడివెంట వెళ్ళిందో ఏమో రెండు రోజులుగా పాలులేని పాపవెంటపడి. పోయినబిడ్డ దొరికినందుకు ఆనందిం చాలో దొరికినబిడ్డ పోయినందుకుఏడ్వాలో తెలియని దుస్థితి ఆమెది. కొన్నిక్షణాలు చలనండుడిగి తననుతానుఓదార్చుకుంటూ-

"బాబూ! ఆ యమ్మ నాకే బిడ్డై పుడుతుంది" అంటూ వెళ్ళిపోయింది ఆపుకోలేని దుఃఖంతో. ఆమె వెళ్ళిన దారంట చనుబాలు రాలాయి.

——



# మానవతా! చిరంజీవ!

శ్రీకంఠస్ఫూర్తి

పల్లిపేట జంక్షనులో సరిగ్గా పదకొండు గంటలకు బస్సు దిగాడు మూర్తి. అలసిపోయిన శరీరం.... అంతకుమించిన చికాకు– తొందర నిండిన మనసుతో సూట్‌కేస్ చేత్తో పట్టుకుని చుట్టూ చూశాడు. ఎక్కడా జనం అలికిడిలేదు. చీకటి స్వేచ్ఛగా రాజ్యమేలుతోంది. ఎంత తొందరగా గమ్యం చేరదామని ప్రయత్నించినా– అంచెలు అంచెలుగా జరిగిన ప్రయాణం అంతా ఆలస్యంగానే జరిగింది. మూర్తి అసహనంగా ముందుకు కదిలాడు. అల్లంత దూరంలో గుడిసె లాంటి ఆకారం కనిపించింది. ఆ గుడిసెలో ఏదో గుడ్డిదీపం వెలుగుతూంది. మూర్తి గుడిసెదగ్గరగా సమీపించాడు. అది గుడిసె కాదు. రాటలతో నిలబెట్టిన పాక– విశాలంగానే ఉంది. పాక ముందు భాగంలో మెట్లుమెట్లుగా నిలబెట్టిన చిన్న బల్లలమీద వరుసగా సీసాలు.... ఆ సీసాల్లో ఏవో తినుబండారాలు, జంతికలు– పిప్పరమెంటు బిళ్ళలు– ప్రక్కనే గోళీ షోడాలు....సిగరెట్ పేకెట్లు....మిగల ముగ్గిపోయి ఈగలు ముసురుతూన్న అరటిపళ్ళ గెల....

తను సంవత్సరం క్రితం పల్లిపేటకు వచ్చినపుడు ఈ జంక్షను అంతా అడివిలా ఉండేది. చాలావరకు చెట్లే ఉండేవి. అవన్నీ పోయి ఈ పాక, కొట్టూ ఈ మధ్యనే వెలిసినట్టున్నాయి....

"ఏయ్! ఎవరు లోపల?" మూర్తి పిలుపుతో పాక లోపల్నుంచి ఒక స్త్రీ అదురుపాటుతో బయటకొచ్చి, రవికలేని భుజాల్ని కొంగుతో కప్పుకుని "ఎవురు బాబూ! ఏటిఁకావాలి?" అంటూ అడిగింది.

"పల్లిపేట పోవడానికి కిప్పుడేవైనా దొరుకుతాయా?" నలభై ఏళ్ళకు పైగా

వయస్సున్న ఆ స్త్రీముఖంలోకి ఆత్రంగా చూస్తూ అడిగాడు మూర్తి.

"నేనా రాత్రయినాది బాబూ! రిక్షాలు, గుర్రబ్బళ్ళు ఇళ్ళకెళ్ళిపోనాయి. తెల్లారి ఎలుగొత్తే కాని వూళ్ళో కెళ్ళడం కష్టవండి." ఆమె అచ్చితంగా చెప్పేసి వెనక్కి తిరిగి ఏవో సర్దుకుంటూంది. మూర్తికి ముందే తెలుసు. ఈ వేళప్పుడు వూళ్ళోకి వెళ్ళడానికి మరే వాహనం దొరకదని. అయినా యూధాలాపంగా అడిగాడు. ఏమైనా ఊళ్ళోకి వెళ్ళిపోవాలి. తప్పదు.... చీకట్లో... పరుగుకోనయినా పల్లిపేట ఒళ్ళోవాలాలి ఎంత కష్టమయినా సరే! మూర్తి ఆమెను మళ్ళీ పిలిచి షోడా ఒకటి కొట్టించుకుని త్రాగాడు. చిల్లర పైసలు ఆమె చేతిలో పెట్టి- చీకటి రోడ్డు వైపు చూస్తూ-సూట్ కేస్ అందుకున్నాడు.

"ఎవురదీ?" పాక లోపల్నుంచి ఎవరిదో మగగొంతుమగతగా వినబడింది.

"ఆఁ ఎవురో పట్నంబాబు! పల్లిపేట కెళ్ళాలంట! అర్ధరాత్రికాడ బళ్ళు దొరుకు తయ్యాఁటన్నడు!" ఆమె జవాబు చెప్పింది.

"ఉండవే!" దుప్పటి కప్పుకుని ఒక్క ఉదుటన పాక లోపల్నుంచి బయటకొచ్చిందా ఆకారం. అడుగు ముందుకేస్తున్న మూర్తి ఠక్కున ఆగి పోయాడు.

"బావూ! నాకాడ రిక్షా ఉన్నాది. తమరి కిష్టవయితే కదతాను. పల్లిపేటకు పది రూపాయలవుద్దండి"-ఆ వ్యక్తి దుబ్బలా లావుగానే ఉన్నాడు. దుప్పటి బిగించి కప్పుకున్నాడు. ముఖంలో ముక్కు ముందుకు పొడుచుకొచ్చినట్లుగా ఉంది. వయసు యాభై పైనే ఉండొచ్చు. కళ్ళు లోతుగా ఉన్నాయి. గెడ్డం పెరిగి జీబురుగా ఉన్నాడు.

"సరే! రా! అయితే- రిక్షా తొందరగా తీసుకురా!" మూర్తికి ఉన్నచోటు నుండి ఎగిరి పల్లిపేటలో వాలిపోదాం అన్నంత ఆత్రంగా ఉంది.

"నీకు బుద్ధి నేదా! ఈ యేలప్పుడు బేరం కెల్తన్నావు? సందకాడ్నుంచి ఒల్లెచ్చగుందని ఒకటే మూల్గుతున్నవు మరిసిపోనావా!"

"ఒల్లెచ్చగుంటే ఏటవుద్దే! పదండి బావూ! మా ఆడదట్టగే నసుగుద్ది" జీబురుగడ్డం మనిషి పాకపక్క పంచలోంచి రిక్షాను లాగి సీటు దులిపాడు. అగ్గిపుల్ల గీసి రిక్షాకున్న కిరోసిన్ లైటు వెలిగించాడు. అదే అగ్గిపుల్లతో సగం కాల్చిన చుట్ట నంటించుకుని సంతృప్తిగా రెండు దమ్ములు పీల్చాడు. 'ఎక్కండి బావూ' అంటూ హేండిలు పట్టుకన్నాడు. మూర్తి సందేహించకుండా సూట్ కేస్ రిక్షాలో పెట్టి కూర్చున్నాడు. పాకలో ఆడమనిషి ఇంకా ఏదో గొణుగుతూనే ఉంది. రిక్షా ముందుకు కదలటంతో ఆమె గొంతు పెంచి తిట్లలోకి దిగింది. ఆమె తిట్లు

వింటూ రిక్షాని లాగుతూన్న జీబురు గెడ్డం కిసుక్కున నవ్వింది....

"అదంతే బావూ! ఒక్తి పిరికిగొడ్డు... ఈ వొయసులో కూడా నన్నిడిసిపెట్టి వొక్క చనం వుండనేదంటే నమ్మండి."

మూర్తి అతని మాటలు విని ఆనందించే స్థితిలో లేడు.... ఒళ్ళంతా నజ్జునజ్జుగానూ నానా చికాగ్గానూ ఉంది...

"నీ పేరేంటి?" మూర్తి సిగరెట్ వెలిగిస్తూ అడిగాడతణ్ణి.

"నారాయణండి.... తెలిసేటోళ్ళందరూ నారీ అని పిలుత్తారండి!"

"చూడు నారాయణా! చాలా త్వరగా వెళ్ళాలి పల్లిపేట! సాధ్యమైనంత త్వరగా తీసుకువెళ్ళగలిగావా- మరో అయిదురూపాయలు ఎక్కువిస్తాను." మూర్తి తన అవసరంకొద్దీ అయిదు రూపాయలు ఆశ పెట్టాడు.

"అట్టాగే బావూ! తమరు నిదానంగా కూకుండండి!" అయిదు రూపాయల ఆశతో తన బలాన్నంతా ఉపయోగించి రిక్షాను ముందుకు లాగుతున్నాడు నారాయణ....

చల్లటి గాలి రివ్వున వీస్తోంది. కంకరరోడ్డు. రోడ్డుమధ్య గతుకుల్లోంచి రిక్షా పడుతూ లేస్తూ ముందుకు పరుగెడుతూంది. రోడ్డు కిరువైపులా నిలువెత్తు తాటిచెట్లు.... మామిడి, జీడి మామిడి తోటలు.... తోటల్లోంచి- కీచురాళ్ళు గోలపెడుతున్నాయి. ఉండుండి ఏవో పిట్టలు వింతగా అరుస్తున్నాయి. ఒకప్రక్క పొలాల్లో మిణుగుపురుగులు గుంపులుగుంపులుగా కలయతిరుగుతున్నాయి. మూర్తి రిక్షా కుదుపులకి తట్టుకుంటూ పరిసరాల్ని పరికిస్తున్నాడే తప్ప మనసంతా పల్లిపేటలోనే ఉంది.

"పల్లిపేట జంక్షనుకు ఎనిమిదిమైళ్ళ దూరంలో ఉంది. ఎలా వెళ్ళినా గంటన్నర పైగా పడుతుంది. అయినా తన అదృష్టం బావుంది- ఈ నారాయణ రిక్షా కట్టాడు. లేకపోతే ఈ చీకట్లో పడుతూ లేస్తూ పల్లిపేట ఎప్పటికి చేరగలిగేవాడో!....

నారాయణ రిక్షా దిగి ఇసకలోంచి తన బలాన్నంతా ఉపయోగించి లాగుతున్నాడు. అతడు పడుతున్న శ్రమను చూసి మూర్తి మనసు జాలితో నిండిపోయింది.

"నారాయణా! నీకెంతమంది పిల్లలు?" కేవలం నారాయణ కష్టాన్ని మరిపించడంకోసం అంటూ అతన్ని మాటల్లోకి దింపాడు.

"బాబయ్యా! మా బతుక్కి అదే దురదుష్టం! మనువయ్యినాక వొక్క నలుసు పుట్టలేదనే మా యాడది కుమిలిపోతుండాది ఎన్నో దేవుళ్ళకు మొక్కుకున్నాం! డాకటేర్లు సుట్టూ తిరిగినాం.... సివరికి దానికి నేనూ- నా కదీనూ మిగిలిపోనాం!"

"పోనీ ఎవరినన్నా పెంచుకోలేకపోయారా!" మూర్తి అనాసక్తంగానే



అడుగుతున్నాడు.

"ఎవరిత్తారు బాపూ! కులపోళ్ళు మమ్మల్ని ఎలేసినారు.... మావూఁ దూరంగా ఎలుపొచ్చేసినాం! గవుర్మెంటోళ్ళు రెండొందలుచ్చుకుని పట్టాయిత్తే- ఆ జంక్షనుకాడ పాకేసుకున్నాం! ఇంట్లో నా యాడది పొదుపుగుంది, కాళ్ళ కడియాలమ్మి కొన్పెట్టినాది. నా సేతిలో రిక్షా.... రెక్కల కట్టం సందపేలకి అయిదో పదో కళ్ళ సూపిత్తాయి బాపూ!-"

నారాయణ స్వగతం చెప్పుకుపోతూనే ఉన్నాడు. మూర్తి మౌనంగా ఊఁ కొడుతూనే ఉన్నాడు. చలిగాలి మరింత ఎక్కువయింది. మూర్తి రిక్షాలో మునగదీసుకుని కూర్చున్నాడు. అక్కడ దారి మరీ జీబురుగా ఉంది. నారాయణ ఆయాసపడుతూ రిక్షాను వేగంగానే తొక్కుతున్నాడు. రోడ్డు కిరువైపులా

దొంకలు, ముళ్ళపొదలు.. ఆకాశంలో క్షీణచంద్రుడు అప్పుడే బయటకొచ్చాడు. వెన్నెల - వెలుగు దారిలో పలచగా పరుచుకుంటోంది ఎక్కడో నక్కలు కూస్తున్నాయి....

"బావూ!" నారాయణ గొంతు విని ఎటో చూస్తున్న మూర్తి అదిరిపడ్డాడు. ఆ చీకట్లో ముందుకు దృష్టిని సారించే సరికి రిక్షా ఎత్తైన ప్రదేశాన్ని ఎక్కుతూ ఆగిపోయింది. అక్కడ ఏదో చిన్న వంతెన ఉన్నట్లుంది .. క్రింద కాలవలో నీళ్ళు గలగలమంటూ శబ్దంచేస్తున్నాయి. నారాయణ ఒక చేత్తో హేండిలు పట్టుకుని, రిక్షా దిగిపోయి రోడ్డుమీద కూర్చుండిపోయాడు. ఏం జరిగిందో అర్థంకాక మూర్తి గభాలున రిక్షాలోంచి దూకి ఒకచేత్తో నారాయణని, మరో చేత్తో రిక్షాని బలంగా పట్టుకున్నాడు. "నారాయణా! ఏం జరిగింది?" మూర్తి ఆదుర్దాగా అడిగాడు.

"బావూ! గుండెల్లో నొప్పి.... అప్పుడప్పుడు అట్టాగే వత్తదయ్యా! పర్నేదు వొక్క చెనం కళ్ళు మూసుకుంటే తగ్గి.... అబ్బా...." నారాయణ మాట్లాడలేకపోతున్నాడు. బాధతో విలవిల లాడుతూ గుండెమీద చెయ్యిపెట్టుకొని వెనక్కి ఒరిగిపోయాడు- రోడ్డుమీద వెల్లకిలా పడుకుండిపోయాడు. మూర్తికి మతిపోయినట్టయ్యింది. ఒక్కసారే ఒంట్లో దడ, కంగారు పుట్టాయి. చుట్టూ చీకటి.... నిర్మానుష్య ప్రదేశం.... ఏం చెయ్యడానికి పాలుపోలేదు. 'నారాయణా! నారాయణా.' అంటూ రెండుసార్లు గట్టిగా పిలిచాడు. నారాయణ మాట్లాడలేదు.... నాడి పరీక్షించి చూశాడు. ఊహూ! అది కొట్టుకుంటున్నట్లుగా కనిపించలేదు. మూర్తి నారాయణ తలని తన ఒళ్ళో పెట్టుకుని గుండెలమీద బాగా రుద్ద సాగాడు. పది నిమిషాలు మూర్తి అలా రుద్దేసరికి నారాయణ కొద్దిగా మూలిగాడు. అయినా మాటకు బదులు చెప్పలేకపోతున్నాడు. మూర్తి నారాయణని అలా రోడ్డుమీద పడుకోబెట్టి రిక్షాకున్న కిరోసిన్ దీపం చేత్తో పట్టుకున్నాడు. నెమ్మదిగా రోడ్డుగట్టు దిగి వంతెన క్రింద కాలవలో జేబురుమాలు తడిపి దారికడ్డంగా ఉన్న మొక్కల్ని తప్పించుకుంటూ పైకి వచ్చాడు. ఆ తడిగుడ్డతో నారాయణ ముఖం చాలాసేపు తుడిచాడు. అయినా నారాయణ పరిస్థితిలో మార్పులేదు. ఇప్పుడేమిటి చెయ్యడం? మూర్తి మళ్ళీ నారాయణ గుండెలమీద రాస్తూ కూర్చున్నాడు. నిముషాలు గడుస్తున్నాయి. ఫలితం కనిపించలేదు....

వీడికి గుండెజబ్బని ఊహించనైనా లేదు. ఎలా ఊహించగలడు? మనిషి బలంగానే ఉన్నాడు. రిక్షా ఎక్కినప్పట్నుంచి ఏవో కబుర్లు చెబుతూనే ఉన్నాడు. ఒకవేళ జరగకూడనిది జరిగి

.... వీడిక్కడ అర్ధాంతరంగా ప్రాణం వదిలేస్తే ఆ పాపం తనకు చుట్టుకోదూ! పాపపుణ్యాల ప్రసక్తి వదిలేసినా మనిషిగా తనిప్పుడు ఏం చెయ్యగలడు? ఆతని భార్యకు అప్పగించేద్దామనుకుంటే చాలా దూరం వెనక్కి వెళ్ళాలి. ఎలా తీసుకువెళ్ళగలడు తను? ఉహూఁ పోనీ నారాయణని వదిలేసి వెళ్ళిపోతే! అవును తను వెళ్ళాలి తప్పదు. ఇప్పటికే చాలా ఆలస్యమయింది.... మరి నారాయణ సంగతి? మూర్తి ఒక్కసారి కళ్ళు మూసుకున్నాడు. నారాయణ భార్య మనసులో మెదిలింది వాళ్ళ అనుబంధం, ఆత్మీయత గుర్తుకొచ్చాయి. ఏదో నిర్ణయించుకున్నవాడిలా దిగ్గున లేచాడు మూర్తి నారాయణ చంకలో రెండు చేతులూ పెట్టి, ఎత్తిపట్టుకుని రిక్షాలో పడుకోబెట్టాడు. హేండిలు పట్టుకుని రిక్షాను ముందుకు నడిపించసాగాడు. అలవాటులేని పని. అటూ ఇటూ హేండిలు విసురుతూంటే జాగ్రత్తగా కాస్తూ రిక్షాను ముందుకు లాగుతున్నాడు. మూర్తికి కాళ్ళు తడబడుతున్నాయి. కళ్ళు దారిని జాగ్రత్తగా గమనిస్తున్నాయి. ఇంతదూరం వరకు తనను రిక్షాలో కూర్చోబెట్టి నారాయణ లాక్కొని వచ్చాడు. ఇప్పుడు ఆదేపని తను చేయవలసి వచ్చింది.ఎంతలో ఎంత విచిత్రం! జీవితంలో ఎన్నడూ ఊహించని సంఘటన యిది. ఈ చీకట్లో నిర్జన ప్రదేశంలో ఒక అభాగ్యుణ్ని అపస్మారక స్థితిలో రిక్షాలో మోసుకువెళ్ళడం.... మూర్తికి తన ఉద్యోగం.... స్థితి ప్రస్తుత పరిస్థితి అన్నీ మనసులో మెదిలాయి. వాటే మిజరబుల్ ఇన్సిడెంట్! అనుకున్నాడు. రిక్షాను వేగంగా ముందుకు లాగుతూంటే మూర్తి ఒళ్ళంతా చెమటపట్టేసింది. అంత చలిలోను తొడుక్కున్న బట్టలు తడిసి పోయాయి....

దూరంగా అక్కడక్కడా దీపాలు మిణుకుమిణుకుమంటూ కనిపించాయి. ఊరు దగ్గరకొచ్చేసింది. మూర్తి ఓపిగ్గా రిక్షాను ముందుకు లాగుతున్నాడు. రిక్షా మలుపు తిరిగింది. రోషమ్మగుడి దాటింది. రోషమ్మ ఆ వూరి దేవత.... ప్రతియేటా పెద్దఎత్తున జాతర జరుగుతుంది. ఆ గుడి దాటితే రోడ్డుప్రక్కనే పెద్ద చెఱువు! చెఱువు గట్టుమీద వరుసగా నాటిన కొబ్బరిచెట్లు.... ఆ ప్రక్కనే చెన్నకేశవస్వామి ఆలయం .... ఇంకా ముందుకుపోతే చిన్నపిల్లలబడి. అన్నీ మామూలుగా ఆనవాలు పట్టాడు మూర్తి. ఊరు నిశ్శబ్దంగా నిద్రపోతూంది. చెన్నకేశవస్వామి ఆలయంవద్ద వెలుగులో చేతివాచీవంక చూశాడు. టైము ఒంటిగంటన్నర.... రిక్షాను ముందుకు లాక్కెళ్ళి చిన్నపిల్లలబడి వెనుక వీధిలో నిలిపాడు. ఒక నిముషం ఆ వీధిని పరీక్షగా చూసి....

వీధిలైటు వెలుగులో చక్రవర్తుల శేషావతారం, ఆర్.ఎమ్.పి. అన్న బోర్డుని చూసి ఆ యింటిముందు రిక్షాను ఆపాడు. గబగబా యింటి మెట్లెక్కి 'శేషావతారంగారూ' అంటూ గొంతెత్తి బిగ్గరగా పిలిచాడు. శేషావతారంగారు ఆయుర్వేదంలో పండిపోయి ఆంగ్ల వైద్యంలో ఆరితేరిన దిట్ట. కొద్ది సేపట్లోనే తలుపు తీసిన చప్పుడయింది. శేషావతారంగారు చేతిలో లాంతరుతో 'ఎవరూ!' అంటూ బయటకొచ్చారు దీపం వెలుగులో మూర్తిని చూసి– "అరె! నువ్వటోయ్ మూర్తి! ఇదే రావడమా!" అంటూ ఆశ్చర్యాన్ని క్రుమ్మరించారు.

"అవునండీ! ప్రయాణం త్వరగా జరుగలేదు. దారిలో ఈ రిక్షావాడు గుండెనొప్పంటూ పడిపోయాడు. అతన్నక్కడ వదిలివేయలేక రిక్షాలో వేసుకుని లాక్కొచ్చాను" మూర్తి రిక్షాలో నారాయణని చూపిస్తూ సూట్‌కేస్ బయటకు తీసుకున్నాడు.

"అరెరె! ఎంత పని జరిగింది! సర్లే వీడి సంగతి నేను చూస్తాను.... నువ్వు త్వరగా ఇంటికెళ్ళు" శేషావతారం రిక్షాలోని నారాయణ నాడి పట్టుకుని పరీక్షించాడు.

"పరవాలేదు.... వీడికి వైద్యం నేను చేస్తాను.... నువ్వెళ్ళు–" అక్కడే ఇంకా నిలబడిఉన్న మూర్తిని కంగారు పెట్టారు శేషావతారంగారు. మూర్తి వెనక్కి తిరిగి గబగబా అడుగులువేసి మున్సబుగారి వీధిలోకి మళ్ళి... అక్కడ నుంచి నాలుగంగలు వేసి.... పరుగెడుతున్నట్టుగా నడిచి తన యింటిముందు వాకిట్లో వాలాడు.... ఇంటిముందు పంచలో నూనెదీపం వెలుగుతూంది.... గుంపుగా కూర్చున్న ఆడవాళ్ళందరూ ఒక్కసారే గొల్లుమన్నారు....

"బాబూ! ఇప్పుడొచ్చావా నాయనా! అంతా అయిపోయింది– బాబూ అంతా అయిపోయింది. కళ్ళల్లో ప్రాణం ఉన్నంతవరకూ నీ పేరే కలవరిస్తూ పోయాడు బాబూ నీ తండ్రి! కనీసం కడసారి చూపులైనా దక్కలేదు నాయనా నీకు.... ఎంత దౌర్భాగ్యం తండ్రీ! ఒక్క అరగంట ముందుగా వచ్చినా నీ తండ్రి ముఖాన్ని చూసుకోగలిగి ఉండే వాడివి నాయనా!" మూర్తి సూట్‌కేస్ క్రిందపడేసి ఏడుస్తూ పెద్దగా శోకాలు పెడుతూన్న పెద్దమ్మను పట్టుకుని బావురుమన్నాడు.... మరుక్షణం ఏదో ఆలోచన మెరుపులా మెరిసినట్లయి, పెద్దమ్మను వదిలించుకుని శ్మశానంవైపు పరుగెట్టాడు....

అవును.... తన తండ్రిని కడసారి ముఖం చూసుకోలేకపోయాడు. ఎంత దౌర్భాగ్యం! నిన్న సాయంకాలం టెలిగ్రాం అందింది. "ఫాదర్ ఎక్స్‌పైర్డ్ .... స్టార్ట్ ఇమ్మీడియట్‌లీ!" అని. ఒళ్ళు కంపిస్తుంటే.... దుఃఖం

తెరలుతెరలుగా ఎగదన్నుకొస్తూంటే తనను తాను ఓదార్చుకుని వెంటనే బయలుదేరాడు. కాని ఎంత తొందరగా వద్దామన్నా అనుకున్న సమయానికి రాలేకపోయాడు! హుం.

తన తండ్రి తనకు తండ్రి కాదు.... తల్లి, గురువు, దైవం అన్నీ తనై పెంచాడు చిన్నప్పుడే తల్లి పోతే- మళ్ళో పెళ్ళిమాటెత్తక మోడువారిన చెట్టులా మిగిలిపోయాడు. గోరుముద్దలు తినిపించాడు. జోలపాడి నిద్రపుచ్చాడు... భుజాలమీద ఎత్తుకుని బడికి తీసుకెళ్ళాడు .... ఆశలు అన్నీ తనపై పెట్టుకుని ఉన్న అయిదెకరాల పొలం అమ్మి పై చదువులు చదివించాడు. ఉద్యోగం వచ్చిన తరువాత ఎన్నిసార్లు తనవద్దకు రమ్మన్నా రాకుండా ఉన్న ఊళ్ళోనే తనకు హాయిగా ఉంటుందని మొరాయించి.... నువ్వు పెళ్ళిచేసుకుని ఒకరో ఇద్దరో పిల్లల్ని కన్న తరువాత వచ్చి వాళ్ళతో ఆడుకుంటానని సర్దిచెప్పి పంపించేసే వాడు. తన పెళ్ళి కళ్ళచూడకుండానే వెళ్ళిపోయాడు. ఆర్నెల్ల క్రితం తను గోవా ట్రైనింగు కెళ్ళాడు. నెలరోజుల క్రితమే ఆఫీసరుగా ప్రమోటయ్యాడు. తను ఎప్పటికప్పుడు ఉత్తరాలు రాస్తూనే ఉన్నాడు. తండ్రిదగ్గర్నుంచి కూడా జవాబులు వస్తూనే ఉన్నాయి. కాని.... తన తండ్రి తనకు అన్యాయం చేశాడు. తన అనారోగ్యాన్ని కప్పిపుచ్చి అర్ధాంతరంగా వెళ్ళిపోయాడు....

మూర్తి పిచ్చెక్కినవాడిలా పరిగెడుతూ వచ్చి శ్మశానంలోకి అడుగు పెట్టాడు. అక్కడ కూర్చున్న బంధువులంతా ఉలిక్కిపడి మూర్తిని గుర్తించి ఒక్కొక్కళ్ళే దగ్గరగా చేరి ఓదార్చడం మొదలుపెట్టారు. ఎదురుగా.... కట్టెల మీద.... భగభగ మండుతూన్న మంటల్లో.... తన తండ్రి బూడిదగా మారిపోతూన్న తన ఆత్మబంధువు.... అతడ్ని కడసారి చూడలేకపోయి.... కనీసం తలకొరివి పెట్టలేకపోయిన దౌర్భాగ్యం! దురదృష్టం! మూర్తి దుఃఖానికి అంతులేదు.... కుప్పలా కూలి పోయాడు ...

* * *

ఉదయం.... అప్పుడే తూర్పు తెల్లబడుతూ తెలతెలవారుతోంది. బంధువులతో కలిసి శ్మశానంనుంచి ఇంటికి తిరిగివస్తున్నాడు మూర్తి. అందరూ శేషావతారం ఇంటిముందుగా నడుస్తున్నారు. అక్కడే నిలబడిఉన్న రిక్షాను చూసి గబగబా గుమ్మంఎక్కి అరుగు మీదకు వెళ్ళాడు మూర్తి. మూర్తిని చూసి శేషావతారంగారు బయటకొచ్చారు.

"మూర్తీ! నువ్వుగాని ఈ నారాయణ గాడ్ని ఆ విధంగా రిక్షాలో వేసుకుని రాత్రి నాకు అప్పగించకపోతే వీడికి ఈపాటికి భూమ్మీద నూకలు చెల్లిపోయి ఉండుననుకో! వీడికి గుండెజబ్బు....

పెద్ద షాక్కే వచ్చింది. నీడు నాకు తెలుసు. రిక్షా తొక్కొద్దని, బరువు పనులు చెయ్యొద్దనీ గతంలో చాలా సార్లు హెచ్చరించాను ఎలాగైతేనేం, ఒడ్డున పడ్డాడనుకో! నిజానికి నారాయణకి ప్రాణదానం చేసింది నువ్వే! నీ తండ్రి పోయాడని తెలిసి అంత దుఃఖంలో ఉండికూడా వాడ్ని రిక్షాలో లాక్కొని వచ్చావే! నిజంగా వాడికి పునర్జన్మ నిచ్చావు.... మహామహులకే సాధ్యం కానంత సంయమనాన్ని, సంస్కారాన్ని ప్రదర్శించేవు"....

శేషావతారంగారు చెబుతూన్న మాటలు మూర్తికి తలకెక్కటంలేదు. "బాబూ! ఓ అరగంట ముందుగా వచ్చినా నీ తండ్రి కడసారి చూపులు నీకు దక్కేవి!" అన్న పెద్దమ్మ మాటలే గుర్తుకొస్తున్నాయి.

అవును.... నారాయణని అక్కడే వదిలేసి వెంటనే వచ్చేస్తే కనీసం తన తండ్రిని చూడగలిగేవాడేమో! అతనికి తలకొరివి పెట్టగలిగేవాడేమో! తన తండ్రి శవమై తనకోసం ఎదురుచూస్తున్నాడని తెలిసి కూడా.... నారాయణని వదిలిపెట్టి ఎందుకు రాలేకపోయాడు? ఏ శక్తి తన కాళ్ళకి అడ్డంపడింది.... తను తప్పుచేశాడా? అది నిజంగా తప్పే అయితే తన తండ్రి మనసు శాంతిస్తుందా? తనను క్షమించగలుగుతుందా?

మంచంలో నారాయణ నెమ్మదిగా లేచి రెండు చేతులెత్తి దణ్ణం పెడుతూ మూర్తికాళ్ళమీద పడిపోయాడు.

"బాపూ! మీ ఋణం నా జనమలో తీర్చుకోలేను. మీరు మనుషులు కాదు... నా పాలిట...." మూర్తి నారాయణని గభాలున పట్టుకుని పైకి లేపి అతని ముఖంలోకి చూస్తూండిపోయాడు.... అలా చూస్తుంటే నారాయణ ముఖంలో ఎవరో కనిపించినట్లయ్యింది... అతనికి ఇప్పుడు జన్మనిచ్చిన తండ్రిని చూడలేక పోయానన్న బాధలేదు. బెంగ లేదు. మూర్తి నారాయణని గుండెలకి హత్తుకున్నాడు. వాళ్ళిద్దర్నీ చూస్తూ వసుధైక కుటుంబం- మానవతా! చిరంజీవ! అంటూ శేషావతారంగారు మనసులో ఒకటికి పదిసార్లు అనుకుంటూ ఉండి పోయారు.



# నాకు నచ్చిన నా కథ

మన తెలుగువారికి సెన్స్ ఆఫ్ హ్యూమర్ లేకపోలేదు. కాని అది కార్టూన్లకు పరిమితమే. పత్రికల్లో అప్పుడప్పుడు హాస్యకథలు చదువుతూ ఉంటాము కాని వాటిని మనం సీరియస్‌గా తీసుకోం. వాటి గురించి సంపాదకుని పేర ఉత్తరాలు రాసి అభిప్రాయం వ్యక్తం చేయం. కథల పోటీలలో హాస్యకథకి బహుమతి రావడం కనీ వినీ ఎరుగం. దాంట్లోనూ సీరియస్ కథల్లో కూడా ప్రధాన పాత్రలు తప్పకుండా చనిపోతేనే బహుమతి వచ్చే అవకాశం ఉంటుంది. మనం ఇంకా మెలోడ్రామా దశలోనే ఉన్నామనిపిస్తుంది.



పులిగడ్డ విశ్వనాథరావు

మనిషిని ఏడిపించటంకంటే నవ్వించడం కష్టమని నా అభిప్రాయం. ఒక సంఘటనను పి.జి. వోడ్‌హవుస్ దృష్టితో చూచి నవ్వించే విధంగానూ చిత్రించవచ్చు. దాన్నే అతి సీరియస్‌గానూ చిత్రించవచ్చు. మచ్చుకి నాకు నచ్చిన నా కథ "వి.ఐ.పి. బంగళాలో ఆవు వేట"లో రాజకీయవేత్తలు, పాత్రికేయులు జోక్యంవలన ఒక చిన్న సంఘటన ఎంతదూరం లేవదీయగలదో హాస్యధోరణిలో చిత్రించాను. ఈ ఇతివృత్తాన్నే కొద్దిగా మార్చి కథ చెప్పే

విధాన్ని పూర్తిగా మార్చి అతి సీరియస్‌గా తయారుచేయవచ్చు. అదెలాగంటారా. మచ్చుకి ఆవు యజమాన్ని అతి పేదవానిగా వర్ణించి తన ఒక్కగానొక్క జీవితాధారమయిన ఆవు చనిపోయిందని అతడు గుండెపోటుతో మరణించినట్లు చిత్రించి కథను ట్రాజెడీగా మార్చవచ్చు. అందువలన చెప్పేదేదో నవ్వించే విధంగా చెప్పాలని నా ప్రయత్నం. జీవితం ఎలాగూ దుఃఖమయం కదా. అందువలన సీరియస్ కథలతో సహా హాస్యకథలు కూడా ఉంటూ ఉండాలి. నాకు నచ్చిన ఈ కథలో హాస్యదృష్టితో చూస్తే ఒక ప్రత్యేకత ఉందని అనిపిస్తుంది. అది వ్యంగ్య ఉపమానాలవలన చేకూరిందేమో. ఈ కథ 2-8-81 ఆంధ్ర జ్యోతి సచిత్ర వారపత్రికలో ప్రచురించబడింది.

# వి.ఐ.పి. బంగళాలో ఆవు వేట

అది రాజధానిలో అతి ముఖ్యవ్యక్తి నివసిస్తున్న బంగళా. బంగళా కాపువుండే వ్యక్తికి మధ్యాహ్నం మరొక డ్యూటీ ఉండేది. అది పాలడిపో నుంచి పాలసీసాలు తీసుకురావడం. ఆ ఒక గంటసేపూ బంగళాలోకి ఎవరూ చొరబడకుండా కాపుఉండే బాధ్యత పెంపుడుకుక్క టామీపై పడేది.

నిజానికి పాలు తేవడం అర్ధగంట పనేకాని కాపుఉండే మనిషి ఆ పనిని పూర్తిగా ఒక గంటకు పెంచి అదనపు సమయాన్ని తోటివారితో బాతాఖానీకి, తన యజమాని, యజమానురాలు తనకు, ఇతర నౌకర్లకు చేస్తున్న అన్యాయాలను ఏకరువుపెట్టడానికీ వినియోగించేవాడు.

టామీ ఈ మధ్యన జబ్బుపడి కుక్కల ఆస్పత్రిలో చేరడంవలన ఆ గంటసేపూ బంగళా బైట ఏ కాపూ ఉండేదికాదు. ఒకరోజు అటువంటి సమయంలో తెల్లటి కామధేనువులాంటి ఒక ఆవు అలా గడ్డిమేస్తూ బిగ్ బాస్ పచార్లుచేస్తూ అనుకోకుండా ఒక సెక్షన్‌లో దూరినట్టు ఆ బంగళాలోకి చొరబడింది.

ఆ ఆవు అన్‌ఎడ్యుకేటెడ్ బ్రూట్ కాబట్టి దానికి నేమ్‌ప్లేట్లు చదివే అలవాటు లేదు. దానికి సరస్వతీకటాక్షంగాని ఉండి ఉంటే బంగళా గేటుకున్న నేమ్‌ప్లేట్‌ను చూసి కొత్త మంత్రిమండలిలో స్థానం దొరికే అవకాశం ఉందని తెలుసుకున్న రాజకీయవేత్త స్వంతపార్టీని ఎంత వేగంగా విడిచిపెట్టి అధికారం

లోకి రాబోతున్న పార్టీలో చేరుతాడో అంత వేగంతోనూ ఆ ఆవు వెనక్కు పరుగుదీసును. వి.ఐ.పి. ఇంట్లో ప్రవేశించడానికి ఎన్ని గుండెలుండాలి!

ఆవు బంగళాలో ప్రవేశించి లానులో ముచ్చటగొల్పే గడ్డిని చూసి పంచదారకోసం ప్రాకులాడే గృహస్థుకు చక్కెరపోక కనిపించినంత సంబరపడి 'అవురావురు'మని తినడానికి ఉపక్రమించింది. ఇంతటిలో ఈ పూట కూర ఎక్కువగా వుండడంవల్ల మిగిలిపోయినందుకు వంటావిణ్ణి సంబోధించి సహస్రనామ పారాయణచేసి ఆ ఇంటి యజమానురాలు రుసరుసలాడుతూ బైటకు వచ్చింది. అసలు ఆపాటి కూర మిగలడంవల్లనే పనిమనిషికీ, వంటావిడకీ ఈ పూట కాస్త కూర అందింది. లేకపోతే రోజూలాగ ఈ పూట కూడా వాళ్ళకు పొడిమెతుకులే దక్కును.

"ఇంతకీ ఆ కూర ఏ దబ్బో గుమ్మరించి కొన్నది ఐతేగా. ప్రభుత్వ ఖర్చుతో పెరటిలో పండిందే కదా. దానికోసం ఈ మహాఇల్లాలు నన్ను అలా ఆడిపోయాలా?" అని తర్వాత వంటావిడ పనిమనిషితో దీర్ఘాలు తీసింది కూడా.

తెరమీద మాత్రం హీరోయిన్ నిండుగా అజంతా చిత్రంలా కనబడి యదార్థంలో గాలితీసిన బెలూన్‌లా కనబడినట్టు లానులో గడ్డి చూడడానికి ముచ్చటగా ఉన్నా నోటికి మాత్రం అందిరావదని గ్రహించి ఆ ఆవు చుట్టూ చూసింది. బంగళాకు ఒకవైపు కూరగాయల పెరడు కనబడింది. చుట్టూ కంచె ఉంది కాని లక్ష్యశుద్ధిగలవారిని కొండలూ, సముద్రాలూ కూడ అడ్డుకోలేవు అంటారు. రాజకీయవేత్త కొత్త మంత్రిమండలిలో సీటుకోసం పార్టీ ఫిరాయించి నిరాశచెంది జాతి శ్రేయస్సు పేరిట, గాంధీ, నెహ్రూల పేరిట మరల మరొక పార్టీలోకి దాటువేసినట్టు ఆ దేనువు కంచెమీంచి దుమికి కూరల పెరటిలోకి ప్రవేశించింది. అక్కడ ఇంటి యజమానురాలు ప్రాణపదిలంగా చూసుకునే కూరమొక్కలను కూరగాయలలో సహా అరగించసాగించి.

ఈలోగా బైటకు వచ్చిన యజమానురాలు ఆ భీభత్స దృశ్యం చూసి స్మగల్ సరుకును కస్టమ్స్ బారినుంచి తప్పించి తెస్తే తీరా పోలీసులు తన్నుకు పోయినట్టు అంత శ్రమపడి పండించిన కూరగాయలను ఆవు అలా కిల్లీలా నమిలివేయడం సహించరాదని నిశ్చయించుకుంది. వాకౌట్ చేసేముందు శాసన సభ్యులు అరిచినట్లు గొంతు చించుకుని అరుస్తూ బంట్రోతు క్వార్టర్లవైపు పరుగుదీసింది. అనగా అంత బరువుగల స్త్రీ ఎంత వడిగా నడవగలదో అంత వడిగా కదిలిందని అర్థం. వెంటనే భీముడిలాంటి ఒక బంట్రోతు పరుగెత్తి

కుంటూ వచ్చాడు. అతడు యజమానురాలి వాలకం, కూరగాయలు అరగిస్తున్న అవును చూసి పరిస్థితి అర్థంచేసుకుని ఇంట్లోకి వెళ్ళి గడలాంటి దుడ్డుకర్ర చేత పట్టి సాక్షాత్తు హిడింబి మొగుడులా తయారయి అదిలిస్తూ అవువెంట పడ్డాడు. అవు మామూళ్ళకు అలవాటు పడిన ఉద్యోగిలాగ ఏ బిడియమూ లేకుండా హాయిగా వంకాయలనూ, బెండకాయలనూ (సదరు ఉద్యోగికి పది రూపాయల మామూలుకు బదులు నూరు రూపాయల మామూలు లభించినట్లు) అరగిస్తోంది.

ఈ ఆవు ఇలా లొంగేదికాదని ఆ అపరభీముడు దాన్ని వీపుమీద దుడ్డుకర్రతో బాదగా అది పెరటిలో కంచెచుట్టూ పరుగెత్తసాగింది. అత్తారింట విందుభోజనాలు అరగించి వి.ఐ.పి మర్యాదలు అందుకుంటున్న అల్లుడు సెలవుఅయిపోయినా అత్తారిల్లు వదిలిపోవడానికి మనసొప్పక చూరుపట్టుక వేల్లాడినట్లు అవుకు పెరటి కంచె దూకి పారిపోవడానికి మనసొప్పడంలేదు. సదరు అల్లుడి మావగారు లౌక్యంగా "ఏమోయ్ నీకోసం మీ అమ్మ, నాన్న, చెల్లెళ్ళు బెంగపెట్టుకుంటారేమో. నువు సెలవు పొడిగిస్తున్నట్టు తెలిసి వాళ్ళు ఏమంటారో కనుక్కోవడానికి ఒక ఉత్తరంముక్కయినా రాశావా?" అని హింట్ చేసినట్టు భీముడు పెరటితలుపు తెరిచాడు.

ఆ అల్లుడు "ఈ రోజే ఉత్తరం రాశానండి. మీ రన్నట్టు వాళ్ళు నాకోసం బెంగపెట్టుకునే ఉంటారు. అందుకే వాళ్ళను ఇక్కడికి వచ్చేయమని రాశాను" అని బదులు చెప్పినట్లు అవు తెరిచిఉన్న గేటును చూసీ చూడనట్లు ముందుకు సాగిపోయి యధాప్రకారంగా చుట్టూ తిరగసాగింది.

కొంతమంది ఉద్యోగాలకోసం, లైసెన్సుల కోసం, కాంట్రాక్టులకోసం మామూలు గేటులోంచి రారు. కంచె దూకైనా వస్తారు లేదా కంచె విరక్కొట్టయినా వస్తారు. మొత్తంమీద పని ముగించుకుని అలాగే నిష్క్రమిస్తారు. ఆ కోవకు చెందిందే ఈ అవు. భీముడి చావుదెబ్బలు భరించలేక "ఎవరబ్బ సొమ్మని" రాములవారిని తిట్టినా లాభంలేదని, ఇహ నిష్క్రమించడమే మేలని నిర్ధారించుకుని ఆ అవు కంచెను విరక్కొట్టి దారిచేసుకుని బైటకు వచ్చింది. మొత్తంమీద తన సిద్ధాంతానికి అనునయంగా గేటులోంచి మాత్రం బైటకు రాలేదు. ఐతే కూరల పెరటిలోంచి బైటకువచ్చిన అవు బంగళా ముందుకు పోక వెనక్కి పరుగెత్తి వెనుకగల వరండాలోకి ప్రవేశించింది. ఆ వరండా గచ్చు మసలిహీరో విగ్గులేని బట్టతలలా నున్నగా తళతళా మెరుస్తోంది. మరి ఇంటి యజమానురాలు స్వయంగా ముందుండి పనిమనిషిచేత ఇంటి గచ్చునంతా

తడిగుడ్డతో క్లీనుచేయిస్తుంది కదా! అవు అ గచ్చుమీద జారిపడింది. ఆ పడటం పడడం మరి లేవలేకపోయింది.

బంట్రోతు అదిలించాడు. దుడ్డుకర్రతో పొడిచాడు. కాని లాభంలేక పోయింది. ఇంతలో ఇంటి యజమానురాలు వచ్చి అవును చూసి నెత్తీనోరు బాదుకుంటూ "అయ్యో రాత. ఇది ఇక్కడ చస్తే మాకు గోహత్య పాపం చుట్టుకోవడమే కాక మా ప్రతిష్ట కూడ మట్టిపాలవుతుంది. అవు సొంతదారుకు నష్టపరిహారం కూడ చెల్లించుకోవాలి" అని విలపించసాగింది. "దాన్ని బైటకు తరమాలి కాని అలా బాది చంపేస్తావా? నీ గొడ్డుబలమంతా దానిపై చూపెడతావా? అరునెలలు సాముచేసి మూలనున్న ముసలమ్మను పొడిచాడట నీలాంటి పహిల్వానే" అని ఆమె బంట్రోతును మందలించింది.

వేయి దేముళ్ళకు మొక్కుకొంటూ ఆమె ఒక బక్కెట్టులో నీళ్ళు తెచ్చి అవుముందు ఉంచింది. ఊహూ. ఉలుకుపలుకు లేదు. గడ్డితెచ్చి అవునోటిలో పెట్టింది. కాని అది తింటేగా. "నా బుద్ధి గడ్డితినాలి కాని ఇది తింటుందా" అని విసుక్కుంది యజమానురాలు. అవు అలా నిశ్చలంగా బెల్లంకొట్టిన రాయిలా పడుండటం చూసి ఏదో గుర్తువచ్చినట్టు కొద్దిగా బెల్లం తెచ్చి అవుముందు ఉంచింది. కాని అవు కళ్ళు తేలేసి పడుంది. బెల్లం వాసన కూడా చూడలేదు. యజమానురాలు బెంబేలెత్తిపోయి భర్తకు ఫోనుచేసింది.

ఇంతలో అవు సొంతదారు దాన్ని వెతుక్కుంటూ బంగళాలో తన అవు ఉనికి పసిగట్టి వచ్చిపడ్డాడు. పడున్న అవును చూసి ఆవేశంతో "నా అవును మీ కడుపున పెట్టుకున్నారే. రెండు గడ్డిపరకలు మేసిందని కసాయి వాడిలా చావబాదుతారా!" అని బంగళా యజమానురాలును మరింత కంగారు పెట్టేసి తన కుటుంబానికి ఈ దుర్వార్త చెప్పి తర్వాతి కార్యక్రమం గురించి అలోచిద్దామని బైలుదేరాడు అవు సొంతదారు. ఇంతలో బంగళా యజమాని కూడ కారులో అదరాబాదరాగా వచ్చిపడ్డాడు. పరిస్థితి తెలుసుకుని మున్సిపల్ కార్పొరేషన్ అధిపతికి ఫోనుచేశాడు. ఆ అధిపతి అయన పరిచయస్థుడే. అతడు బంగళా యజమాని చెప్పిన వివరాలను విని వెంటనే ఏదో ఏర్పాటు చేయిస్తానని మాట ఇచ్చాడు.

ఆ అధిపతి పశువులను పట్టుకొనే శాఖాధికారికి ఫోనుచేసి వెంటనే ఆ బంగళాకు ఎవరినైనా పంపి తగు ఏర్పాట్లు చేయమని ఉత్తరువు జారీచేశాడు. ఆ శాఖాధికారి తన క్రింది అధికారికి చెప్పగా, అతడు తన క్రింది అధికారికి ఏర్పాట్లు

చేయమని హుకుం జారీచేశాడు. ఆ అధికారి ఇంకా క్రింది అధికారికి చెప్పగా చివరికి ఒక పశువుల ఇన్స్పెక్టర్ ఏర్పాట్లు చేయడానికి బైలుదేరాడు.

ఆ ఇన్స్పెక్టర్ చేరేసరికి బంగళా ముందు యాభైమంది గుమికూడి ఉన్నారు. వారు ఆవు యజమాని, అతడి కుటుంబ సభ్యులు, చుట్టాలు, బెల్లం వాసన పసిగట్టి చేరే చీమల్లాంటి రాజకీయవేత్తలూను. ఆ గుమికూడినవారిని సంబోధిస్తూ ఒక రాజకీయనాయకుడు ఉపన్యాసం దంచేస్తున్నాడు. "ఇటువంటి దౌర్జన్యం మనం సహించకూడదు. పదవిలో ఉన్నామని ఒక పేదవాడి ఆవును ఈ విధంగా హతమారుస్తారా? ఇటువంటి దౌర్జన్యాలు దేశమంతటా జరుగు తున్నాయి. వాటికి గురి అయినవాళ్ళు వెల్లువలా విజృంభించి ఈ నరరూప రాక్షసులను మట్టుపెట్టిననాడే మన దేశం గాంధీజీ ఊహించిన రామరాజ్యంగా మారగలదు...."

జనం చప్పట్లు చరిచారు. 'హియర్ హియర్' అన్నారు వారిలో కొందరు. వాడు ఆ విధంగా అనర్గళంగా ప్రసంగించిన తర్వాత మరొక రాజకీయ నాయకుడు అందుకున్నాడు. "ఆ చంపబడింది మేక, కోడి అయితే నష్టపరిహారం పుచ్చుకుని క్షమించవచ్చును. కాని అది సాక్షాత్తు గోమాత. తల్లితో సమానం. చనిపోయేముందు అది ఎలా బాధపడి ఉంటుందో! దాని ప్రాణాలు ఎట్లా కొట్టుకుని ఉంటాయో! తన మాడకోసం ఎలా పరితపించి ఉంటుందో! మీరంతా ఊహించండి...." అని రుమాలుతో ఆ పెద్దమనిషి కళ్ళు తుడుచు కున్నాడు. ప్రేక్షకుల్లో ఇద్దరు ముగ్గురు నిగ్రహించుకోలేక బిగ్గరగా ఏడవ సాగారు. వెనుకనుంచి ప్రేక్షకులు కొందరు "గోహంతకులు నశించాలి" "అధికార దుర్వినియోగం అంతమొందించాలి" అని నినాదాలు చేశారు. ఇంతకీ ఆవు ప్రాణాలు వదిలిందో లేక కొనఊపిరితో ఉందో తెలుసుకునే ఓపిక వాళ్ళకు ఉంటేగా.

ఆవు సొంతదారు తరపున పోలీసులో కేసు కూడా నమోదు అయినట్టు ఉంది. ఎస్.పి తన బృందంతో సహా వచ్చి వాలాడు. అతడికి ఈ వ్యవహారం "ముందు చూస్తే వివాళాలు సేకరించేవారు, వెనుక చూస్తే కాబూలీవాడు"లా ఉంది. ఒకవైపు బంగళా యజమాని వి.ఐ.పి. అయితే రెండవవైపు రాజకీయ వేత్తలు సమస్యకు రాజకీయపు రంగు పులుముతున్నారు. ఈ చిక్కులోంచి బైటపడి తన ఉద్యోగం కాపాడుకునే ఉపాయం ఆలోచించి కేసు ఉపసంహ రించుకుంటే ఆవు యజమానికి రెండు ఆవుల నష్టపరిహారం ఇప్పిస్తానన్నాడు. కాని రాజకీయవేత్తలు అదేదీ పనికిరాదు, కోర్టు నష్టపరిహారం ఎలాగూ ఇప్పి

స్తుంది కనుక వి.ఐ.పి. విరుద్ధంగా గోహత్య కేసు మాత్రం నడవవలసిందేనని పట్టుపట్టారు.

వి.ఐ.పి. విరుద్ధంగా పోలీసు కేసు నమోదు అయిందని, రాజకీయ వేత్తలు గుమికూడారని వినగానే హీరోయిన్ విలన్ చేతిలో చిక్కుకుందని హీరో తెలుసుకుని రేప్‌సీన్ మధ్యలో ఎలా ఊడిపడతాడో అలాగ పత్రికా విలేకర్లు హడావుడిగా ఊడిపడ్డారు. మరి ఉత్తకబుర్లు చెప్పి పత్రికా పాఠకులను నమ్మించవచ్చా. చనిపోయిన ఆవుఫోటో, సిగ్గుతో తలవంచుకుని నిల్చున్న వి.ఐ.పి. ఫోటో, ఏడుస్తున్న వి.ఐ.పి. భార్య ఫోటో, అక్కడ చేరిన రాజకీయ వేత్తల ఫోటో, ఆవు యజమాని ఫోటో, దూడ ఫోటోలాంటి ఫోటోలు కూడా పత్రికలలో వేస్తే పాఠకులకు చదవడానికి ఎంత హుషారుగా ఉంటుంది! అందు కని ప్రెస్ ఫోటోగ్రాఫర్లను కూడా వెంటబెట్టుకుని వచ్చారు విలేకర్లు. పోలీసులు వాళ్ళను బంగళాలోకి పోనీలేదు కాబట్టి వాళ్ళు బైటఉన్న ఆవు యజమాన్ని, ఉపన్యాసాలు ఇస్తున్న కార్తీలను ఇంటర్వ్యూ చేస్తున్నారు.

ఆవుతాత ఫలానా పశువుల ప్రదర్శనలో మూడవ బహుమతి పొందాదని (రిపోర్టులో మూడవ బహుమతిని ప్రథమ బహుమతి క్రింద మార్చడంవలన అకాశం వచ్చి వీపుమీద పడిపోదు కాబట్టి విలేకర్లు అలాగే సిద్ధాము నిర్ధారించు కున్నారు), దాని అమ్మమ్మకు అమ్మమ్మ పాలు బ్రిటిష్ వైస్‌రాయ్ తాగేవాడని తెలుసుకుని ఈ భోగట్టాలను "బాక్స్"లో వేయడానికి భేషుగ్గా ఉంటాయని మురిసిపోతున్నారు విలేకర్లు.

ప్రెస్ ఫోటోగ్రాఫర్లు బంగళా బైట దృశ్యాల ఫోటోలు తీశాక, ఆవు ఫోటో కూడా ఎలాగో తీయాలనే ఉద్దేశంతో బంగళా ప్రహరీగోడ ఎక్కారు. దీనివలన వాళ్ళకు కష్టమే కలిగింది కాని ఆవు మాత్రం కనబడలేదు. ఒకరిద్దరు ప్రహరీగోడ ప్రక్కనున్న కాలువలో పడ్డారు. మరిద్దరు ముళ్ళకంచెల్లో చిక్కుకుని చొక్కాలు చింపుకున్నారు. ఐతే వాళ్ళలో సమయస్ఫూర్తిగల ఇద్దరు ఫోటోగ్రాఫర్లు ప్రక్క బంగళాకు వెళ్ళి అక్కడి కాంపౌండ్‌లో చెట్టు ఎక్కి ఆవు, ఇంటి యజమానురాలు ఫోటోలు తీయడంలో కృతార్థులయారు. వాళ్ళు నీల్ ఆర్మ్‌స్ట్రాంగ్, టెన్సింగ్ నార్గేలా విజయానందంతో విర్రవీగు తున్నారు.

పశువుల ఇన్‌స్పెక్టర్ బంగళాలోకి పోయి బంగళా యజమానురాలును కలుసుకున్నాడు. ఆమె అతన్ని ఆవు వద్దకు తీసుకెళ్ళగా అతడు ఆవును తణిఖీ చేశాడు. తీవ్రంగా వాతం కమ్మడంవలన ఆవు పరిస్థితి అపాయకరంగా ఉందని

నిర్ధారించుకుని "దీనిని వెంటనే ఆస్పత్రికి తీసుకెళ్ళి చికిత్స చేయించాలి" అని సలహా ఇచ్చాడు.

"ఎలాగైనా ఆవును బ్రతికించు నాయనా. నీ ఋణం ఈ జన్మలో తీర్చుకోలేను ఖర్చు ఎంత ఐనా సరే ఫర్వాలేదు. దీనిని ఆస్పత్రికి తీసుకెళ్ళే ఏర్పాటు చెయ్యి" అని ఆమె ప్రాధేయపడింది. పశువుల ఇన్‌స్పెక్టర్ వెంటనే అయ్యగారి కారులో పశువుల ఆస్పత్రికి వెళ్ళాడు. దగ్గుతూ వెళితే కొంతసేపటికి ప్రియమైనట్టు పశువులను తీసుకొచ్చే అక్కడి ట్రక్కు చెడిపోయిందని తెలిసింది. పశువుల ఆస్పత్రి ముఖ్యాధికారి వ్యవహారం ప్రాముఖ్యత తెలుసుకుని "మిలిట్రీ పశువుల ఫారంలో ట్రక్కు ఉంది. నాకు తెలిసిన ఆయన ఒకడు అక్కడ ఉన్నాడు. ఆయనకు ఫోను చేస్తాను. మీరు కారులో మా మనుషులను తీసుకువెళ్ళి ఆయన్ను ట్రక్కు మాత్రమే అడగండి" అని సలహా ఇచ్చాడు. మిలిట్రీఫారం అక్కడినుండి పదిమైళ్ళ దూరంలో ఉంది. అక్కడికి వెళ్ళి ట్రక్కును తీసుకొచ్చి పశువుల ఇన్‌స్పెక్టర్ బంగళా చేరేసరికి రాత్రి పద కొండు దాటింది.

బంగళా వద్ద సందడి తగ్గడానికి బదులు ఎక్కువైంది. బంగళా బైట వృద్ధిచెందిన జనసమూహాన్ని అదుపులో ఉంచడానికి పోలీసు బందోబస్తు కూడ హెచ్చింది. పోలీసులు అడ్డుతున్నా కొంతమంది బంగళాలోకి చొరబడి ఉన్నారు. బైట శనక్కాయలు, సిగరెట్లు అమ్మేవాళ్ళు చేరి వ్యాపారం సాగిస్తున్నారు.

పశువుల ట్రక్కును చూసి జనంలో సంచలనం బైలుదేరింది. "ట్రక్కుకు దారి ఇవ్వండి" అని కొంతమంది అరిచారు. ట్రక్కు బంగళా గేటుముందు ఆగింది. ఇహ దాన్ని గేటులోకి జాగ్రత్తగా తీసుకువెళ్ళాలి.

ఇంతలో ఆవు యజమానురాలు కూడా బంగళాకు వచ్చింది. వస్తూ ఎందుకైనా మంచిదని ఆమె దూడని కూడ తోడు తీసుకువచ్చింది. దూడ తల్లిపాలకోసం ఆలమటించి అరుస్తోంది. దూడని చూడగానే ఆవు దిగ్గున లేచి నిల్చుని తోక ఝళిపించి దూడను నాకసాగింది. ఆవు యజమానురాలు దూడను నడిపించుకుపోగా వెంబడే ఆవుకూడా ఏమీ జరగనట్టు నడవసాగింది.

బంగళా యజమాని, యజమానురాలు, ఎస్.పి., ఆవు సొంతదారు ఇష్ట దేముళ్ళకు మనసారా నమస్కరించి కృతజ్ఞత చెప్పుకున్నారు. ఈ సంఘటన వలన కాస్త అదనపు డబ్బు చేసుకున్నందుకు వేరుశనగకాయలు, సిగరెట్లు అమ్మేవాళ్ళు ఆవును ఆశీర్వదించారు. ఇహ నిరాశ చెందినవాళ్ళెవరంటారా? రాజకీయవేత్తలు, పత్రికా విలేకర్లు, ప్రెస్ ఫోటోగ్రాఫర్లు.

---

# సీరియల్

# సౌందర్యదీపం

## ఆర్. సంధ్యాదేవి

(గత సంచిక తరువాయి)

### 50

జయరామ్, అంబికల పెళ్ళి అయి పదిరోజులు అవసాగింది.

వారి దాంపత్య జీవితం హాయిగా ఆనందంగా సాగిపోతుంది.

అంబిక హాస్పిటల్‌కి వెళ్ళి వస్తుంది. అటు వృత్తిధర్మం, ఇటు ఇల్లాలిగా తన బాధ్యత మర్చిపోలేదు. పది రోజుల్లో యింట్లో చాలా మార్పు వచ్చింది అనే చెప్పాలి.

గణేష్‌రావుగారిక్కూ తనపై మంచి నమ్మకం కుదిరేటట్టు ప్రవర్తించసాగింది.

అత్తగారికి, మావగారికి టానిక్‌లు టైముకి తీసుకోవాలని టేబ్లెట్స్ టైముకి వాడమని పదిసార్లు చెప్పేది.

ఆమె హాస్పిటల్ నుండి వచ్చేసరికి వాళ్ళు వేసుకోకపోతే తనే దగ్గర ఉండి వాళ్ళచేత ఆ టానిక్ తాగించేది.

"మేము బాగానే ఉన్నాం మాకు ఎందుకు మందులు" అని అంటున్నా వినేదికాదు.

"నేను డాక్టర్ని. నేను చెప్పినట్టు మీరు వినవలసిందే అని కచ్చితంగా చెప్పేది.

గణేష్‌రావుగారు దంపతులకి తృప్తిగా అనిపించసాగింది కోడలి ప్రవర్తన.

ఇంద్రసేనకి మాత్రం అంబిక అంటే మనసులో కోపంగానే ఉంది. అంబిక అసలు ఆ విషయం పట్టించుకోనట్టే ఉండేది.

గణేష్‌రావుగారు ఆమె హాస్పిటల్ గురించి మాట్లాడితే "అయినా నా పక్కన ఉంటే వందమంది కాదు వెయ్యిమంది కృష్ణమోహన్లు వచ్చినా నాకు భయంలేదు. నేను ఆ హాస్పిటల్‌లోనే డాక్టర్‌గా ఉంటాను. నన్ను ఎవరేం అంటారు" అంది. గణేష్‌రావుగారు కోడలి మాటలతో పొంగిపోయారు. జయరామ్ గర్వంగా చూశాడు.

అందరికి అంబిక ప్రవర్తనలో ఏ మాత్రం అనుమానం రాకుండా జాగ్రత్త పడింది.

రోజులు ఒక్కొక్కటే గడుస్తున్నాయి.

ఇంద్రసేన కోపం ఎన్నాళ్ళు ఉంటుంది? అంబిక అంటే ఆమెకు ఇష్టం లేకపోయినా అన్న భార్యగా మెల్లగా తన కోపం తగ్గించుకుని మామూలుగా ఉండ దానికి ప్రయత్నిస్తుంది.

* * *

అంబిక ఆ రోజు తొందరగా హాస్పిటల్‌కి వెళ్ళడానికి తయారవుతుంది.

ఫోన్‌లో మాట్లాడుతున్న గణేష్‌రావు గారి ముఖం అదోలా అయిపోయింది.

"అలాగా, ఇప్పుడు ఏమిటి చెయ్యాలి?" అంటూ ఆయన కంగారుపడ్తూ ఆవతలి వాళ్ళని అడుగుతున్నారు. అంబిక అటుగా వెళ్ళినా ఆయన కంగారుపడటం అంతగా గమనించలేదు.

ఆయన జయరామ్‌ని పిల్చి ఏదో చెప్పారు.

"ఉండండి వాళ్ళ పనిచెప్తాను అందర్నీ షూట్‌చేసి పారేస్తాను. అంతా వాళ్ళ ఇష్టమేనా? మీరేం కంగారుపడకండి" అంటూ ఒక్క ఉదుటులో మేడమీదకు వెళ్ళాడు టేబుల్‌వద్ద నిలబడి డ్రాయర్‌లో ఏదో తీసుకుంటున్న అంబిక తలతిప్పి భర్తవైపు చూసింది.

అతను ఆమెవైపు అసలు చూడలేదు మనిషి ఆవేశంతో ఊగిపోతున్నాడు.

"ఏమిటి అలా ఉన్నారు?" ఆత్రుతగా ప్రశ్నించింది.

అతను మాట్లాడకుండా బట్టలు మార్చుకుని కాళ్ళకు బూట్లు వేసుకో సాగాడు.

"ఇంత తొందరగా, బయలుదేరు తున్నారు ఏమిటి?" అడిగింది మళ్ళీ.

"ఉండు వాళ్ళపని చెప్పాలి" అన్నాడు బీరువాలో పిస్టల్ తీసుకుని జేబులో వేసుకుంటూ.

అంబిక గుండె ఒక్కసారి గుభేల్ మంది.

ఈయన వెళ్తున్నారు అంటే అక్కడ ఏదో రక్తపాతమే అవుతుంది.

"ఏం జరిగింది? ఎందుకు అంత ఆవేశ పడిపోతున్నారు? ఏమండీ? ఏం జరిగింది? ఆ పిస్టల్ ఎందుకు తీసుకువెళ్తున్నారు?

భర్త భుజాలపై రెండు చేతులువేసి గట్టిగా కుదిపి మరీ అడిగింది.

జయరామ్ జరిగింది టూకీగా చెప్పి బయలుదేరడానికి సిద్ధంగా ఉన్నాడు.

కంపెనీలో వర్కర్స్ మేనేజర్‌కి ఎదురుతిరిగి ఎవరూ పనుల్లోకి వెళ్ళలేదు అట.

జీతాలు పెంచటం లేదని గొడవ పెడ్తున్నారు అట.

అంబిక క్షణంసేపు అలా ఉండి పోయింది.

భర్త ఎటువంటివాడో తెల్సు. అక్కడికి వెళ్తే వర్కర్స్‌లో కొంతమంది ప్రాణాలు వదిలేశారు అన్నమాటే.

భర్తని అక్కడికి వెళ్ళకుండా ఆపు చెయ్యాలి. చెప్తే అతను వింటాడా?

అసలే మొండి మనిషి. కఠిన మనస్తత్వం.ఆవేశంలో ఉన్నాడు. అంబిక వెంటనే వెళ్ళి అతని చెయ్యి పట్టుకుంది.

"మీరు ఇప్పుడు అక్కడికి వెళ్ళవద్దు" అంది.

ఏమిటి అక్కడికి వెళ్ళవద్దా! అన్నట్టు చూశాడు.

"మీరు చాలా ఆవేశంలో ఉన్నారు. కాస్సేపు ఆగి శాంతంగా ఆలోచించి మీకు తోచింది చెయ్యండి" అంది అతనికి నచ్చచెప్తున్న ధోరణిలో.

"ఆలోచించేది ఏమీలేదు. వెళ్ళి వాళ్ళ సంగతి ఏమిటో తేలుస్తాను" అన్నాడు ఖచ్చితంగా చెప్తూ.

"అయితే మీరు ఇప్పుడు వెళ్ళడానికి వీల్లేదు" అంది అంతకన్న ఖచ్చితంగా చెప్తూ.

"నన్ను ఆపడానికి నువ్వు ఎవరు? బయటకుపో" అంటూ కోపంగా అరిచాడు.

"మీ భార్యని. మీరు అన్యాయాలకి బాటలువేసి మంచితనాన్ని సమాధివేసి అందరిచేత కఠినాత్ముడు అనిపించుకుంటే నేను భరించలేను. ఆ చెడ్డపేరు నా కంఠంలో ప్రాణం ఉండగా రానివ్వను" అంది ఆవేశంతో ఊగిపోతూ.

"నోర్మూయి. నీ ఉపన్యాసం వినడానికి నాకు తీరికలేదు" అంటూ ఆమె చేతిని బలంగా విదిలించేసుకున్నాడు, వెళ్ళడానికి సిద్ధపడ్తూ.

ఆమె ఊరుకోలేదు. మొండిగా అతనికి ఎదురుగా చేతులుచాపి అడ్డుగా నిలబడింది.

"మీరు వెళ్ళడానికి వీల్లేదు" అంది. ఆమె కంఠస్వరం కంగుమంది.

"దారికి అడ్డంలే."

"లేవను. మిమ్మల్ని ఇప్పుడు అక్కడికి వెళ్ళనివ్వను" అంది. అంబిక పట్టుపట్టింది అంటే ఆ పట్టు విడవదు.

"నా మీద నీ పెత్తనం ఏమిటి?" అంటూ ఆమె చెయ్యిపట్టి పక్కకు లాగేయబోయాడు.

అంతే ఆమెకు కోపం ముంచుకు వచ్చేసింది. భర్త చేతిని విసురుగా నెట్టేసింది.

జయరామ్‌కి కోపం ముంచుకు వచ్చేసింది. ఆపుకోలేని కోపంతో అతని చెయ్యి పైకి లేచింది. అంతే అంబిక చెంప ఛెళ్ళుమంది.

ఒక్కక్షణం నివ్వెరపోయినట్టు అయి అలా ఉండిపోయి మరుక్షణంలో తేరుకుని, భర్త చేతిని చటుక్కున అందుకుని బలం అంతా కూడదీసుకుని శక్తికొద్దీ అతన్ని సోఫావేపుకి నెట్టేసింది.

అతను అలా ఊహించుకోలేదేమో ఆమె తోసిన తోపుకి వెళ్ళి సోఫాలో కూలబడిపోయినట్టుగా కూర్చుండిపోయాడు.

మరుక్షణం తేరుకుని ఒళ్ళు తెలియని కోపంతో ఒక్క ఉదుటన లేచాడు.

ఈలోగా అంబిక మెరుపులా బయటకు పరుగెత్తి గదితలుపులు దగ్గరకు లాగేసి

బయట గడియవేసేసింది.

"తలుపు తీస్తావా! తియ్యవా!" అంటూ భార్యపైన గట్టిగా కేకలువేస్తూ కాలితో తలుపుపై గట్టిగా ఇల్లు అదిరిపోయేటంత శబ్దం వచ్చేటట్టు తన్నటం మొదలు పెట్టాడు.

అంబిక ఏ మాత్రం తొణక్కుండా ఒక్క మాట కూడా మాట్లాడకుండా అలా చేతులు కట్టుకుని నిలబడింది.

ఈ గొడవకి గణేష్‌రావుగారు సుభద్రమ్మ ఇంద్రసేన అందరూ 'ఏమిటి ఏమిటి' అంటూ ఆ గది దగ్గరకువచ్చేశారు.

వాళ్ళు అలా అడుగుతుంటే ఏమాత్రం తొణక్కుండా చాలా శాంతంగా చెప్పింది వాళ్ళకి.

"మీ అబ్బాయికి ఆవేశం ఎక్కువ ఆలోచన తక్కువ. పిల్లల్నికని పెంచగానే సరికాదు. వాళ్ళని క్రమశిక్షణలో తీర్చి దిద్దటం ముఖ్యం. మీరు ఆయనకి అతి గారాబం చేసి ఆ మాట మర్చిపోయాడు. ఇప్పుడు ఆయన మొండిగా రణమొండిగా తయారయాడు. క్రమశిక్షణలో తీర్చిదిద్దాలన్న మాట మీరు మర్చిపోయినా భార్యగా ఆయన్ని మంచిమార్గంలో పెట్టి తీర్చిదిద్దవలసిన బాధ్యత నాకు ఉంది. అందుకే ఇప్పుడు నేను ఆయనకంటే మొండిగా తయారయ్యాను. వర్కర్స్‌కి ఎదురు నిలిచి నిలబడటం అంత సులభంకాదు. వాళ్ళు కష్టజీవులు. డిగ్రీలతో వాళ్ళు డబ్బులు సంపాదించటంలేదు, చెమటోడ్చి కష్టపడి రక్తాన్ని ధారబోస్తున్నారు. మనం మంచిగా ఉంటే ఆ శ్రమజీవులు ప్రాణం ఇస్తారు. మనం వాళ్ళపట్ల కఠినంగా ప్రవర్తిస్తే ఏమాత్రం వెనకాడకుండా మన ప్రాణాల్ని తీస్తారు. వాళ్ళు ఈ లోకానికి సంఘానికి చట్టానికి ఎవ్వరికీ జడవరు. వాళ్ళకి కావలసింది హోదా, పరువు, మర్యాద కాదు. వాళ్ళకి కావలసింది పట్టెడు అన్నం. ఆ పట్టెడు అన్నంకోసం గంజినీళ్ళకోసం వాళ్ళు పోరాడుతారు. కాలుతున్న కడుపుమీద మండుతున్న గుండెలమీద కొట్టటం మన పెద్దింటి వాళ్ళ లక్షణం కాదు" అంది ఆవేశంగా.

అంబిక అన్యాయాన్ని సహించలేదు. కళ్ళతో చూస్తూ ఊరుకోలేదు. అమె తత్వమే అంత.

భర్తచేసే కొన్ని పనులు మామగారు చేసే కొన్ని పనులు అమెకు అసలు నచ్చటంలేదు.

వాళ్ళందర్నీ పూర్తిగా మార్చేయాలని ఆమె పట్టుదల. కోడలి ఆవేశం చూస్తూనే గణేష్‌రావుగారు, సుభద్రమ్మ ముఖ ముఖాలు చూసుకున్నారు.

గణేష్‌రావుగారికి ఒళ్ళు అంతా చెమట పట్టేసినట్టు అయిపోయింది.

ఇంత కచ్చితంగా ఇంత దర్జాగా చెప్తుంది అంటే అమ్మాయి చాలా ధైర్యవంతురాలు, తెలివయిన అమ్మాయి అని అనుకోక తప్పదు.

ఇలాటి అమ్మాయి కోడలిగా యింటికి వచ్చింది అంటే ముందు ముందుకి మంచి అవుతుందా? లేక? ఆయన గాబరాగా అదోలా చూస్తు ఆలోచనల్లో పడిపోయాడు.

ఆయనలా సుభద్రమ్మ గాబరాపడి పోలేదు. శాంతంగా ఒక్క క్షణం ఆలోచించింది. తలతిప్పి కోడలివైపు చూసింది.

ఇంత చిన్న వయసులో ఇంత పెద్ద ఆలోచన, గొప్ప మనసు ఇచ్చాడు ఆ భగవంతుడు ఈ అమ్మాయికి. అంబికను చూడగానే తను అనుకుంది ఆమె తన కోడలు కావాలని.

ఆమె ఈ యింటికి కోడలిగా వస్తే యిల్లు, యింటితోపాటు మనుష్యులుకూడా మారిపోతారని.

తను అనుకున్నట్టుగానే ఆమె ఈ యింటికి రాగానే ఆ విషయాన్నే అమల్లో పెడ్తోంది ముందుగా.

ఇంతకంటే ఆనందం తనకి ఏముంటుంది.

సుభద్రమ్మ కళ్ళల్లో ఆనందం తొణికిసలాడింది. పెదవులమీద చిరునవ్వు మెరిసింది.

ఇంద్రసేన మాత్రం ఆమె వైపు కోపంగా చూసింది. అన్నయ్యమీద అధికారం చెలాయించేటంత గొప్పదా ఈవిడ అన్నట్టు.

జయరామ్ గదిలో ఉండి పెద్దపెద్ద కేకలువేస్తూ తలుపులపై గట్టిగా తన్నుతూ గదిలో సామాన్లు చిందరవందర చేసెయ్యసాగాడు, భార్యమీద కోపంతో ఉద్రేకంతో.

అంబిక అతని ఎదుటపడితే చంపేసి రక్తం కళ్ళచూసేవాడు అంత కోపంతో ఉన్నాడు.

సుభద్రమ్మ తనని కానట్టు మౌనంగా ఉండిపోయింది.

గణేష్‌రావుగారు ఎటూ చెప్పలేక పోతున్నారు.

తనకంటే వయసులో బాగా చిన్నది అంబిక, ఏమైనా అంటే తనని ఏమని ఎదిరిస్తుందో? తనకేం బుద్ధులు చెప్పడానికి ప్రయత్నిస్తుందో? అందుకే ఆయన అలా ఉండిపోయాడు.

ఇంద్రసేన కల్పించుకుంటూ అంది. "ముందు తలుపులు తియ్యి. అన్నయ్యకు ఇంకా కోపం తెప్పించకు"

"తలుపులు తెరిచి ఏంచెయ్యమంటావు?" అడిగింది ఆడపడుచు వైపు కోపంగా చూస్తూ.

"అందుకని మా అన్నయ్యను గదిలో పెట్టి బంధించి ఉంచుతావా?" ఇంద్రసేన రెచ్చిపోతూ అడిగింది.

"మీ ... అన్నయ్యా!...." అంటూ వెటకారంగా నొక్కి మరీ అడిగింది.

ఇంద్రసేన ఆమెను మింగేసేటట్టు చూసింది.

"మగవాడికి పెళ్ళికానంతవరకు తల్లి, చెల్లెలు. పెళ్ళి అయ్యాక ...." అంటూ

అడపడుచుకు ముఖంలోకి సూటిగా చూసింది క్షణంసేపు.

"పెళ్ళి అయ్యాక మొదటిస్థానం భార్యదే అవుతుంది." గర్వంగా ఏమాత్రం తొణక్కుండా చెప్పింది.

"అయితే తల్లి చెల్లెళ్ళు ఏం కారన్న మాట" అంది ఇంద్రసేన రెచ్చిపోతూ.

"అయితే నీ పెళ్ళి అయ్యాక కూడ నీ భర్తకి నీవు ఏమీకావు అన్నమాట. అతని తల్లి చెల్లెలికే మొదటి స్థానం ఉంటుంది అన్నమాట, అవునా!" దర్జాగా తలపైకెత్తి నిర్లక్ష్యంగా చూస్తూ అడిగింది.

ఆ మాటలకి ఇంద్రసేన కంగు తిన్నట్టు అయింది. రెప్పలార్చకుండా అలా చూస్తూ ఉండిపోయింది.

"ఏం అలా ఉండిపోయావు! ఇప్పుడు అర్థంఅయిందా ఇల్లాలి స్థానం ఏమిటో! మాట్లాడకుండా అలా కూర్చో. చిన్నపిల్లవి అన్ని విషయాల్లో తలదూర్చకు. పెళ్ళి అయ్యాక ఒకళ్ళ యింటికి వెళ్ళిపోవలసిన పిల్లవు ఈ యింటి విషయాల్లో తల దూర్చకు" అంటూ కచ్చితంగా చెప్పేసింది.

"డాడీ" అంది ఇంద్రసేన గొంతు చించుకుంటూ. ఆమె మనసు మండుకు పోతుంది.

గణేష్‌రావుగారు ఒక్క క్షణంపాటు అలా ఉండిపోయారు కూతుర్ని అలా అనటం ఆయనకు నచ్చలేదు.

తనకి గారాల కూతురు. అమ్మాయిని ఎవరైనా ఏమైనా అంటే తను సహించ లేడు.

ఇప్పుడు అమ్మాయిని అంటున్నది ఎవరో కాదు. కోడలు. ఆమెను ఏం అనలేడు.

కోడలువైపు క్షణంసేపు చూసి కూతురికి ఏం సమాధానం చెప్పలేనట్టు అక్కడనుండి మెల్లగా అవతలకు వెళ్ళి పోయాడు.

సుభద్రమ్మ భర్త అలా వెళ్ళిపోవటం చూసి తను అక్కడ ఉండటం మంచిది కాదని అక్కడనుంచి మెల్లగా ఆవిడ కూడా వెళ్ళిపోయింది.

తను అనుకున్న విషయంలో కోడలు తప్పకుండా విజయం సాధిస్తుంది అని గట్టినమ్మకం ఏర్పడిపోయింది ఆవిడకు.

తల్లీ తండ్రి తమకి ఏం పట్టనట్టు మౌనంగా అక్కడనుండి వెళ్ళిపోవ టంతో దెబ్బతిన్నట్టు అయింది ఇందు. అంబిక ఆమెవైపు చూసి అదోరకంగా నవ్వింది. చూశావా నా మాట అంటే ఎలా వెళ్ళిపోయారో అన్నట్టు ఉంది ఆనవ్వులో అర్థం.

ఇంద్రసేనకి ఒళ్ళు మండిపోయింది. పెళ్ళి అయి సంవత్సరం కూడా పూర్తి అవలేదు.

అప్పుడే అంత అధికారం చెలా యిస్తుందా!

తను ఎవరు అనుకుంటుంది!

అత్తగార్ని మామగార్ని మాట మాట్లాడకుండా చేస్తుందా!

ఎంత పొగరు! ఇంద్రసేన పళ్ళు పటపట లాడించింది.

"నీ పెత్తనం ఏమిటి! తలుపులు నేను తెరుస్తాను." అంటూ విసురుగా అడుగు ముందుకు వేసింది.

అంతే అంబిక అడుగు ముందుకువేసి ఆడపడుచు చేతిని చప్పున పట్టుకుంది.

"ఏమిటి నీ మొండితనం! నేను ఎందుకు ఈపని చేశానో నీకు అర్థం కాలేదా! నీ అన్నయ్యమీద నీకే అంత ప్రేమ ఉంటే నా భర్తమీద నా కెంత ప్రేమ ఉండాలి! ముందు నువ్వు ఇక్కడ నుండి వెళ్ళు ఇవతలికి" అంటూ కోపంగా అరిచింది.

అంతకన్నా గట్టిగా గొంతు చించుకుని మరీ అరవాలనుకుంది ఇంద్రసేన.

"ఇందూ!" తండ్రి కంఠస్వరం శాంత గంభీరంగా వినిపించింది.

తలతిప్పి అటుచూసింది ఇంద్రసేన. గణేష్‌రావుగారు హాలులో గుమ్మం వద్దనిలబడి కూతురివైపే చూస్తూ అన్నారు.

"వదిన చెప్పినట్టు చెయ్యి. నువ్వు నీ గదిలోకి వెళ్ళు."

ఆయన మెల్లగానే చెప్పినా ఆజ్ఞాపించి నట్టే ఉంది. ఆ ఆజ్ఞకి తిరుగులేదు అన్నట్టు చెప్పి అక్కడ నుండి వెళ్ళి పోయాడు.

ఇంద్రసేన ఒక్కక్షణం అలా ఉండి పోయి అక్కడనుండి గబగబ వెళ్ళి పోయింది. అవమానంతో, తనమాట చెల్ల లేదు అన్న ఉక్రోషంతో, కళ్ళనీళ్ళు సుడులు తిరగసాగాయి.

గణేష్‌రావుగారు అంబికను హాలులోకి కబురుచేసి అడిగాడు.

"అక్కడ గొడవ జరుగుతుంది. సాయంత్రం అయిదు గంటలలోగా వెళ్ళాలి. నువ్వా అమ్మాయిని వెళ్ళనివ్వటం లేదు. ఇప్పుడు ఏం చెయ్యాలి!"

అంబిక మామగారి మాటలు వింటూనే ధీమాగా నవ్వి మెల్లగా చెప్పింది.

"నేను వెళ్ళి వర్కర్స్‌కి నాకు తోచినట్టు నేను చెప్పి వస్తాను. మీరు ఏం ఆలోచించి మనసు పాడుచేసు కోకండి."

"నువ్వు వెళ్తావా! వాళ్ళు అసలే మంచి వాళ్ళు కారు" ఆయన కంగారుపడ్డారు.

"మంచివాళ్ళు కారు అంటే...." అంటూ నవ్వింది.

"వాళ్ళూ మనుష్యులే కదా మావయ్య గారూ! కడుపు మండిపోయి వాళ్ళు అలా రెచ్చిపోతున్నారు. వాళ్ళకి నీడను ఇచ్చే వాళ్ళు మనం అయినప్పుడు మనల్ని కాక ఇంకెవర్ని అడుగుతారు!"

గణేష్‌రావుగారు అలా ఉండిపోయారు. కోడలికి ఏం సమాధానం చెప్పలేదు.

"మీరు ఉండండి నేను వెళ్తాను." అంటూ చెప్పి బయలుదేరి వెళ్ళేముందు అత్తగారికి చెప్పి వెళ్ళింది.

"ఆయన గదితలుపులు మాత్రం తీయకండి. భోజనం చెయ్యకపోయినా ఫర్వాలేదు. మంచినీళ్ళు కావలిస్తే కిటికీలోనుండి ఇవ్వండి. సాయంత్రం పడుకుని నిద్రలేచాక ఎనిమిది గంటలకి తలుపు తియ్యండి. అప్పటికి చల్లబడతారు. తిక్క వదిలిపోతుంది."

సుభద్రమ్మ తల ఊపింది. కొడుక్కి భోజనం పెట్టకుండా తల్లి మనసు ఒప్పదు. కొద్దిగా బాధపడినట్టు అయింది. అయినా కోడలు చెప్పినట్టు చెయ్యాలి తప్పదు అనుకుని తల ఊపింది అలాగే అన్నట్టు.

అంబిక వెళ్ళిపోయింది. ఆమె వెళ్ళి మధ్యాహ్నం యింటికి రాలేదు. ఫోన్ కూడా చెయ్యలేదు. మధ్యాహ్నం యింట్లో ఎవరూ భోజనం చెయ్యలేదు. అక్కడ గొడవ ఎలా ఉందో అని ఒకవైపు బెంగ, కోడలుయింకా యింటికి రాలేదు అని బెంగ. మేనేజరుకి ఫోన్‌చేసినా రింగ్ అవుతుందేమోగాని అక్కడ ఎవరూ రిసీవర్ ఎత్తటంలేదు.

గణేష్‌రావుగారిక్కి వెళ్ళాలి అంటే మనసు గుబగుబలాడుతుంది.

జయరామ్ గదిలో అరిచి అరిచి పడుకుని నిద్రపోయాడు. సుభద్రమ్మ ఏడు గంటలు అవుతుండగా వెళ్ళి తలుపులు తీసింది.

జయరామ్ కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి.

"మీ కోడలు తలుపులు తెరవద్దు అందా!" కోపంగా అడిగాడు.

"అదికాదు బాబూ...." అంటూ శాంతంగా కొడుక్కి నచ్చచెప్పబోయింది.

"మీ తప్పు ఏంలేదు, నాకు తెలుసు. అంబిక ఎక్కడ!" పళ్ళు పటపట కొరికాడు.

అతనిలో ఆగ్రహావేశాలు చల్లారలేదు అతని భయంకరరౌద్రస్వరూపంలో మార్పు రాలేదు.

కళ్ళల్లో ఎర్రజీరలు అలుముకున్నాయి. కళ్ళు, కళ్ళతోపాటు ముఖం కూడా ఎర్రబడిపోయింది.

సుభద్రమ్మ కొడుకువైపు చూస్తూనే భయపడింది. "హాస్పిటల్‌కి వెళ్ళింది ఇంకా రాలేదు. వస్తుంది" అంది మెల్లగా.

"రానీ, నరికి పోగులు పెడ్తాను. నన్ను గదిలో పెట్టి బంధిస్తుందా! నాకు నీతులు బోధిస్తుందా! ఈ జయరామ్ అంటే ఎవరు అనుకుంటుంది! నరులకి నరరూప రాక్షసులకి జడిసిపోయే పిరికివాడ్ని కాదు. నేను అనుకున్నది సాధించటంకోసం పచ్చినెత్తురు త్రాగి అయినా విజయం సాధిస్తాను"

"జయా!" అంది తల్లి కంగారుపడుతూ.

గణేష్‌రావుగారు అక్కడికి వచ్చారు కొడుక్కి నచ్చచెప్పడానికి.

జయరామ్ ఎవరి మాటా వినే స్థితిలో లేడు అంబిక ఎప్పుడు వస్తుందా, ఆమెను పీకనులిమి చంపేద్దామన్నంత కసి, కోపం అతనిలో చెలరేగిపోసాగాయి.

అతని దగ్గరకు తల్లి తండ్రి ఎవరూ వెళ్ళ సాహసించలేకపోతున్నారు.

"ముందు భోజనం చెయ్యి బాబూ" అంది ఆవిడ.

"భోజనం హుం .... " అంటూ కటువుగా నవ్వాడు. ఆ నవ్వు ఎవరికైనా భయంకరంగా అనిపిస్తుంది. సుభద్రమ్మ గణేష్‌రావుగారు ముఖముఖాలు చూసుకున్నారు కొడుక్కి ఎలా నచ్చచెప్పటమా అని.

కొడుకుని చూస్తుంటే అంబికను ఈ రోజు బ్రతకనివ్వడు ప్రాణం తీస్తేనేగాని అతని మనసు చల్లబడదు అనిపించసాగింది.

ఎలా! అంబికను ఈ రోజు యింటికి రానివ్వకుండా ఆపటం ఎలా అనుకున్నారు ఆ దంపతులు.

ఇంద్రసేనకి అన్నగారి ఆవేశం చూస్తూనే ఆమెకు సంతోషంగా అనిపించింది.

ఈ దెబ్బతో ఆవిడగారి అధికారం దర్జా ఎగిరిపోతాయి. దెబ్బకి పిల్లి అయి ముడుచుకుపోయి మూల కూర్చుంటుంది అనుకుంది.

ఆమెకు మనసులో పట్టరాని సంతోషంగా అనిపిస్తుంది.

గణేష్‌రావుగారు అంబికను ఆ రోజు యింటికి రావద్దు అని చెప్పటంకోసం హాస్పిటల్‌కి, తెలిసినవాళ్ళకి అందరికీ ఫోన్లుచేశారు అంబిక ఉందేమో అని. ఎవరూ ఆమె అక్కడ లేనట్లు చెప్పారు.

గణేష్‌రావుగారు దంపతులు చేసేది లేక అలా ఉండిపోయారు.

జయరామ్ చేతులు కట్టుకుని ఆమె రావటంకోసం ఎదురుచూస్తూ హాలులో పచార్లు చెయ్యసాగాడు. అతని కోపం ఆవేశం చూస్తూనే గణేష్‌రావుగారు దంపతులు అనుకున్నారు.

ఈ రోజుతో అంబిక ఆయుష్షు తీరిపోయింది.

జయరామ్ మాట వినేరకం కాదు.

ఈ యింట్లో ఈ రోజు అంబిక శవం వెళ్ళిపోతుంది అని నిశ్చయించుకుని కోడలు ఏ క్షణాన్న వస్తుందో అని బెంగపడి భయపడిపోతూ అరిచేతిలో గుండెలు పెట్టుకుని అంబిక రాకకోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు, ఆ దంపతులు. ఇందూ చూస్తుంది.జయరామ్ సరేసరి ఆమె రావటంకోసంచూస్తున్నాడు

(సశేషం






పెళ్ళిపందిరి కలకలలాడుతూంది....

ఎత్తుగా కట్టిన కల్యాణమంటపంలో వధూవరులు బొమ్మల్లా అలంకరించుకుని కూర్చున్నారు. పురోహితులు ఆపకుండా వేదాలు వల్లిస్తున్నారు. మధ్యమధ్యలో మేళాలవాళ్ళు మేమూ వున్నామంటూ ఆ ప్రదేశమంతా దద్దరిల్లిపోయేటట్టు బ్యాండ్ వాయిస్తున్నారు.

మంగళ సూత్రధారణ సమయం వచ్చింది.

పెళ్ళికూతురు సిగ్గుల మొగ్గయి తల వాల్చుకు కూర్చుంది.

పెళ్ళికొడుకు క్రీగంట చూడటం మానలేదు.

పురోహితుడు అందించిన మాంగల్యం అందుకుని లేచి నిలబడ్డాడు.

ఇంతలో....

"అమ్మా!.... అమ్మా" అని అరుచుకుంటూ పదిపన్నెండేళ్ళ కుర్రవాడు గేటులోంచి పరిగెత్తుకొస్తున్నాడు.

అందరూ వింతగా ఆ కుర్రవాడి వేపే చూడసాగారు.

పురోహితులు మంత్రాలు ఆపేసి ఇటే చూస్తున్నారు.

మాంగల్యం కట్టటానికి వంగబోతూ ఆగిపోయాడు పెళ్ళికొడుకు.

ఆ పిల్లవాడు సరాసరి వధువు కూర్చున్న వేపుకు వచ్చి,

"అమ్మా!" అంటూ దీనంగా చూస్తూ నిలబడ్డాడు.

ఆ కుర్రవాడి దుస్తులు చిరిగిపోయి మట్టికొట్టుకుని వున్నాయి. తలంతా దుమ్ము కొట్టుకుని ఏ ఫకీరువెధవో అన్పిస్తున్నాడు.

ఆ అబ్బాయి ఎవర్నీ చూడటంలేదు.

పెళ్ళికూతురునంకే చూస్తూ "అమ్మా, అమ్మా" అంటున్నాడు.

పెళ్ళికూతురు దిమ్మెరపోయి వాడి వంకే చూస్తోంది.

తన తమ్ముడి వయసున్న ఆ పిల్లవాడు తనని అమ్మా అని సంబోధిస్తుంటే చూసేవారికందరికీ విడ్డూరంగానే వుంది.

పెళ్ళికొడుకు ఆలోచనగా చూస్తున్నాడు....

ఆ పిల్లవాడు పెద్దవాడే కావచ్చు.... కానీ, తన కాబోయే భార్య వయసు ఏమంత తక్కువేమీ కాదు...

కళ్ళు క్రిందికి దించి పెళ్ళికూతురు వేపు చూశాడు సంగతేమిటన్నట్టు....

ఆ అమ్మాయి అయోమయంగా చూస్తోంది.

ముందుగా తేరుకున్నది పెళ్ళి కుమార్తె తండ్రి రఘురామయ్య. ఆయనకి జరగనున్న ప్రమాదం వెంటనే స్ఫురణకొచ్చింది.

"ఏయ్, ఎవడ్రా నువ్వు? ఫో బయటకు" అన్నాడు గద్దిస్తూ.

ఆ పిల్లవాడు అటువేపే చూడలేదు.

వాడి చూపులన్నీ పెళ్ళికూతురుమీదే వున్నాయి.

"అమ్మా, అమ్మా" అంటున్నాడు కన్నీళ్ళతో.

పెళ్ళివారంతా ఈ విపరీతాన్ని ముద్కున వేలేసుకుని చూస్తున్నారు నిశ్శబ్దం అంతటించి నెమ్మదిగా గుసగుసలు బయల్దేరాయి.

అంతా గమనిస్తూనే వున్నాడు రఘురామయ్య

అతను కోపంతో పిచ్చివాడయ్యాడు. పిల్లవాడిని రెక్కపుచ్చుకుని బయటకు ఈడ్చుకు వెడుతూ-

"వెధవా, ఎవడ్రా అమ్మ? ఇంకోసారి ఆ కూత కూశావంటే పళ్ళు రాలగొడ్తాను ఫో బయటికి...." గేటుదాకా ఈడ్చుకెళ్ళాడు. వాడు ఇంకా వెనక్కి వెనక్కి చూస్తూ-

"అమ్మా, అమ్మా" అని ఏడుస్తూనే వున్నాడు.

రఘురామయ్య నిర్దాక్షిణ్యంగా ఆ కుర్రవాణ్ణి గేటుబయట వదిలి అక్కడ వున్న నౌకరుతో "వీణ్ణి దూరంగా వదిలేసిరా. ఎవరో పిచ్చివాడిలాగున్నాడు

...." అని నుదుటపట్టిన చెమట తుడుచుకుంటూ పెళ్ళిపందిట్లోకి వచ్చాడు.

అంతా నిశ్శబ్దం అయిపోయింది ఒక్క క్షణం.

ఎవరూ ఏం మాట్లాట్టానికి సాహసించ లేకపోయారు.

ముందుగా తేరుకున్నది రఘురామయ్యే....

అనవసరంగా నవ్వుతూ, "ఎవరో పిచ్చివాడిలాగున్నాడు పాపం!" అన్నాడు ఎవర్నీ వుద్దేశించి కాకుండా.

మంత్రాలు చెప్పే బ్రాహ్మడు ఇప్పటికి షాక్ నుండి తేరుకున్నాడు. తిరిగి తన మామూలు ధోరణిలో బిగ్గిరిగా మంత్రాలు చదవసాగాడు.

పెళ్ళికొడుకు తండ్రి ఒక్కసారి వులిక్కిపడ్డాడు. ఆయన మొహం గంభీరంగా మారిపోయింది.

"ఆపండి" అన్నాడు సాధ్యమైనంత బిగ్గరగా,

రఘురామయ్యగారు తెల్లబోయి చూశారు.

ఆయనకు మాట్లాడే అవకాశం యివ్వకుండా, కొడుకు దగ్గరగా వచ్చి,

"లేచి రా...." అని వియ్యంకుడి వేపు తిరిగి,

"క్షమించండి. మరో ముహూర్తం పెట్టుకుందాం. ఈలోపున ఆ కుర్రవాడి సంగతేమిటో కనుక్కోండి...."

రఘురామయ్యకి విషయం ఏమిటో అర్థమైపోయింది. ఆయన మొహం దీనంగా మారింది.

"అంటే.... అంటే...."

"అదంతే. ఆ పిల్లవాడు పిచ్చివాడు కాదని నా నమ్మకం...."

మిన్ను విరిగి మీదపడినట్టయింది కన్యాదాతకి. వియ్యంకుడి దగ్గరగా వచ్చి చేతులు పట్టుకుంటూ,

"మీకిదేమన్నా భావ్యంగా వుందా? ఆ బికారి వెధవేదో వాగాడని అర్ధాంతరంగా పెళ్ళిఆపి నా కూతురు బ్రతుకు గంగపాలు చేస్తారా? ఒక్కసారి వివేకంతో ఆలోచించండి...." ఆయనెంత నిదానంగా మాట్లాడాలనుకున్నా మాటలు వాడిగా వచ్చాయి.

"ఆలోచించవలసింది ఏమీ లేదు.... లేచి రారా" అని హూంకరించి ముందుకు కదిలాడు.

పెళ్ళికూతురు మొహానికి చేతులు కప్పుకుని లోపలికి పరిగెత్తింది.

మరునిమిషంలో పెళ్ళిపందిరి నిర్మానుష్యమైపోయింది.

* * *

సూర్యుడు పడమరకి వాలిపోతున్నాడు.

హైదరాబాద్ వీధులన్నీ జనసందడితో వచ్చేపోయే వాహనాలతో రద్దీగా వున్నాయి.

ఎత్తుగా కొండమీద కట్టబడివున్న వెంకటేశ్వరస్వామి ఆలయం నుండి బయటకు వచ్చారో పడుచుదంపతులు. క్రింద నిలిచివున్న కారువేపు నడిచారు.

"కమాన్ కుసుమ....ఏమలా నిలబడి పోయావు?" వెనక్కి తిరిగి చూసి ఆమె చూపుల వెంబడి తన దృష్టిని పోనిచ్చాడు. అప్పటికే పరుగుపరుగున పదిసంవత్సరాల పిల్లవాడు, "నాన్నా.... నాన్నా" అంటూ వస్తున్నాడు.

కుసుమ ఆశ్చర్యం నిండిన కళ్ళతో ఆ కుర్రవాడి వంకే చూస్తున్నది. ఆ పిల్లవాడు దగ్గిరగా వచ్చేశాడు.

"నాన్నా....నన్ను నీతో తీసికెళ్ళు.... నన్ను మనింటికి తీసుకువెళ్ళు...." అని ఏడవసాగాడు.

కుసుమ ప్రశ్నార్థకంగా చూసింది భర్త మొహంలోకి.

అతను అయోమయంగా చూస్తున్నాడు ఆ కుర్రాడి వేపు.

"ఎవర్రా నీకు నాన్న.... ఎవరు నువ్వు?" అన్నాడు గద్దిస్తున్నట్టు.

"నువ్వే మా నాన్నవి. నన్ను తీసు కెళ్ళు...." తిరిగి ఏడవటం ప్రారంభిం చాడు, దగ్గరగావచ్చి చొక్కా లాగుతూ...

అతను వ్యగ్రుడై పోయాడు.

"పోరా, రాస్కెల్. ఎవరనుకుని నా వెంటపడుతున్నావో.... నువ్వు రా కుసుమా, ఈ దరిద్రగొట్టుతో మనకేమిటి?" అన్నాడు కారువేపు నడుస్తూ.

కుసుమ కదలలేదు.

కుర్రవాడివేపు ఆలోచనగా చూస్తూ, "నీకు ఆయనే మీ నాన్నని ఎవరు చెప్పారు." అతను కుసుమ మాటలకి వెనక్కి తిరిగి వచ్చాడు.

"ఏమిటి కుసుమా, ఆ పిచ్చివాడితో నీకేమిటి?" అన్నాడు చిరాకుగా.

కుసుమ అతని మాటలకి జవాబివ్వ లేదు.

"చెప్పు.... ఆయన నీకు తండ్రి అని ఎవరు చెప్పారు."

అతనికి మరింత కోపం వచ్చింది.

"కుసుమా, నా మాట వింటావా, లేదా?" అంటూ ఆమె చెయ్యి పుచ్చుకుని బలవంతాన లాక్కెళ్ళి కారులో కూలే శాడు. కుసుమ మాట్లాడలేదు. పెదిమలు బిగబట్టి ఆలోచిస్తూంది.

వెనకనుండి ఆ పిల్లవాడి అరుపులు అస్పష్టంగా వినబడుతున్నాయి. కారు దూరమవుతుంటే....

"నాన్నా.... నాన్నా...."

కుసుమ ఇంటికి వచ్చాక మౌనంగా వుంది.

అతనదేమీ పట్టించుకున్నట్టు లేదు.

మామూలుగా కూనిరాగాలు తీసు కుంటూ బట్టలు మార్చుకున్నాడు.

"వడ్డించవోయ్.... ఆకలేస్తూంది.." అన్నాడు.

కుసుమ ఈ లోకంలో లేనట్టుగా బట్టలయినా మార్చకుండా చెంపకి చెయ్యి చేర్చుకుని ఆలోచిస్తూంది.

అతను ఆమె దగ్గరగా వచ్చాడు.

ఆమె అతనివంక కళ్ళెత్తి చూసింది.

"ఏమిటి కుసుమా, అలా వున్నావు?"

"ఏమీలేదు...." అని ఒక్క క్షణం ఆగి,

"ఆ పిల్లవాడు నిజంగా మీకు తెలియదా?"

అతను ఒక్క క్షణం కనుబొమలు ముడిచి మళ్ళీ మామూలుగా అయిపోయాడు.

"ఓహో....నువ్వింకా అదే ఆలోచిస్తున్నావా? ఎవరో మూర్ఖుడు ఏదో వాగాడని అదే పట్టుకూర్చుంటావా?"

కుసుమ తల అడ్డంగా వూపింది.

"ఆ అబ్బాయి అంత గుర్తు పట్టినట్టు "నాన్నా" అని పిలుస్తుంటే...." కుసుమ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"కుసుమా, చదువుకున్నదానివి. ఇంత అవివేకంగా మాట్లాడతావనుకోలేదు. నీ వుద్దేశం ఏమిటి?" అతను తీవ్రంగా చూశాడు.

కుసుమ మాట్లాడలేదు.

ఆమె మౌనం అతనికి అంతా విప్పి చెప్పినట్టయింది.

కోపంగా అన్నాడు.

"అంటే, ఆ అబ్బాయికి నేనే తండ్రి నంటావా? ఛీ....ఛీ.. ఇంత మూర్ఖురాలి వనుకోలేదు. ఇన్నాళ్ళు నన్ను అర్థం చేసుకున్నదింతే...." గదిలోకి వెళ్ళి విసురుగా తలుపులు వేసుకున్నాడు.

కుసుమ కన్నీళ్ళతో అలాగే కూర్చుంది.

* * *

....పాకలోకి వర్షపు నీరు ధారలుగా పరిగెడుతోంది. లోపల మినుకుమినుకు మంటూంది దీపం....

ఏడెనిమిదేళ్ళ పిల్ల కునికిపాట్లు పడుతూ కూర్చుంది. పాకలోకి ఎవరో వచ్చినట్టు అలికిడయి కళ్ళువిప్పిచూసింది.

"అన్నా.... ఆకలేస్తోంది...." కడుపు వైపు చేయిపెట్టి చూపిస్తూ దీనంగా అడిగింది.

ఆ పిల్లవాడికి పదేళ్ళకన్నా ఎక్కువ వయసుండదు....

చేతిలోవున్న ఖాళీగావున్న గిన్నె క్రింద పడేసి—

"ఏమీ దొరకలేదు చెల్లాయి...." అంటూ అక్కడే చతికిలబడ్డాడు. ఆ పిల్ల ముడుచుకుపోతూ కూర్చుంది. చలికి వేళ్ళు కొంకర్లుపోతున్నాయి.

బయట కుక్కపిల్ల వానకి తడుస్తూ మధ్య మధ్య కీచుకీచు మంటూ అరుస్తూంది.

మధ్యరాత్రి మెలకువ వచ్చింది మీద చినుకులు పడటంతో.... పక్కకి తిరిగి చెల్లెలివంక చూశాడు....

ఆ అమ్మాయిలో ఎక్కడా చలనం లేదు....

ఆకలికి తట్టుకోలేక పోయివుంటుంది అనుకున్నాడు.

ఎట్లాగయినా రేపు తినటానికేదయినా తెచ్చివ్వాలి చెల్లాయికి అనుకున్నాడు, ఆమె వంకే చూస్తూ.



ఆ అమ్మాయి మధ్యమధ్య వణుకుతోంది. తన చొక్కా విప్పి వంటిమీద కప్పాడు.

తను ముడుచుకు కూర్చున్నాడు తెల్లవార్లూ ఆ పిల్లవంకే చూస్తూ.... అట్లా చూస్తూ కూర్చుంటే లీలగా ఏవో గత స్మృతులు జ్ఞాపకానికి రాసాగాయి.... అమ్మా, నాన్న వున్నరోజులు.... అప్పు

డెంతబావుండేది.... అనుకున్నాడు. ఈ మాట రోజుకోసారి అనుకుని తృప్తిపడ తాడు. ఆ రోజులన్నీ తనకు జ్ఞాపకం వున్నంతవరకూ చెల్లెలికి చెప్పి ఆనంది స్తూంటాడు....

అమ్మా, నాన్నా ఎంత సంతోషంగా ఉండేవారు.

తనని ఎంత ప్రేమగా చూసుకునే వారు.... చెల్లి పుట్టింది. నాన్నలో మార్పు మొదటిసారి చూశాడు. ఇంటికి రాగానే అమ్మమీద విసుక్కోవటం గుర్తుంది.... తర్వాత ఏమైంది? ఎందుకో తెలీదుగానీ అమ్మ ఎప్పుడూ దిగులుగా తననీ, చెల్లా యినీ దగ్గర కూర్చోబెట్టుకుని కన్నీళ్ళు కారుస్తూ వుండేది. తను చిట్టి చేతులతో అమ్మ కన్నీళ్ళు తుడుస్తుంటే ఆమె దుఃఖం మరింత ఎక్కువయేది ఒకరోజు హఠాత్తుగా నాన్న యింటికి రాలేదు. తను ప్రతిరోజూ అడిగేవాడు అమ్మని నాన్న కోసం అమ్మ కన్నీళ్ళు కార్చేది తప్ప జవాబు చెప్పేదికాదు.... తర్వాత అమ్మా తనూ చెల్లి వుండేవారు...

ఒకరోజు లాల్చీ, పైజమా వేసు కున్న పెద్దమనిషి వచ్చాడు.

తను నిద్రపోలేదు. అమ్మ ముందు గదిలో ఎందుకో అతన్ని బ్రతిమాలు కుంటోంది.

ఎవరాయన?

అమ్మ ఎందుకు ఆయన్ని బ్రతిమా లాలి? ఈ ప్రశ్నలకి జవాబులు ఈనాడు తనకు తెలీలేదు.

ఆయన వెళ్ళిపోయాడు.

అమ్మ ఏడుస్తూ తన పక్కలో పడుకుంది.

తర్వాత ఇంట్లో ఎంతో కష్టమయింది. తిండికి కూడా వుండేదిగాదు.

ఒకరోజు ఆ లాల్చీ ఆయన మళ్ళీ వచ్చాడు.

ఈసారి అమ్మ మొహంలో కోపం, బాధ ఏమి లేవు.... కానీ ఆ మొహం చూడాలంటే భయంవేసేది....

అమ్మ ఒకరోజు చాలా దిగులుగా కనిపించింది.

తనని దగ్గరగా కూర్చోబెట్టుకుంది కన్నీళ్ళు కారుస్తూ....

మర్నాడు అమ్మ ఇంట్లో కనిపించ లేదు....

తను ఎంత ఏడిచాడు.

చెల్లాయికి ఏమీ తెలీదు. తను ఏడుస్తుంటే అదీ ఏడిచింది.....

* * *

వర్షం పెద్దదయింది.

గాలికి చెట్లు వూగిపోతున్నాయి.

పాక ఏ క్షణాన్నయినా కూలిపోవ టానికి సిద్ధంగా వుంది.

తెల్ల తెల్లవారుతుండగా,

కొద్దిగా నిద్రపట్టిందేమో, తటాలున మెలకువవచ్చి చెల్లి వేపు చూశాడు. ఆపిల్ల కదలక మెదలక పడివుంది.

ఎంత పొద్దెక్కినా ఆ అమ్మాయి అలాగే పడుకునివుంది.

పక్కనే తనతోపాటు ముష్టెత్తుకు తిరిగే మరో పిల్లవాడిని కేకేసి తీసుకొచ్చాడు.

వాడు ఆ పిల్లని ముట్టుకుని చూశాడు.

"అరే, మీ చెల్లి చచ్చిపోయింది. నీకు తెలీలేదా? వళ్ళు ఇంత చల్లగా వుంటే చచ్చిపోయినట్టు అర్థం...."

ఆ పిల్లకి తనే అన్నయ్య కాబట్టి అన్నీ తనే చెయ్యాలి....

స్నేహితుడి సలహా ప్రకారం దొడ్లో గొయ్యితవ్వారు ఇద్దరూ కలిసి.

చెల్లెల్ని ఎత్తుకెళ్ళి ఆ గోతిలో పెట్టి మన్ను కప్పేశాడు....

చేతులు కడుక్కొని లోపలకు వచ్చేశాడు.

చెల్లెలు పడుకున్న చోటుని అయోమయంగా చూశాడు ఒక్కక్షణం....

బయటకు వెళ్ళిపోయాడు....

మళ్ళీ వాడు ఆ గుడిసెలోకి రాగా చుట్టుపక్కలవారెవరూ చూడలేదు.

"అమ్మా.... అమ్మా...."

కారులో నుండి తల బయటకు పెట్టి, "ఛో.... ముష్టివెధవా...." అని దోరు వేసేసి కారు స్పీడుగా పోనిచ్చాడో పెద్ద మనిషి.

"నాన్నా.... నాన్నా...."

"ఛీ.... వాణ్ణి బయటకు తన్ని తగలెయ్యండి." రంకెలేశాడో సూటువాలా.

"ఎవరో పిచ్చివాడు పరిగెత్తుతున్నాడు. పట్టుకోండి.... పట్టుకోండి... " కేకలు.

రోడ్డుమీద పడిపోతూ మళ్ళీ లేస్తూ పరిగెత్తుతున్నాడో పిల్లవాడు.

వెనకనించి గొల్లున అరుస్తూ రాళ్ళు విసురుతున్నారు పిల్లలు

వాడలా పరిగెత్తుతూనే వున్నాడు....



# షష్టిపూర్తి



కప్పగంతుల మల్లికార్జునరావు

రంగురంగుల దీపతోరణాలు....బ్యాండు మేళాలు.... రకరకాల చీరెలు.... ఎటు చూచినా కోలాహలం.

అలంకరింపబడ్డ కళ్యాణమండపం... మండప మధ్యంలో మేనేజింగ్ డైరెక్టర్ బిశ్వాస్ ఛటర్జీ, ఆయన ధర్మపత్ని.... పార్వతీపరమేశ్వరుల్లావున్న ఆ వృద్ధ దంపతుల చుట్టూ కొడుకులు, కూతుళ్లు, మనుమలు, మనవరాళ్లు, మునిమనుమలు.. ఛటర్జీగారి మొహంలో మెరిసిపోతున్న తృప్తి, గర్వం....

ఛటర్జీగారి సహస్ర మాసచంద్ర ధర్శనోత్సవాన్ని శ్రద్ధగా తిలకిస్తున్నాడు ఐ.పి.రావు. అలా చూస్తుండగా రావుకు హఠాత్తుగా తన జీవితంలో ఏదో వెలితి వున్నట్లనిపించి వులిక్కిపడ్డాడు.

అప్పుడెప్పుడో యువకుడిగా వున్నప్పుడు దారిద్ర్యంవల్ల, నిరుద్యోగ బాధవల్ల యిటువంటి అనుభూతి పొంది నట్లు గుర్తుకొచ్చిందతనికి.

కానీ కొన్ని దశాబ్దాలుగా ఆ పాపిష్టి గతాన్ని గురించి మర్చిపోయాడు. ఛటర్జీగారి కంపెనీలో చిన్న వుద్యోగిగా అడుగుపెట్టి పెద్దపెద్ద ప్రణాళికలు వేసి కంపెనీని అభివృద్ధిచేసి తను అభివృద్ధి చెందేడు. యిప్పుడు అతడిని చూసి కంపెనీ వుద్యోగులు గర్విస్తారు. ఛటర్జీగారికయితే అతనంటే వల్లమాలిన అభిమానం, విశ్వాసం, గర్వం. రావుగారే తన ప్రజ్ఞను తల్చుకొని గర్వించిన క్షణాలు కూడా లేకపోలేదు కంపెనీ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్‌గా అతనికి ముందుచూపు తప్ప వెనకచూపు లేనేలేదు. అతనికి పని దేముడు. డబ్బుకు, అధికారానికి, పలుకు బడికి, ఆరోగ్యానికి దేనికీ లోటులేదతనికి.

మరి యీ వెలితి ఫీలింగ్ ఎందుకు కలిగినట్లు?

ఎందుకంటే తనకి పరవై సంవత్స రాలని అతనికప్పుడు గుర్తుకొచ్చింది. తనూ షష్టిపూర్తి చేసుకోవాలన్న కోరిక కలిగింది.

అప్పుడు అతనికి అసలు విషయం గుర్తుకొచ్చింది. అదే అతని జీవితంలో వున్న వెలితి.

ఐ పి. రావు యింతవరకు వొంటరి. అసలు అతను పెళ్లిని గురించే కాదు, స్త్రీలను గురించైనా యింతవరకు ఆలో చిస్తేనా?

* * *

కంపెనీ ఎగ్జిక్యూటివ్ డైరెక్టర్ పోస్టునుంచే కాక అసలు కంపెనీ వ్యవహారాల నుంచే రిటైరవుతున్నానన్న రావు ప్రకటన ఛటర్జీని కలవరపెట్టింది. రావ్ లేని కంపెనీ భవిష్యత్తు ఊహించా లంటే భయంవేసింది.

'మిష్టర్ రావ్. నా వల్ల ఏదన్నా పొరపాటు జరిగిందా?'

'లేదు సార్. యు ఆర్ ఆల్‌వేస్ మై ఎల్డర్ బ్రదర్....'

'మరి కంపెనీ వ్యవహారాలనుంచి ఎందుకు తప్పుకోవాలనుకొంటున్నావు? నిజానికి నా తర్వాత యీ కంపెనీకి మేనేజింగ్ డైరెక్టర్ మీరేనని ఎన్నో సార్లు చెప్పేను కదా?'

'లేదు సార్. నే యింక కంపెనీ బాధ్యతల్ని స్వీకరించలేను. నా మనసు మరెటో మళ్లింది. నేను బ్రహ్మచారినని మీకు తెల్సు. యిప్పుడు వివాహం చేసుకొని జీవితంలో సెటిల్ అవ్వాలనుకొంటున్నాను.'

'వివాహమా? యిప్పుడా?'

ఛటర్జీ, రావువద్ద ఎన్నోసార్లు వివాహప్రసక్తి తెచ్చేడు. కానీ అతను విన్పించుకొంటేనా? అలాంటి రావ్ యిప్పుడు తనకుగా తాను వివాహం చేసుకొంటానంటున్నాడు. అరవయ్యోఏట!

'అలా చెప్పండి. మీ నిర్ణయం మాకు మాత్రం సంతోషం కాదనుకొన్నారా? ఆ పెళ్లి మేము చేస్తాము. పురుషుడు పెళ్లి చేసుకొంటానంటే స్త్రీలకే కొదవా? అందునా మీలాంటి వ్యక్తికి! అందుకు కంపెనీ వదలి వెళ్లటం ఎందుకు?'

'నా మేరేజ్ మీరు చేసేదికాదు సార్. యింతవరకు స్త్రీలను గురించి, వివాహాన్ని గురించి ఆలోచించనైనా ఆలోచించని వాడిని నేను. యిప్పుడు నా భార్యను నేను వెతుక్కోవాలి. నా 'లైఫ్‌ని' నేను అన్వేషించుకోవాలి. నా కోరికను కాదన కండి ప్లీజ్....'

* * *

కంపెనీ స్టాఫ్ బ్రహ్మాండంగా వీడ్కోలిచ్చిందతనికి. అతను కంపెనీలో ప్రతి వొక్కరినీ కలిసి పరామర్శలుచేసి వీడ్కోలు చెప్పేడు.

ఆ ప్రాసెస్‌లో అతను స్త్రీ వుద్యోగులను- అందునా పెళ్లి కాని స్త్రీలను, చాలా పరిశీలనగా చూచాడు. అతని చూపుల్లో భేదాన్ని స్త్రీలు కూడా గుర్తించారు. అంతకు ముందు అతడిని తమ సౌందర్యంతో ఆకర్షిద్దామని ఎందరో స్త్రీలు ప్రయత్నించారు. తమ అందాన్ని గుర్తించకపోగా, తమని యంత్రాలలో వొకదానిగా ఆతను చూడటం గుర్తు కొచ్చింది కొందరికి ఆశ పుట్టింది. బ్రహ్మచారి- తమని పెళ్లిచేసుకొంటే ఎంత బాగుండును!

అరవై ఏళ్ళొచ్చిన రావ్ ఆరోగ్యంతో మెరిసిపోతుంటాడు. పసిమి పచ్చటి ఛాయ.... కొనతేరిన ముక్కు.... చురుగ్గా వుండే కళ్లు.... అంత మరీ పొడుగూ పొట్టీకాని శరీరం....అందగాడే అతను అక్కడక్కడా నెరసిన జుట్టు అతని అందానికి హుందాను చేకూర్చింది. ఫుల్‌సూట్‌లో ఎప్పుడూ ఠీవిగా వుండే అతడిని చూస్తుంటే స్త్రీలకు అతని వయసు గుర్తురాదు అసలు.

పెళ్లి చేసుకొంటా నంటాడేమోనని ఆశపడ్డ అమ్మాయిలకు నిరాశే మిగిలింది. రావ్ కలకత్తా నుంచి ఢిల్లీలో ఏదో పని వుంటే విమానంలో బయలుదేరేడు. విమానాశ్రయంలో ఎదురైన స్త్రీలనల్లా పరిశీలనగా చూచాడు. ఎప్పుడూ మాట్లాడని ఎయిర్‌హోస్టెస్‌తో ఏమోమో మాట్లాడేడు. ఏం లాభం?

ఢిల్లీలో పని చూచుకొని రైల్లో హైదరాబాద్‌కు ప్రయాణమయ్యాడు.

* * *

ముందుగా రిజర్వ్ అయిన ఎయిర్ కండిషన్ కంపార్టుమెంటులో కిటికీవద్ద కూర్చొని ప్లాట్‌ఫామ్ మీదనున్న స్త్రీలను చూస్తున్నాడతను

ఖరీదైన తెల్లటి పంచె.... తెల్లటి లాల్చీ.... టినోపాల్ మనిషిలా ప్రకాశిస్తున్నాడతను.

అతని చూపులచురుక్కి- ఆగి కొందరు స్త్రీలు అతడిని పరీక్షగా చూచారు. కానీ

అతడు మొహం తిప్పుకోవటంతో తమ తోవన తాము వెళ్లిపోతున్నారు.

రావ్‌కు కావల్సింది అలాంటి స్త్రీలు కాదు. అతనికి భార్య కావాలి. ధర్మపత్ని, సహధర్మచారిణి....

పెళ్లి చేసుకోవాలన్న కోరిక అతనికి కలగటానికి ప్రేరణ కామం కాదు. కామమే కారణమవుతే అతను దాన్ని అనేక పద్ధతుల్లో నిగ్రహించుకోగలడు. కానీ వివాహంయొక్క పరమార్థం కేవలం కామవాంఛా తృప్తి మాత్రమే కాదని అతనికి తెల్సు. అంతకన్నా మించిందేదో వుంది.

'పిన్నీ.... హైదరాబాద్‌కు వెళ్లగానే మెసేజ్ యివ్వు....'

'అమ్మమ్మా....టాటా....గుడ్‌బై...'

ఉలిక్కిపడి కంపార్టుమెంటులోకి చూచాడు రావు. ఎదుటి బెర్త్‌మీద వో స్త్రీ కూర్చొని వుంది. ఆమె తాలూకు సామానులన్నీ సర్దుతున్నాడో యువకుడు. అతని భార్య కాబోలు. ఆమెకు ఏమేమో చెప్తోంది.

ఆమె పాపను వాళ్లోకి తీసుకొని ముద్దుపెట్టుకొంది.

ట్రయిన్ కదలబోతున్నట్లు అనౌన్సు మెంటు విన్పించింది.

'ఊఁ.... సుజీ.... మనం దిగుదాం. ట్రయిన్ కదలబోతోంది.' వాళ్లముగ్గురూ ప్లాట్‌ఫామ్ మీదికొచ్చారు. కిటికీలోనుంచి అతని భార్య ఆమెకు జాగ్రత్తలు చెప్తోంది.

'పిన్నీ. ఒంటరిగా ప్రయాణం. జాగ్రత్త! బుట్టలో నీకు అవసరమైన వస్తువులనన్నిటినీ పెట్టేను.'

యింజన్ గర్జన. ఆ తర్వాత 'టాటాలు.... బైబై'ల కోలాహలం. ట్రయిన్ నెమ్మదిగా న్యూఢిల్లీ స్టేషన్‌ను కదిలింది.

* * *

ఆమె తనవైపు చూస్తుందేమో ఎలాగోలాగు ధైర్యంచేసి పలకరించి పరిచయం చేసుకొందామని ఆశపడ్డాడు రావు కానీ ట్రయిన్ ప్లాట్‌ఫామ్ దాటక ముందే ఆమె ఏదో పుస్తకం తీసింది. అంతే. అందులోంచి దృష్టిని యివతలకి మరలిస్తేనా?

అసలింతకీ ఆ గ్రంథం ఏమిటో?

పుస్తకం బైండ్‌చేసి వుండటంవల్ల టైటిల్ పేజీ కన్పించటం లేదు.

భారతమా? భాగవతమా? ఆ గ్రంథాలని అంత దీక్షగా, ఉత్కంఠతో చదువుతారా? ఛేజ్, హెరాల్డ్ రాబిన్స్, ఆర్థర్‌హైలీ, ఇర్వింగ్ వేలెస్....

పుస్తకం ఏమిటా అని ఆలోచిస్తూ ఆమెనే చూస్తూ కూర్చున్నాడు.

నలభై ఏళ్ళకు పైగానే వుంటాయి ఆమెకు. లేత తమలపాకు ఛాయలోవుంది. తెల్లటి రంగుమీద ఎర్రటి బార్డరున్న నాజూకైన పట్టుచీరె కట్టింది. మెడలో బంగారు గొలుసు. చెవులకి కమ్మలు.

తెల్లగా అక్కడక్కడా తళుక్కు మంటున్న జుట్టును హుందాగా ముడి వేసింది. మొహంమీద పావలా కాసంత ఎర్రటి కుంకుమబొట్టు. కాళ్ళకు పసుపు.

చూచేకొద్దీ ఆమెను చూడాలని బుద్ధి పుట్టిం దతనికి.

'ఛీ. ఆమె ఎవరో గృహిణి. పెద్ద ముత్తయిదువ. ఆమె నిలా చూడటం ఎంత తప్పు? ఆమె తను చూస్తున్నట్టు గమనిస్తే ఏమనుకొంటుంది? తెల్లడ్రస్‌లో నల్లమనిషి అనుకోదూ? ఎయిర్ కండిషన్ కంపార్టుమెంట్‌లో ప్రయాణం చేసే ఫురానా రౌడీ అనుకోదూ? అమ్మో. ఆమె తనని గురించి అలా అనుకోటం తాను భరించలేడు.'

అతను ఆమెనుంచి దృష్టిని మరల్చాలని విశ్వప్రయత్నం చేసేడు కృతకృత్యు డయ్యాడు కూడా. కానీ ఆ నిశ్చలత ఎంతసేపు? మనసు ఆమెవైపే లాగు తోంది. కళ్ళను లాక్కుపోతోంది అటు.

ఆమెకు పెళ్ళయిందా? యింకా కాకుండా వుంటుందా? పిల్లలెంతమందో? ఢిల్లీ స్టేషన్లో పాప "అమ్మమ్మా" అంది. పాప అమ్మ "పిన్నీ" అంది. అంటే ఆ యువతి స్వంత మాతురు కాదు. పిల్లలు, భర్త వుండి ఢిల్లీకి వొంటరిగా ఎందు కొచ్చిందో?

ఒకవేళ ఆమెకి పెళ్లికాలేదేమో?

ఆ భావన రావుకు ఎందుకో ఆనందాన్ని కలిగించింది.

చూడటానికి అచ్చం తెలుగు గృహిణిలా వుంది. చదువుకొన్నదా? ఉద్యోగం చేస్తున్నదా? వొక్కసారి ఆమె కన్నెత్తి తనని చూస్తే ఎంత బాగుండును?

అయినా ప్రయాణంలో మనిషితోడుతో సమానం పుస్తక పఠనం.

తనను చూస్తే, తనతో చొరవగా మాట్లాడితే, తను ఏమైనా చేస్తానని భయమా? అయినా తనేమైనా చెయ్యాదల్చు కొంటే మాట్లాడకుంటే మాత్రం చేయ కూడదూ? రాత్రంతా మేమిద్దరే వొంటరిగా ప్రయాణం చేస్తారు. ఆమెకు చీమకుట్టినట్లు లేదేం?

'మీరు నన్నేమనుకొంటున్నారో? కాని నేను దుర్మార్గుడిని కాను....' మిస్ అనాలా, మిసెస్ అనాలా? అసలు ఆమె పేరేమిటో? యింత అందంగా, హోదాగా వున్న ఆమె పేరులో కూడా విశిష్టత వుండే వుంటుంది.

ఆమె దృష్టిని ఆకర్షించే ప్రయత్నంగా అతను రెండుసార్లు లేచి కూపే బయటికి వెళ్ళి వచ్చాడు. పొడిదగ్గులు దగ్గేడు. పోనీ తనే పలకరిస్తే?

ఒంటరిగా ఎంతసేపీ ఆరాటం? మరో మనిషన్నాలేడు. అయినా యివాళ బెర్తులు ఖాళీగా వున్నాయేం?

అతను ధైర్యం చేసేడు.

'క్షమించండి....' అతని మనసు వణికింది. నాలిక తడబడింది.

'మీరు హైదరాబాద్ కేనా?'

ఆమె పుస్తకంలో నుంచి దృష్టిని మరల్చింది. అతనివైపు క్షణంలో సగం సేపు చూచి 'ఊ' అంటూ మళ్లీ పుస్తకం లోకి తలదూర్చింది.

ఆ వొక్క 'ఊ' అతనికి వెయ్యి విధాలుగా విన్పించింది. మరో ప్రశ్న అడగటానికి సాహసించలేకపోయాడు. అయినా అగి అగి ఎంత చచ్చుప్రశ్న అడిగాడు తను? కనీసం పేరన్నా అడిగేడు కాడు! సమభావం తెల్పిన ప్రశ్న నే అడగటం ఎంత ఫూలిష్‌నెస్....

బిజినెస్ వ్యవహారాల్లో ఎంతో నైపుణ్యంగా మాట్లాడతాడని పెద్ద పేరు తనకి. ఏమయిందా నైపుణ్యమంతా యిప్పుడు?

'ఎక్స్‌క్యూజ్ మి సర్' అంటూ అటెండర్‌వచ్చి రూప్పీ స్టేషన్ త్వరలో రాబోతున్నదని చెప్పి, మీల్స్‌కు ఆర్డరి స్తారా అని అడిగాడు.

'ఊ. స్పెషల్ సౌత్ ఇండియన్ మీల్స్ టు' చొరవచేసుకొని చటుక్కున అన్నాడు రావ్.

'వద్దు ప్లీజ్! భోజనం [illegible] మా సుజీ చేసింది. యూ కెన్ ప్లీజ్ గో' అంటూ అటెండర్‌ని పంపించేసింది.

ఆమె పుస్తకం మూసేస్తూ చేతి గడియారం చూచుకొంది.

'మా సుజీకి అన్నీ ఎక్కువగా పెట్టటం అలవాటు. మీరు నా అతిథ్యాన్ని స్వీకరించరూ? ప్లీజ్....' అంటూ ఆమె ఆ ఏర్పాట్లలో మునిగిపోయింది.

యిదే మంచి సమయం. ఆమె పేరు యిత్యాది వివరాలు అడిగేకన్నా పుస్తకం అడిగి తీసుకొని చూస్తే ఆమె విషయాలు చాలా తేలవచ్చు.

'ప్లీజ్....ఆ పుస్తకం యిస్తారా?'

ఆమె పుస్తకాన్ని అతని చేతికిచ్చింది.

అతను ఆత్రంగా పుస్తకాన్ని తెర్చి చూచాడు.

అది నవల కాదు. భారతభాగవతాలూ కాదు.

ఇజాక్ అసిమోవ్ 'లైఫ్ అండ్ టైమ్' యిత్యాది పుస్తకాలన్నీ కలిపి బైండ్‌చేసిన సంపుటి! 'సెన్స్ - మైండ్ .... అండ్ రెలిజియన్! ...'

ఆమె పేరుకోసం పుస్తకం అంతా తిరగేసేడు. ఊహూ.... ఎక్కడా లేదు.

'నా పేరు అహల్య. మిస్ అహల్య' అందామె పులిహోర యిత్యాది పదార్థా లున్న వో ప్లేట్‌ను అతని ముందు వుంచుతూ.

* * *

యింకొక్క అరగంటలో సికిందరా బాద్ స్టేషన్! ఆ తర్వాత ఆమె దోవ ఆమెది. నా దోవ నాది.

ఆ భావన అతనికి బాధగా వుంది. భరించలేకపోయాడు.

మరికొంతసేపు ప్రయాణం చేస్తే ఎంతబాగుండును? పోనీ రైలు ఏదో

కారణంగా యిక్కడ ఆగిపోతే ఎంత హాయిగా వుంటుంది?

అన్ని గంటలసేపు ప్రయాణం చేసికూడా ఆమెను గురించి తెల్సు కొన్న వివరాలకన్నా తెల్సుకోవాల్సిన వివరాలే ఎక్కువగా వున్నాయి. తనని గురించి ఆమెకు ఏమీ చెప్పలేదు. తన కోరికను సూచన మాత్రంగానైనా....

'ఏమండీ....' అతను తెగించాడు. ధైర్యం తెచ్చుకున్నాడు.

కానీ ఆమె తనవైపు చూడగానే అడగదల్చుకొన్న విషయాలు మర్చి పోయాడు. మనసు తడబడింది.

'మీరు... మీరు పెళ్ళెందుకు చేసుకో లేదు?'

ఆమె జవాబివ్వలేదు. మెల్లగా నవ్వి పుస్తకంలో తలదూర్చింది.

నిస్పృహతో నిట్టూర్చాడు రావ్. ఆఖరి ఛాన్సు. పిచ్చిప్రశ్న అడిగి చేజేతులా చెడగొట్టుకున్నాడు. ఆ ప్రశ్న అడిగేక యిక ఏ మొహంపెట్టుకొని ఆమెతో మాట్లాడటం?

సికిందరాబాద్ స్టేషన్‌లో బండి ఆగింది. ఆమె పోర్టరును పిలిచింది.

రావ్‌ను రిసీవ్‌చేసుకోటానికి ఛటర్జీ కంపెనీ తాలూకు అధికారులు, మందీ మార్బలాలతో స్టేషన్ కొచ్చేరు. ఛటర్జీ సికిందరాబాద్‌లో వో పెద్ద బంగళాని, వో కారుని అతనికి ఫ్రీ మేరేజ్ ప్రెజెంట్‌గా వద్దనేకొద్దీ యిచ్చాడు.

'అడుగో మిస్టర్ రావ్....' అంటూ అధికారులు పూలగుచ్ఛాలతో కంపార్ట్ మెంట్‌లోకి జొరబడ్డారు.

రావ్- ఆమె!

'హార్టీ కంగ్రాచ్యులేషన్స్ మిస్టర్ రావ్. వెల్‌కమ్ టు ది న్యూలీ మేరీడ్ కపుల్....' అందులో వో ఆఫీసర్ రావ్‌తోపాటు ఆమెకూ పుష్పగుచ్ఛాన్ని ఆఫర్‌చేస్తూ అన్నాడు.

రావ్ ఆమెవైపు చూచాడు అపరాధ భావనతో. ఆమె అతనివైపు చురుగ్గా చూచింది.

'సారీ....' అన్నాడతను.

'దట్సాల్‌రైట్. నేనుండేది అశోక్ నగర్‌లో. నా ఫోన్ నెంబరు....'

వెళ్ళబోతున్న ఆమెను పిల్చి తన వివరాలున్న కార్డు యిచ్చాడు రావ్.

* * *

'రాంగ్ నెంబర్ ప్లీజ్... '

ఆమె యిచ్చిన ఫోన్ నెంబర్ రాంగ్ నెంబర్. ఆ ఫోన్ నెంబర్‌ను బట్టి ఆ చిరునామా తెల్సుకొన్నాడు. ఆ ఫోన్ వున్నది అశోక్‌నగర్ కాదు. విజయ నగర్ కాలనీ.

ఆమె తనని ఎందుకిలా మోసం చేసింది? లేక ఆటలు పట్టించిందా? కొత్త జీవితంకోసం అన్వేషణ ఆరంభం లోనే యిలా అయిందేం?

అతను ఆమెని మర్చిపోవాలను కొన్నాడు. కొత్తగా అన్వేషణ సాగిద్దా మనుకొన్నాడు. ఊహూ.... సాధ్యం



కాలేదు. ఆ వయసులో అర్థంతెలియని యీ అనుబంధం ఏమిటి?

అలా ఆరాటపడ్తుండగా ఆమెనుంచి వుత్తరం. అతనికి ప్రాణం లేచివచ్చి నట్లయింది.

'రావ్‌గారూ

బాధపడ్తున్నారా? మోసంచేసేనని తిట్టుకుంటున్నారా?

ఫోన్‌చేసి మీరు నాకు కొత్తగా చెప్పేదేముందండీ? మిమ్మల్ని పుస్తకం కన్నా స్పష్టంగా చదివి అర్థంచేసు కొన్నాను. నన్ను మీరు మొదటి చూపులోనే ప్రేమించారు పెళ్ళిచేసుకొందామనుకొంటున్నారు. అంతే గదా?

ఏదో అడగబోయి నన్ను పెళ్ళెందుకు చేసుకోలేదని అడిగేరు. కదూ? నిజం చెప్తాను. కోపగించుకోకండి.

నాకు చాలా చిన్నతనంలో ఎప్పుడో పెళ్ళయిందండీ దారిద్ర్యపు బాధను, నిరుద్యోగ సమస్యను తట్టుకోలేక నా భర్త పిరికివాడులా పారిపోయాడెక్కడికో. నా భర్త మొహంకూడా నాకు తెలియదు. అయినా ఆయన నా మెళ్ళో కట్టిన మంగళసూత్రానికి విలువనిచ్చి

వివాహ వ్యవస్థపైన గౌరవంతో ఆయన తిరిగి వస్తాడని కొన్నాళ్ళు ఎదురు చూచాను. చుట్టూ వున్న సమాజ సభ్యులు నన్నేక విధాల వొడిచారు.

నాకు రోషం వచ్చింది. ఆయన్ని మనసులో చంపేను. నా గతాన్ని చంపేసేను నేను రాయిగా మారి కుమారి అహల్య నయ్యాను. పట్టుదలతో చదివేను.'

'నిజంగానే నీ భర్త చనిపోయాడు అహల్యా నువ్వు మంచిపని చేసేవు' రావ్ వుత్తరం మధ్యలో ఆపి కళ్ళు తుడుచుకొంటూ గొణుక్కొన్నాడు.

'నా చదువుకు తగ్గ వృత్తిని చేపట్టి బోలెడంత సంపాదించాను. నా సోదరీ సోదరులను చదివించాను. పెళ్ళిళ్ళు చేసేను వృత్తిధర్మంగా ఎందరి మనసులకో స్వస్తత చేకూర్చాను.

కానీ నా మనసుకు తృప్తి లేదేం? ఏదో వెలితి. వొంటరి భావన.

అప్పుడప్పుడూ పెళ్ళిచేసుకొందాం అన్న కోరిక కలగకపోలేదు. కానీ ఒక సమస్యా పరిష్కారంలోనుంచి మరో సమస్య వుత్పన్నం కాకూడదు గదా?

విధవలు పెళ్ళిచేసుకొంటున్నారు. విడాకులు పుచ్చుకున్న స్త్రీలు పెళ్ళిచేసుకొంటే సమాజం, న్యాయశాస్త్రం కూడా అంగీకరిస్తాయి. కాని భర్త వదిలేసి వెళ్ళిన స్త్రీలు, భర్త జాడ తెలియని స్త్రీలు ఎన్నాళ్ళన్నా పసుపుకుంకుమలతో పునిస్త్రీలుగా వుండవచ్చు కాని తిరిగి పెళ్ళిచేసుకోకూడదు. యీ సమాజ సూత్రాన్ని నేను ఎదిరించదల్చుకొంటే ఎదిరించవచ్చు. కానీ నా వివాహం నాకు కాని నన్ను చేసుకొన్న వారికి కాని సమస్య కారాదు కదా?

రావుగారూ,

జీవిత భాగస్వాముల్లో వొకర్తురు మాత్రమే వైవాహికబంధ పవిత్రతకు విలువనిస్తే సరిపోతుందా? రెండుచేతులూ కలిస్తే కాని చప్పెట్లు మోగటమే కాదు సమస్యాపరిష్కారం కూడా కాదు.

మీరు వైవాహిక బంధాన్ని, కుటుంబ వ్యవస్థని గౌరవించేవారుగా నేను అర్థం చేసుకొన్నాను. మీ వివాహ వాంఛ, ప్రేమాతిశయం, కామవాంఛతో కూడినవి కావని కూడా గ్రహించాను. అందుకే మీకు యిదివరకే పెళ్ళయిందా, ఎందుకు పెళ్ళిచేసుకోలేదు, భార్య చనిపోతే రెండోపెళ్ళి చేసుకోవాలనుకొంటున్నారా అన్న మీ గతానికి సంబంధించిన ప్రశ్నలను నేను వేసుకోవటంలేదు. మీరు నన్ను కోరటానికి సందేహించిన కోరికను నేను కోరుతున్నాను.

నేను మిమ్మల్ని జీవితభాగస్వామిగా పొందాలనుకొంటున్నాను. మీకు అభ్యంతరం లేదుగా?

నా కథంతా తెల్సుకొన్నాక కూడా మీ నిర్ణయం మారకపోతే మీరు నాకు ఫోన్ చేయవచ్చు. యీసారి నే నిస్తున్నది

రాంగ్‌నెంబర్ కాదు. కానీ ఆ నెంబరుకు డయిల్‌చేసేముందు వొకటికి పదిసార్లు ఆలోచించండి. రైట్ నెంబర్ అనుకొని తొందరపడి రాంగ్‌నెంబర్‌కు డయిల్ చేయటంవల్లే చాలామంది వైవాహిక జీవితాలు పనిచేయని టెలిఫోన్లు అవుతున్నాయి.'

ఉత్తరం ఎలా చదివేడో! శరీరమంతా నీరసం మనసంతా దోషభావనా జ్వాలల్లో దహించుకుపోతుంది. ... తనకున్న వుత్సాహం, ఆరాటం చచ్చిపోయాయి. వేదన ...

ఎప్పుడో తను మర్చిపోయిన పాపిష్టి గతం కళ్లముందు నిలిచింది.

తన చదువు.... పెళ్ళి....జీవన వైఫల్యాలు....బాధలు....వైరాగ్యం. . పెళ్ళి మీదేకాక జీవితం మీదే విరక్తి....

ఆ భార్య పేరు అహల్య కాదు. అనూరాధ....

ఇన్నేళ్ళ యాంత్రికజీవితం తర్వాత వైవాహిక జీవితంలో గల మాధుర్యం గుర్తువొచ్చింది తనకు. ఏ యంత్రానికి ఎలాంటి స్పేర్ పార్ట్ అవసరమో ఠక్కున చెప్పగలిగిన శక్తివున్న తనకు తనకీ స్థితిలో ఎలాంటి భార్య అవసరమో కూడా ఆరోయింద్రియం చెప్పింది. తన జడ్జ్‌మెంట్ రైట్.

కానీ అనూరాధ? తనొక్కప్పుడు తృణీకరించిపోయిన వైవాహిక బంధం పట్ల గౌరవంతో జీవితంలో వొంటరిగా పోరాడింది తను పైకొచ్చి యితరుల్ని పైకితెచ్చింది యంత్రం కాలేదు- తన లాగా పవిత్రతనూ కోల్పోలేదు. యిన్నాళ్ళకు ఆమె తనవల్లే ప్రేరణ పొంది కొత్త జీవిత భాగస్వామిని పొందాలనుకోటం ఎంత వింత! ఆ కొత్త భాగస్వామి పాతవాడేనని ఆమెకి ఏనాటికైనా తెలిస్తే?

'అనూరాధగా నన్ను క్షమించావ్ వొకసారి. మరోసారి కూడా క్షమించు అహల్యగా కూడా. నేను నీకు ఏమాత్రం తగనివాడిని '

అతను వుత్తరం చించబోతూ ఆగేడు.

'వొకనాడు తాళికట్టి వొదిలిపోయి వంచించాను యీనాడు తోడుగా వుంటా నన్న ఆశ కల్పించి, తీరా ఆమె తోడును అర్థించాక పారిపోయి మరోసారి వంచించటమా? నో! నా గతం ఆమె తనకు అక్కర్లేదంది. కానీ ఆమెకు అక్కర్లేని గతమే నాకు గుణపాఠం. భవిష్యత్తును సక్రమమార్గంలో నడిపే బాట.'

అతను ఉత్తరాన్ని పదిసార్లు చదివేడు బిజినెస్ ఎగ్జిక్యూటివ్‌గా కాదు. కాబోయే భర్తగా, మనిషిగా బాగా ఆలోచించి వో నిర్ణయానికొచ్చాడు.

'యింతకీ అహల్య వృత్తి ఏమిటో?' అనుకున్నాడు, ఆమె యిచ్చిన నెంబర్‌కి డయిల్ చేస్తూ.

'యస్ కన్సల్‌టెంట్ సైకియాట్రిస్ట్ డాక్టర్ అహల్య....'

ఇంగువ ప్రభాకరరావు నూతన భవిషత్ జీవితం ఆశాజనకంగా కన్పించింది. ఉత్సాహం వచ్చింది.

షష్ఠిపూర్తి వుత్సవం అతని కళ్ళ ముందువైభవోపేతంగాదర్శనమిచ్చింది.

———




ఒకసారి కళ్ళు మూసుకుని, అలా నిముషం వుండి, కళ్ళు తెరిచిన ప్రసన్న 'అబ్బ!' అనుకున్నాడు బాధగా.

వీధి వరండాలో నిలబడి, అవతలికి చూస్తూ, ఆలోచిస్తున్నాడతను ఇందాకటి వింటీ.

నాలుగు వాటాలుగా వున్న ఆ డాబా ఇంట్లో, వీధివేపు వాటాలు రెండిట్లో, పెద్ద ఇంట్లో ఆఫీసరు, భార్య, రెండోదయిన ఒకే గదిలో ప్రసన్నా వుంటున్నారు. వెనకవి రెండు వాటాలలో రెండు చిన్న కుటుంబాలుంటున్నాయి.

ప్రసన్నది పక్క పల్లెటూరు. అక్కడ బాబాయే అయినవాళ్ళందరిగా, అతని దగ్గర పెరిగి, ఇంటరు పాసయి, భుక్తిని వెదుక్కుంటూ ఈ వూరొచ్చేడు. ఆస్తి, డిగ్రీ ఏవీ లేకపోయినా, ఆకలి, అవసరమూ వుంటాయి. ప్రసన్న అనేక మందిని ఆశ్రయించేడు ఏదో పని దొరుకుతుందని. న్యూసు పేపర్లు పంచే వుద్యోగం దొరికింది.

అవాళ డ్యూటీ ముగించుకుని వచ్చి, వీధివరండాలో నిలబడ్డాడు. సాయంత్రం చల్లదనాన్ని అనుభవిస్తూ, చక్కదనాన్ని చూస్తూ. పక్కవాటాలోంచి ఆఫీసరు రవిచంద్రగారి భార్య మాటలు గట్టిగా వినిపించేయి:

"....కూచోమంటే కూచోరు! పడుకోరు! ఎందుకా లేవడం? పెద్ద ఏదో పనివున్నవాళ్ళకి మల్లేనూ? చేతకాని మనిషి చేతకానట్టు వుండాలి!...."

"తారా!" అరిచేడు రవిచంద్ర.

"అలా సాధించే బదులు ఇంత విషం ఏ అన్నంలోనో కలిపి పెట్టెయ్యవే! నా పీడ వదలిపోతుంది నీకు!"

"ఇద్దరంవూ ఒక్కసారే చద్దాం!"

"నువ్వెందుకు చావడం? నీకు నేను బరువు గదా? నేను లేకపోతే నీకు నా

చాకిరీ, కష్టం వుండవు గదా? అప్పుడు నువ్వు హాయిగా వుండొచ్చు!"

అతను లోపల్నుంచీ వస్తున్నాడు గోడలు పట్టుకుని: తడుముకొంటూ: ప్రసన్న వెళ్ళి రవిచంద్రని పట్టుకుని తీసుకువచ్చేడు.

తార ఓ కుర్చీ తెచ్చి వరండాలో వేసింది.

"పానాగిపోయిందోయ్, ప్రసన్నా! వెధవ పుక్కు, దోమలు చంపేస్తోంది, బయటకి వద్దామనీ...."

అతను కుర్చీలో కూర్చున్నాక, ప్రక్కన నేలమీద చతికిలబడ్డాడు ప్రసన్న.

"మా ఆవిడచేత ఎన్ని మాటలనిపించు కుంటున్నానో చూడు ప్రసన్నా! పరాయి వాడివయినా, నీకు నా మీదున్న సానుభూతి నా భార్యకి లేదోయ్!"

"నేనూ మీ భార్యగారి స్థానంలో, రోజంతా మీతో వుంటే, అప్పుడు నాకూ అవిడంత విసుగు కలుగుతుందేమో, సార్!" అన్నాడు ప్రసన్న నవ్వి.

"నిజమే నిజమే." అన్నాడు రవిచంద్ర.

"ప్రతి చిన్న అవసరానికి అవతలి వాళ్ళమీద పడడం, వాళ్ళకి ఇబ్బందిగానే వుంటుందిలే!" చూపులాని కళ్ళు, నీళ్ళని రానిచ్చే యువతలికి.

రెండు మాసాలయింది, రవిచంద్రకి ప్రమాదం జరిగి. స్కూటర్ మీద, ఆఫీసు నించీ వస్తూ, దోవలో మరో స్కూటర్ గుద్దేయగా తూలిపడిపోయేడు. అతడికీ ఇతనికీ కూడా ఒంటికి దెబ్బలు తగిలేయి కాని, రవిచంద్రకి కళ్ళమీద తగిలి చూపుపోయింది.

రవిచంద్ర ప్రసన్న భుజంతట్టి అన్నాడు.

"నువ్వెన్నాళ్ళిలా ఒక్కడివీ వొండుకు తింటూ, ఒంటరి బతుకు బతుకుతావు?"

"ఒద్దుసార్! వున్నన్నాళ్ళిప్పుంటాను". అన్నాడు ప్రసన్న.

"వచ్చింది సరిపోదనా, ఇద్దరికీ?"

ప్రసన్న పిలవాపేకు చాలా సేపటికి. తన గదిలోకి వచ్చి అన్నం తిని పడు కున్నాడు. అతని కళ్ళవెంబడి రెండు కన్నీటి చుక్కలు రాలి పక్కమీదపడి ఇంకిపోయేయి.

* * *

ఐయ్ స్పెషలిస్ట్ డాక్టర్ పాణి ఇంట్లో ఆ సాయంత్రం సాహిత్యసభ జరుగు తోంది. పాణి డాక్టరు, సాహిత్యప్రియుడు కూడా. డిస్పెన్సరీ, ఇల్లు పక్క పక్కనే వున్నాయి. ప్రతీ నెలా ఒక ఆదివారం సాయంత్రం రెండుగంటలు తన ఇంట్లో సాహిత్య సమావేశం ఏర్పాటుచేస్తాడు అతను. మిత్రులకి పోస్టుద్వారానూ, పేపర్లో ప్రకటనద్వారానూ తెలియచేయ బడుతుంది. రచనలు ఎవర్రాసినవి వాళ్ళు చదువుతారు. తర్వాత వాటిమీద చర్చ జరుగుతుంది.

ఆరోజు సుమారు పాతికమంది రచయితలు, సాహితీ అభిమానులూ వచ్చేరు. ప్రసన్న వచ్చేడా సభకి. అతను పుస్తకాలు చదువుతాడు. పేపర్లో ఆరోజు ప్రకటించిన సాహిత్య సమావేశం, స్థలం వివరాలు చూసి వచ్చేడతను.

ఆరోజు స్వీయరచనా పఠనం జరిగిన వెంటనే చర్చని ఆపుజేసాడు పాణి. తనొక ముఖ్యవిషయం చెబుతానన్నాడు.

"ఫ్రెండ్స్! నేను చెప్పేది వైద్య పరమైనదే కాదు; మొత్తం సృష్టిపరమైనది! మానవులందరి కర్తవ్యపరమైనదీ!

"సర్వేంద్రియాణాం నయనం ప్రధానం!" అన్నట్టు కన్నుకి శరీరాంగాలలో ప్రత్యేక ప్రాశస్త్యమున్నది!

"ఒకప్పుడు కన్నుపోతే మనిషికి మరో మార్గం లేదు! జీవితాంతం చీకట్లో బ్రతకాల్సివచ్చేది. ఇవాళలా కాదు సైన్సు వైద్యం పురోగమించేయి.

"కళ్ళకి వచ్చే అనేకరకాల జబ్బుల్ని పోగొడ్తున్నాము! ఆపరేషన్లుచేసి ఆరోగ్యవంతమైన కళ్ళని అమర్చుతున్నారు! అన్ని దానాల్లో అన్నదానం గొప్పది అంటారు. నా మాటేమిటంటే అన్నదానం కంటే కూడా కన్నుదానం గొప్పదని!! నేనివాళ చెప్పే విషయం ఇదే! మన కళ్ళని మనం బతికివున్నంత కాలం వాడుకోవచ్చు! మరణానంతరమే వాటిని తీసి అంధులకమర్చుతారు ముందుగా మాత్రం కళ్ళని దానం ఇస్తున్నట్టు పేరు నమోదు చేయించుకోవాలి."

పాణి కనుసైగ చేయగానే అతని అసిస్టెంటు కుర్రాడు ఒక బంతిలా వున్న కన్ను ఆకారాన్ని తెచ్చి టేబిలుమీద పెట్టాడు.

"ఇది కన్ను, ఇది తెల్లగుడ్డు, ఇది నల్లగుడ్డు. మనం చూసే దృశ్యం ఈ నల్లగుడ్డుమీదపడి ప్రతిఫలిస్తుంది. ఎదుట వున్న అందాన్ని, ఆధిక్యతని, మంచిని, చెడ్డని గ్రహిస్తాం! నల్లగుడ్డు అంటే కార్నియాకి దెబ్బ తగిలితే చూపు పోతుంది దెబ్బ మరీ బలంగా అంటే లోపల మెదడుకి జ్ఞానాన్ని తీసుకువెళ్ళే నరాలు తెగినట్టు దెబ్బతగిలితే కష్టం కాని ఈ కార్నియాకి దెబ్బతగిలి దృష్టి లోపిస్తే మాత్రం ఆరోగ్యవంతమైన కార్నియా నమర్చి దృష్టి తీసుకురావచ్చును.

"నేను మిమ్మల్ని మిత్రుడిగా, వైద్యుడిగా కోరేది... మీరంతా మీ నేత్రాలను డొనేట్ చేయాలి! మేం ఇచ్చిన ఫారంను ఫిలప్‌చేసి ఇవ్వండి. మరో మారు చెబుతున్నా! మీరు జీవించినంత కాలమూ మీ కళ్ళు మీతోనే వుంటాయి. మరణానంతరమే వాటిని తీసి అంధుల కమర్చుతారు.

వచ్చినవాళ్ళల్లో పదిమంది తాము తమ కళ్ళని దానం ఇస్తున్నట్టు ప్రకటించేరు. మిగిలినవాళ్ళు మళ్ళా కలుస్తామని చెప్పి వెళ్ళారు. ప్రసన్న తన

కళ్ళని డొనేట్ చేసేడు. డాక్టరు అతన్ని ప్రశంసించేడు.

ప్రసన్న ఇంటికి వెళుతూ, దోవలో మెడికల్ షాపులో తనకి కావలసిన టాబ్లెట్లు కొనుక్కున్నాడు.

* * *

హోరున వాన పడుతోంది. ఆకాశం మబ్బుల్తో నల్లగా కాటుకపూసినట్టుంది. చెవులు బద్దలయేలా వురుములు. ఎక్కడో ఇంకాక ఓ పిడుగు పడింది.

ప్రసన్న సైకిలుమీద, పేపర్లకట్ట కట్టుకొని తొక్కుతున్నవాడు, వాన రావడంతో, ఓ ఇంటి ఆవరణలోకి వెళ్ళేడు గబగబా. తను తడిసినా ఫర్వా లేదు, పేపర్లు తడవకూడదు।

ఆ ఇంటివాళ్ళనడిగి, వాళ్ళరుగుమీద పేపర్లు పట్టుకు నిలబడ్డాడు. ఉధృతంగా పడిన వాన, అరగంట అయేసరికి వెలిసింది. మబ్బు లటుఇటు చెదిరేయి. గాలి ధారాళంగా వీచింది. వెలుగూ, ఆ తరవాత కొంచెం ఎండా వచ్చేయి.

ప్రసన్న మళ్ళా పేపర్లకట్టతో సైకిలు తొక్కుతున్నాడు. రెండు ఇళ్ళలో ఇచ్చేదంతే. గుండెల్లో నెప్పి వచ్చేసింది. గుండె నిమురుకున్నాడు. పేపర్లు ఇంకా కొన్ని ఇళ్ళల్లో ఇవ్వాల్సివుంది। ఎలా ఇప్పుడు?

నెప్పి సర్దుకుంటుందేమోనని చూసేడు. సైకిలు దిగిపోయేడు. రోడ్డు పక్కన పేవుమెంటు మీద నిలబడిపోయేడలా, చేత్తో గుండె రాసుకొంటూ.

జేబులో గుండెనెప్పి మాత్రలు ఎప్పుడూ సిద్ధంగా వుంచుకొంటున్నాడీ మధ్య। రెండుసార్లు సన్నగా వచ్చింది నెప్పి। మరోసారి కొద్దిగా ఎక్కువగానే వచ్చింది।। అప్పుడే డాక్టర్ని కలిసేడు, ఆయన టాబ్లెట్లు రాసిచ్చేడు, ఎక్కువ శ్రమపడవద్దన్నాడు.

శ్రమ పడకండా తనకి ఎలా అవుతుంది. పని మానేస్తే ఏం తింటాడు? ఎక్కడ వుంటాడు?

బాబాయి అతనిని వీలయినంతకాలం వుంచుకున్నాడు. ఇంటరు అవగానే, "ఇంక నీ బతుకు నువ్వు బతకమని" చెప్పేసేడు.

ఇంకా నయం। ఈ పనయినా దొరికింది। ఇదిగో। ఈ ఆఫీసరుగారే తన తరపున పూచీపడి, వాళ్ళకి హామీ ఇచ్చి, ఈ పేపర్లు పంచే పనిని ఇప్పించేరు।।

ఎందరో కష్టపడుతున్నారు అనేక పనులికి। తను చిన్నతనంనించీ కొంచెం బలహీనుడే అయినా, అలాగే తన జీవితం కొనసాగుతుందనుకున్నాడు కాని.... ఇలా గుండెనెప్పి వస్తుందని.... చావు చాలా తొందరగానే తనని వరిస్తుంది అని అనుకోలేదు।।

ప్రసన్న జేబులోంచి మాత్ర తీసి వేసుకున్నాడు. ఆ పక్క కిళ్ళీబడ్డీలో సోడా తాగేడు, నీడలో కాస్సేపు నిలబడ్డాడలా.

చాలా నీరసంగా వుంది! ఒళ్ళంతా చెమట్లుపోసేయి. ఇప్పటికి కొంచెం తగ్గిందిప్పటికి! మళ్ళా ఏ నిముషాన నెప్పి వస్తుందో తెలీదు!

సింపాదిగా బయలుదేరేడు. మరి నాలుగిళ్ళల్లో పేపర్లు ఇచ్చేడు అ తరవాత మాత్రం, మరి కొనసాగలేకపోయేడు.

సైకిల్ని నడిపించుకొంటూ, అక్కడికి రెండు సందులు వున్నా, తనింటికి తిరుగు ముఖం పట్టేడు.

ఆ ప్రాంతి పొందుతుంటూంటే, మళ్ళా నెప్పి వచ్చింది!

బాధతో విలవిల్లాడిపోయేడు ప్రసన్న. స్టౌవ్‌మీద గిన్నె అలాగే వుంచేసి, చాప మీద వాలిపోయేడు.

అతని గదిలో మూలుగు వింది తార. కంగారుగా వెళ్ళి చూసింది.

"ఏమయిందయ్యా!" అడిగింది.

ప్రసన్న పరిస్థితి పోల్చింది.

"ఇప్పుడే వచ్చిందా!"

"వూం....." అన్నాడు. ఇంతకు ముసుపు నెప్పి వచ్చినట్టు చెబితే, వాళ్ళిద్దరూ చాలా కంగారుపడిపోతారు! ఎందుకు తనకి చెప్పలేదని అడుగుతారు! ఏదో చిన్నగా నెప్పివస్తే, తగ్గిపోతుంది లెమ్మని, దానికి అందరికీ చెప్పడం ఎందుకని వూరుకున్నాడు. వాళ్ళెలాంటి వాళ్ళంటే, అసలు, తనని వొంటుకోవద్ద న్నారు! తమ ఇంట్లోనే ఓ ముద్ద పడేస్తామని, అంతగా తనకి మొహమాటం పడితే అందుకు ప్రతిఫలం ఇవ్వ మన్నారు!! కాని, తనందుకు ససేమిరా ఒప్పుకోలేదు! పనిప్పించడం కాకుండా, ఇంకా భోజనం కూడానా? అని చచ్చే సిగ్గువేసింది తనకి!

ఆవిడ వెళ్ళి డాక్టర్ని పిలుచుకు వచ్చింది.

ఆయన దగ్గర మాత్రం ప్రసన్న గుట్టు బైటపడిపోయింది! ఆయన "ఇలా ఇంతకు ముసుపు వచ్చిందా?" అనడిగితే తలవూపేడు.

తార, రవిచంద్ర ముఖాలు చూసు కున్నారు.

డాక్టరు ప్రిస్క్రిప్షను ఇచ్చివెళ్ళగానే, ప్రసన్నకి చీవాట్లేసేరిద్దరూ. ఆ నిముషంలో అతడికి వాళ్ళు తనికిలేని తల్లితండ్రుల్లా తోచి, కళ్ళల్లోంచి ధారా పాతంగా నీళ్ళొచ్చేయి.

ఆఫీసరు స్టేటస్‌లో వున్నా, వాళ్ళకి ఆ అహంకారం, అతిశయం లేవు! వాళ్ళె దెంత మంచి మనసులు!! వాళ్ళ దయని, మంచితనాన్ని పొందడం తన అదృష్టం!! ప్చ్! ఈ అదృష్టం ఎన్నాళ్ళు నిలుపుకో గలడు?!

తార వెళ్ళి మందులు కొనుక్కొ వచ్చింది.

ప్రసన్నకి డాక్టరు ఇందాక ఒక ఇంజక్షనిచ్చేడు, మాత్రవేసాక అతనికి నిద్రపట్టింది.

డాక్టరు చేసిన హెచ్చరిక, రవిచంద్ర దంపతులికి, ప్రసన్నకి మతులు పోగొట్టేసింది.

"ఇది ఫస్ట్ ఎటాక్! సెకండ్ టైం రాకూడదు! వస్తే ప్రమాదకరం! రాకుండా చూసుకోండి!"

వాళ్ళిద్దరు కళ్ళు తుడుచుకున్నారు.

అంత చిన్నతనంలో ఆ అబ్బాయి కేమిటీ విపరీతం!!

దరిద్రం, ఒంటరి బతుకు, ఒంటి కష్టం!! ఆ బలహీనుణ్ణి మరింత హీనం చేసివేసాయి! ఆ గుండెలో మినుకు మినుకుమనే దీపం, ఏ నిముషం ఆరిపోతుందో తెలీదు!!

"సార్! మీరు ఏడవకండి! మీ రేడిస్తే నాకు చాలా భయమేస్తూంది!" అన్నాడు ప్రసన్న.

"మీరు పెద్దవాళ్ళు! నన్ను వూరుకో బెట్టాలి! అలాంటిది మీరే...."

తార ఆ అబ్బాయిని, తన కన్న కొడుకులా ఒళ్ళో తలవుంచుకు, జుత్తు నిమిరింది. తమకి పిల్లలు కలగకపోయినా, ఈ అబ్బాయిని తమ సంతానంలాగే చూసుకొంటున్నారు!

ఆ ముచ్చటా తీరిపోతుందా!!....

ప్రసన్న బాబాయికి వైరిస్తామని వాళ్ళు అంటే వద్దన్నాడు ప్రసన్న. వాళ్ళని బాధపెట్టడం తన కిష్టంలేదని చెప్పాడు. వూరుకున్నారు.

ప్రసన్నని డ్యూటీకి వెళ్ళవద్దన్నారు రవిచంద్ర, తార.

"వెళ్ళకపోతే ఎలా?"

"ఎలా లేదు, ఏం లేదు! వెళ్ళొద్దు!"

"మీకు తెలీదు! నా జీవనం ఎలా?"

"మేం వున్నామయ్యా! నీ తిండికేం ఫర్వా లేదు లే! ఇల్లంటావా? మేం కడతాంలే!"

"వూరుకోండి సార్! మీకే వుద్యోగం పోయింది.... జీతం లేదుగదా!"

"చూడు ప్రసన్నా! మాకు వుద్యోగం లేకపోయినా జరుగుబడి వుంది. మద్రాసులో రెండిళ్ళమీద అద్దెలొస్తాయి. ఏదో ఒంత పంట వస్తుంది. నువ్వు ఆలోచించడం మానేసి రెస్టు తీసుకో."

"సార్! ఈ రోజుల్లో వుండాల్సిన వాళ్ళుగారు సార్ మీరు!" ఏడ్చేసేడు ప్రసన్న.

* * *

ఆ అబ్బాయి కోరికమీద రవిచంద్ర ఐయ్ స్పెషలిస్టు పాణి దగ్గరికి వెళ్ళేడు ప్రసన్నతో కలిసి. తనకి మళ్ళా కళ్ళు వస్తాయంటూ దేమిటి ప్రసన్న? పోయిన కళ్ళు అలానే పావుగదా!!

ప్రసన్న పట్టుబట్టేడు.

"అలా నిరుత్సాహపడకండి సార్! ఏమో! మీకు మళ్ళా చూపొచ్చే ప్రాప్తం వున్నదేమోనని నాకా రోజున డాక్టరు మాటలవలన గట్టిగా అనిపించింది సార్! మీ అదృష్టం సార్! కార్నియా ఒక్కటే దెబ్బతిని వుంటే మాత్రం.... మీకు

డాక్టరుగారు పునర్జన్మ నివ్వగలరు!" అని చెప్పేడు.

ఆ మాటలకి రవిచంద్రతోబాటు తారకి ఆనందంతో ఒళ్ళు చిన్నగా కంపించింది. ప్రసన్న మాటే నిజం అయితే తమంత అదృష్టవంతు లుండరు.

డాక్టర్ పాణి రవిచంద్రని పరీక్ష చేశాడు.

ఆయన ముఖం సంతోషంతో వికసించింది.

"మీరు లక్కీ ఫెలో!" అన్నాడు.

ఆ క్షణం రవిచంద్రకి లోకం పూల తేరులా, తనందులో చోదకుడిలా అనిపించింది. డాక్టరుకి థాంక్స్ చెప్పి అక్కడే ప్రసన్నని గట్టిగా కౌగలించుకున్నాడు.

ఆపరేషను ఎప్పుడు చేస్తారని అడిగేడు రవిచంద్ర. పాణి తన వద్ద బ్యాంకులో ప్రస్తుతం కళ్ళదాతల పేర్లు నమోదయి వున్నవి. ఎవరయినా కళ్ళు ఇచ్చినట్లయితే మీకు ఆపరేషన్ చేస్తాను" అని చెప్పేడాయన.

వాళ్ళిద్దరు ఇంటికి వచ్చేరు

"నా జన్మ పరిపక్వం కావడానికి ఇంకా కొంతకాలం వుంది" అని రవిచంద్ర భార్యకి చెప్పేడు.

ఆరోజు వుదయంనించీ ప్రసన్న చూస్తున్నాడు. వింటున్నాడు. ఆఫీసరు గారు, భార్యా పడే అవస్థని.

ఆవిడెందుకో విసుక్కుంటున్నది. ఆయన "ఎందుకే, అలా చిరాకుపడతావు! తొందర్లో నాకు కళ్ళు వచ్చేస్తాయి గదా! ఈ లోపున నువ్వు అస్తమానమూ నా మీద చిరాకుపడకు! కొంచెం నీ కోపాన్నీ, విసుగునీ అరికట్టుకో!" అంటున్నాడు.

ప్రతిరోజూ ఆయన దేనికో ఆవిడని బతిమాలడం, ఆవిడ చిరాకుపడడం తను వింటున్నదే! చూస్తున్నదే! ఈ రోజు వాళ్ళ మాటల్లో మార్పు వచ్చింది! సార్‌గారి మనసులో ఆశాదీపం ఆరిపోయిందల్లా మళ్ళీ వెలిగింది.

తనే వెలిగించేడు!

తార అంటోంది! "ఆ డాక్టరుమాట సరే! మన బతుకూ సరే! ఎవరో ఎప్పుడో ఇస్తే, అప్పుడు చూద్దామన్నాడా? బావుంది! అసలికి మనం కొండెక్కిపోతాంలెండి!"

ఆయన ఆవిడని పిలుస్తున్నాడు. ఆవిడ మాట్లాడుతోందేగాని, ఎందుకు పిలుస్తున్నాడని అడగటంలేదు. ఆయన బతిమాలుతున్నాడు. విసుక్కొంటున్నాడు మాలుగుతున్నాడు. అంతా ప్రసన్న గమనిస్తున్నాడు.

తార లోపలిగదిలోకి వెళ్ళడం చూసి, ప్రసన్న నెమ్మదిగా రవిచంద్రని సమీపించేడు. ఆయన అవసరం ఏమిటో అడగవచ్చా? అనడిగేడు.

రవిచంద్ర వెంటనే ప్రసన్న చేతులు పట్టేసకున్నాడు. "బాబ్బాబూ! నువ్వు వచ్చేవా! నా పాలిట దేవుడిలా వచ్చేవు!



చచ్చిపోతున్నాననుకో ఇందాకటినించీ! ఆవిడని పిలిస్తే చూడు! విన్పించుకోవడం లేదు!" అన్నాడు.

మంచమ్మీద కూచుని వున్నాడాయన. కట్టుకున్న లుంగిలోకి నల్లి దూరి కుడుతోంది, చాలా సేపటినించీ! దాన్ని వెతకలేడాయన! స్పర్శకి అది దొరకడం లేదు! కుట్టి చంపుతోంది! ఆ అవస్థ ప్రసన్న హృదయాన్ని ద్రవీభూతం చేసింది. నల్లిని వెదికి, చంపేసేడు. కళ్ళు తుడుచుకున్నాడు.

"అమ్మయ్యా! రక్షించేవయ్యా బాబూ! నువ్వు రాకపోతే నా పని నరకమే!" అని రవిచంద్ర మళ్ళా కుదురుగా కూచున్నాడు.

వాళ్ళిద్దరూ అన్నంతినీ, ఒక్కసారి అలా బయటికి వెళ్ళివస్తానని చెప్పి వీధిలోకి ప్రసన్న బయల్దేరేడు. వాళ్ళిద్దరూ అతనికి మున్నుడు మూడు జాగ్రత్తలు చెప్పేరు.

అలా వెళ్ళినవాడు ఎంతసేపయినా ఇంటికిరాలేదు.

రవిచంద్ర, తార గాబరాపడిపోయేరు. ఎక్కడికి వెళ్ళేడో తెలీదు! మళ్ళా పేపర్ల వుద్యోగానికి బయలుదేరేడేంటి చెప్మా! మొండివాడు! మళ్ళా ఏం తెచ్చుకుంటాడో ప్రాణంమీదికి!....

వాళ్ళ ఆలోచన సరిఅయినదే ప్రసన్న ఇంటినించి మొదట డాక్టర్

పాణి దగ్గరికి వెళ్ళేడు. పాణితో, తను చనిపోతే, తన కళ్ళని, తమ ఇంటిలో వున్న ఆఫీసరు రవిచంద్రకి అమర్చమని కోరాడు.

"అలాగే! కాని.... ఇప్పుడు, మీరు చనిపోవడం ఎందుకు? అర్జెంటుగా?"

ప్రసన్న నవ్వేసేడు.

అవును! అర్జెంటే!! ఇంకెంతకాలం వుంటాడిలా? ఎక్కడికీ కదలక? ఏ పనీ చేయక? ఎన్నో జాగ్రత్తలతో!! నిమిష నిమిషం క్రుంగిపోతూ!! తనకీ బ్రతుకు చాలా దుర్భరంగా వుంది!! ఒకసారి ఎటాక్ వచ్చింది! మరోసారి వస్తే ప్రాణాంతకం!! అంటే మృత్యువు సగం దూరంలోనే వున్నది, తనకి!! అదెలానూ తనని వదలదు!!

రవిచంద్ర పరిస్థితి చూడలేకపోతున్నాడు తను! తనీ జన్మకి ఎలానూ సుఖపడడు! ఆయన కయినా పునర్జన్మనివ్వాలి!....

డాక్టరు పాణి దగ్గర, ఆ హామీని తీసుకొని, ప్రసన్న బయల్దేరాడు. పేపర్లు పంచే పనికి మళ్ళా కుదురుకున్నాడు. డ్యూటీలో ప్రవేశించేడు. సైకిలు తీసుకుని, అది వరకులేని స్పీడుతో తొక్కసాగాడు, వెర్రెత్తినట్టు. అన్ని ఇళ్ళల్లో పేపర్లివ్వడం చాలా త్వరగా జరిగిపోయింది!!

అయిపోయింది! తన పనికూడా ముగిసిపోయింది అనుకున్నాడు ప్రసన్న, గుండె పట్టుకుని. ఇంటికి వెళ్ళలేదు. సరాసరి పాణిగారి దగ్గరికి వెళ్ళేడు.

రవిచంద్ర, తారకి కబురు తెలిపాడు పాణి. తన అసిస్టెంటుని వారింటికి పంపి. వాళ్ళు అఘమేఘాల మీద వెళ్ళేసరికి—

ప్రసన్న శరీరం మాత్రం మిగిలి వున్నది అక్కడ! "ఎంత పని చేశావయ్యా!?" అంటూ వాళ్ళు గొల్లుమన్నారు.

ప్రసన్న కోరికమీద, అతని కళ్ళల్లోంచి, రవిచంద్ర మళ్ళా ఈ లోకాన్ని చూశాడు. "మీలో మీరిద్దరూ వున్నారండీ! ఇద్దరికీ ఇది పునర్జన్మే!..." అన్నది తార.



# వేకువ వెలుగు

నందుల సుశీలాదేవి

గది తాళంతీసి లోపలకు అడుగుపెట్టింది విరజ.

శని, ఆదివారాలు ఉష సాధారణంగా వుళ్ళో వుండదు.

ఒంటరిగా వుండటంతో చిరాగ్గావుంది. మేట్నీకి వెళ్ళివచ్చింది.

ఆ సినిమా చూసేక తలనొప్పి మరింత ఎక్కువయింది.

అలసటగా మంచం మీద వాలిపోయింది. తెల్లవారితే ఉష వస్తుంది.

గలగలా కబుర్లుచెప్తూ పరిసరాలన్నింటినీ చైతన్యవంతం చేసేస్తుంది.

"ఉప్పాడ" వెడతానని చెప్పింది.

వస్తూ ఒకటో రెండో జరీ చీరలు కొనితెస్తుంది. అవిడలో జలపాతం!

కాకినాడలో ఒంటరిగా వుండేవాళ్ళకు సాయంత్రాలు గడపటం కష్టం.

సినిమా తప్పితే మరో వ్యాపారం వుండదు.

గుమ్మం దగ్గర చప్పుడయింది.

క్రింద వాటాలోని అరవ్వాళ్ళ అబ్బాయి "ఆంటీ" అంటూ వచ్చేడు.

వాడి చేతిలోని టెలిగ్రాం తీసుకొని అడిగింది. "ఇది ఎప్పుడు వచ్చింది బాబూ!"

"ఆఫ్టర్‌నూన్‌దా వచ్చింది" అంటూ పరుగెత్తుకొని పోయేడు.

క్షణం తటపటాయించింది.

మరుక్షణం టెలిగ్రాం చింపి చదివింది. క్రింద పెదవి దుఃఖంతో వణికింది.

చాలాసేపు నిశ్శబ్దంగా వుండిపోయింది.

తరువాత చటుక్కున లేచింది.

రెండు చీరలు బేగ్‌లో పడేసుకొంది.

రూంమేట్ ఉషకు వో నాల్గువాక్యాలు వ్రాసి టేబిల్‌మీద పెట్టింది.

ఇంతలో పనిమనిషి వచ్చింది.

"కాఫీతేనా అమ్మా!" అంది.

విరజ టైము చూసుకొని అంది.

"వద్దులే సీతా! నేను అర్జెంటుగా వూరికి వెడుతున్నాను. ఈ సెలవు చీటీ మా ఆఫీసులో యిచ్చేయి. ఉషమ్మగారు రేపు వస్తారు."

గదికి తాళంపెట్టి 'కాంప్లెక్స్'కి వెళ్ళే సరికి రాజమండ్రి వెళ్ళే 'నాన్‌స్టాప్' బయల్దేరడానికి సిద్ధంగా వుంది.

శారదా నర్సింగ్‌హోం ముందు రిక్షా దిగేసరికి చీకట్లు ముసురుకొంటున్నాయి.

తిన్నగా డాక్టరు గదిలోకి వెళ్ళింది.

డాక్టరుని విష్‌చేసి చేతిలో టెలిగ్రాం చూపించింది.

"సో మీరన్నమాట ఆ ముసలావిడ కూతురు. ఆవిడ యీ వయస్సులో వంట రిగ్ వుండటం ఏమిటి? హై బ్లడ్ ప్రెషర్ వుంది. షుగర్ వుంది. మగతలోవున్న ఆవిడను పక్కింటివాళ్ళు యిక్కడ జాయిన్‌చేసి మీకు టెలిగ్రాం యిచ్చేరు. రండి చూద్దురుగాని."

విరజ డాక్టర్ శారదను అనుసరించింది.

తెల్లటి పక్కమీద పండిన తమల పాకులావున్న ఆ వృద్ధురాలిని చూస్తూ శారద అంది.

"ఈ రాత్రి గడవటం చాలా కష్టం. సిస్టర్స్ రాత్రంతా చూసుకొంటూనే వుంటారు. నేను మేడమీదనే వుంటాను ఏ రాత్రయినా రాగలను. ఈ ఆఖరి క్షణాలలో మీరు దగ్గర వుండటం ఒకటే ఆవిడకు సంతోషంగా వుంటుంది. ఏ క్షణమైనా కొంచెం తెలివి వచ్చినా రావచ్చును. లేదా యీ మగతలోనే ఆఖరి శ్వాస పీల్చవచ్చును. నిన్న సాయంత్రం నుండీ నా శక్తికొద్దీ వైద్యంచేస్తూనే వున్నాను. మీరు వచ్చేరు. నా బాధ్యత కొంత తగ్గింది."

విరజకి కంఠంలో వుండకట్టినట్లు అయింది.

మంచానికి చేరువగా కుర్చీ వేసుకొని కూర్చుంది.

ఆ వృద్ధురాలి చేతిని తన రెండు చేతుల్లోనూ తీసుకొంది.

నెమ్మదిగా ఆ చేతిని నిమరసాగింది.

గంటలు నెమ్మదిగా కరిగిపోతున్నాయి.

రాత్రి పదిగంటల ప్రాంతంలో మంచంమీద ఆవిడలో కొద్దిగా చలనం కనిపించింది.

విరజ ఆవిడ తలను తన వడిలోనికి తీసుకొని దగ్గరగా వంగింది.

ఆవిడ బలవంతాన కళ్ళు తెరవడానికి ప్రయత్నించేసింది.

"చిట్టీ! వచ్చేవా?"

శుష్కించిని ఆవిడ మొహంలో లీలగా ఆనందం వెల్లివిరిసింది.

విరజ చేతిని గట్టిగా పట్టుకొని గుండెలమీదకు లాక్కుంది.

అంతలో మగత కమ్మేసింది.

కాలం నెమ్మదిగా దొర్లిపోతోంది.

మధ్యలో సిస్టర్ వచ్చి బీపి చూసి ఇంజక్షన్ చేసి వెళ్ళింది.

పదకొండు గంటల వేళ శారద రౌండ్సుకి వచ్చినప్పుడు విరజ ఆ వృద్ధురాలికి సమీపంలో స్థిరంగా కూర్చొని, ఆ వృద్ధురాలి చేతిని సున్నితంగా పట్టుకొని నిమురుతూ కనపడింది.

శారద వచ్చి రోగిని పరీక్షించి అంది. "మీరు కాసేపు విశ్రాంతి తీసుకోండి. ఆవిడ కోమాలో వున్నారు. సిస్టర్ చూస్తూ వుంటుంది."

విరజ సున్నితంగా రోగి చేతిని నిమురుతూ అంది.

"పర్వాలేదు డాక్టర్! ఏ క్షణానయినా తెలివివస్తేమో! నేను ఇక్కడే వుంటాను."

విరజకి తల్లియెడల గల ప్రేమకు, శ్రద్ధకు శారద వో క్షణం చింతించింది.

ఎక్కింటివాళ్ళు చెప్పిన ప్రకారం వృద్ధురాలికీ, కూతురికీ అంతగా సయోధ్య లేదనీ, సంపన్నురాలైన తల్లి, వుద్యోగస్థురాలైన కూతురు ఎవరికి వారే వంటరిగా బ్రతుకుతున్నారనీ తెలిసింది.

కాని రక్తసంబంధం ఆఖరిక్షణాలలో వీరిద్దరినీ ఎంతగా కలిపింది– అనుకుంది.

డ్యూటీ సిస్టర్ ఆ రాత్రి ఏ వేళలో వచ్చిచూసినా విరజ స్థిరంగా అట్లాగే కూర్చునివుండటం చూసేది

తెలతెలవారుతుంటే వో క్షణం ముసలావిడకు తెలివివచ్చింది.

మసకలు కమ్మిన కళ్ళతో విరజను చూసి "చి... ట్టీ...." అంది అస్పష్టంగా. మరుక్షణం తల వాల్చేసింది.

విరజ ఆవిడ చేతిని నెమ్మదిగా పక్కమీద పెట్టిలేచింది.

సిస్టర్ని పిలిచింది.

ఆవిడవచ్చి తొందరగా వెళ్ళి శారదను పిలుచుకొని వచ్చింది.

శారదవచ్చి పరీక్షించి అంది.

"సారీ! నా ప్రయత్నం నేను చేసేను."

విరజ నిశ్శబ్దంగా నిలబడిపోయింది. మౌనంగా డాక్టర్ వెంట ఆవిడ గదిలోనికి వెళ్ళింది.

శారద అంది.

"మీరు రావటంవలన ఆఖరిక్షణాలలో ఆవిడకు శాంతిగా వుండి వుంటుంది. కన్నబిడ్డ చేతిలో ప్రాణాలు వదలాలనే ఏ తల్లి అయినా కోరుకొంటుంది."

విరజ మృదువుగా అంది.

"నేను ఆమె కన్నబిడ్డను కాను."

శారద ఆశ్చర్యంగా ఏదో అనబోతూ వుంటే, తిరిగి విరజ అంది.

"నిజమే డాక్టర్! నేను ఉషను కాను. ఆవిడ రూంమేట్ విరజను. నిన్న ఆదివారం కదా. సినిమాకి వెళ్ళి సాయంత్రం రూంకి రాగానే ఉషకు వచ్చిన టెలిగ్రాం చింపి చదివేను. ఉష తల్లి పరిస్థితి గంటల్లో వుందని తెలిసింది. ఉష యీ వుదయానికికాని రాదు. ఆదివారం గడిపి సోమవారం ప్రొద్దుటే వస్తుంది."

శారద విభ్రాంతినుండి తేరుకోలేదు.

"ఆవిడ ఎక్కడకు వెళ్ళేరు?"

విరజ నెమ్మదిగా అంది.

"ఉష సాధారణంగా వీకెండ్ తన బాయ్‌ఫ్రెండుతో గడిపి సోమవారం ఆఫీసుకి వస్తుంది. ఈ పాటికి నేను తనకి వ్రాసిన వుత్తరం చూసుకొని బయల్దేరే వుంటుంది...."

శారద విస్మయంగా అంది.

"అయితే.... అయితే.... రాత్రంతా ఒక్క క్షణం వదలకుండా ఆవిడ దగ్గర కూర్చొని ఆవిడను చేతుల్లోనే వుంచుకున్నారు."

విరజ కొంచెం సేపు నిశ్శబ్దంగా వుంది.

తరువాత నెమ్మదిగా అంది.

"ఆ మగతలో ఆవిడ నన్ను తన కూతురే అనుకొన్నారు. మృత్యుముఖంలో వున్న ఆవిడకు కన్నకూతురు దగ్గరే వుందన్న సంతృప్తిని నేనెందుకు పోగొట్టాలి! ఒక్క రోజు నిద్రలేక పోతే వచ్చిన నష్టం ఏముంది? ఉష తల్లికి ఆ సమయంలో నేను వ్యగలిగిన సంతృప్తిముందు నా జీవితంలో నేనేమి ఎంత కష్టం చేసినా గొప్ప అనుభూతిని మరి పొందలేను."

కాసేపు ఆగి విరజ అంది తిరిగి.

"ఓ గంటకో అరగంటకో ఉష వచ్చేస్తుంది. అవసానదశలో తల్లి దగ్గర లేకపోయానే అనే చింత ఆమెకి వుండదు. ఓ స్నేహితుడితో హాయిగా గడపడానికి తను వెళ్ళినందువలన తల్లి పరిస్థితి తనకు తెలియకుండా పోయిందనే ఆత్మన్యూనతతో తనూ జీవితమంతా బాధపడాలి. ఇటు ఉషకీ, అటు ఉష తల్లికీ కూడా నేను యిట్లా రావటం ఓ రకమైన మనశ్శాంతినే కలుగజేశాయి. ఓ రాత్రి నేను నిద్రపోక పోతే మాత్రం వచ్చే నష్టం ఏమిటి డాక్టర్?"

చాలా సామాన్యంగా చెప్పుకొని పోతున్న విరజ మాటలకు శారద రెండు కళ్ళూ నీటితో తళతళలాడేయి.

"విరజా! నేను వృత్తిరీత్యా డాక్టర్ని. ప్రమాదాలలో మరణించిన పసిపాపలను పోస్ట్‌మార్టమ్ చేసినప్పుడు కూడా యింత చలించలేదు. ఏకైక సంతానాన్ని పోగొట్టుకొని విలపించే తల్లిదండ్రులు నా వృత్తిలో తటస్థపడతారు. అప్పుడు కూడా నా మనస్సు యింత చలించలేదు. కుటుంబానికంతా ఆధారమైన వ్యక్తి దూరమయి విలపించే కుటుంబాలూ, పుడుతూనే తల్లిని పోగొట్టుకొనే శిశువులనూ నిరతమూ చూస్తూనే వుంటాము. కాని ఏ విషయంలో నన్ను నేను నిగ్రహించుకోవటానికి చాలా శక్తి కావాలసివస్తోంది. తోటి మనుష్యులపట్ల మానవత్వం యింతగా చూపించినవారు నాకు యింతవరకూ తటస్థపడలేదు. కొద్దిసేపట్లో ఉషగారు వచ్చాక తల్లి అంత్యక్రియలు ఆవిడ జరుపుతారు. కాని కాని విరజా! మిమ్మల్ని చూసి నేను గర్వపడుతున్నాను."

విరజ చేతిని శారద ప్రేమగా, గౌరవంగా నొక్కింది.

తూరుపు తెలతెలవారుతోంది.

---

# ఈ జీవితం నాది!

## సీరియల్

(గత సంచిక తరువాయి)

ఆ తర్వాత మధుర ఏమైందో, ఎక్కడుందో నాకు తెలియలేదు. నా జీవితానికి వున్న ఒకే ఒక ఆలంబన మధుర। ఆ ఆలంబన కూడా యిలా హఠాత్తుగా భగవంతుడు ఎందుకు తెంచేసాడో నాకు అర్థం గావటంలేదు. నేను, మధుర నాకు కనిపించకుండా వెళ్ళిపోవటం భరించలేకపోతున్నాను. నాకు డబ్బు యిబ్బంది ఏమాత్రం లేదు। మధుర వెళ్తూ, నాకు ఆ ఆపద రాకుండా చేసి వెళ్ళింది। అయినా నాకు ధైర్యంగా లేదు। ఈ ప్రపంచంలో రెండు రకాల మనస్తత్వాలు గల వ్యక్తులున్నారు. వారిలో ఒకరికి, బాంక్‌లో పుష్కలంగా డబ్బు వుంటే చాలు. ఈ ప్రపంచంలో యింకెవరూ అవసరంలేదు. వారు డబ్బుని నమ్ముతారు। డబ్బుని ప్రేమిస్తారు। డబ్బుని ఆరాధిస్తారు; డబ్బే వారికి తోడు, నీడా సర్వస్వం। ఇంకోరు అలా కాదు। వాళ్ళకి సాటిమనిషి తోడు కావాలి। ఆ మనిషి తోడు లేకపోతే వెన్నెముక లేనట్టే కృంగిపోతారు. ఈ ప్రపంచంలో యింకా అయిశ్వర్యాలూ వారిని సంతృప్తిపరచలేవు. ఆనందం కలిగించలేవు. మనోబలం యివ్వలేవు. నేను అలాటి కోవకి చెందినదాన్ని। నాకు చిన్నప్పటినుంచీ నా అనేవారు ఎవ్వరూ లేకపోవటంవల్లనేమో, ఎవరో ఒకరికి నేను దగ్గరగా వుండాలని నా తాపత్రయం। నా అనేవాళ్ళు లేని జీవితం ఎంత భయంకరమో, ఆ బాధ అనుభవించిన నాలాంటి వాళ్ళకే తెలుస్తుందేమో।

నేను నర్మదావాళ్ళ నాన్నగారి దగ్గరికి వెళ్ళాను 'మధురని ఆ డానీ బలవంతంగా తీసుకువెళ్ళి వుంటాడండీ.' అన్నాను. ఆయన నా బాధ అంతా సానుభూతిగా విన్నారు. తర్వాత, "చూడమ్మా, ప్రియా। మధుర, డానీ యిద్దరూ పెళ్ళిచేసుకున్నారు. వారిద్దరూ చట్టపరంగా భార్యాభర్తలు. డానీ, మధురని ఎక్కడికైనా తీసుకు వెళ్ళవచ్చు కాదు అనే హక్కు మన కెవ్వరికీ లేదు."

---

యద్దనపూడి సులోచనారాణి

"కానీ డానీ చాలా దుర్మార్గుడండీ! మధురని నానా బాధలు పెడ్తాడు. అతను మధురని ఎంత నరకం పెడ్తాడో మీకు తెలియదు...." నా కళ్ళలోకి నీళ్ళు వచ్చేసినాయి.

అయన నా భుజంమీద మెల్లగా తట్టారు. "ప్రియా! నీ స్నేహితురాలి కోసం నువ్వు పడ్తున్న అదుర్దా నా కర్థయింది! కానీ ఒక్క సంగతి మర్చి పోతున్నావు. మధుర తెలివితక్కువది కాదు! తను కావాలని, డానీమీద వ్యామోహంతో, ఆ నరకంలోకి నడుచుకుంటూ వెళ్ళింది." ఆయన నన్ను వదిలి చేతులు వెనక్కి పెట్టుకుని, గదిలో అటుయిటూ తిరుగుతూ గంభీరంగా చూస్తూ అన్నారు. "ప్రియా! ప్రతి వ్యక్తీ ముఖ్యంగా మీ ఆడపిల్లలు ఒక్క విషయం తెలుసుకోవాలి. జీవితం అంటే యవ్వనంలో ఎదురయ్యే వ్యామోహం ఒక్కటే కాదు! జీవితం అంటే, పెళ్ళి, సంసారం, పిల్లలు, సంఘంలో పరువుగా బ్రతకటం! ఇదంతా కలిస్తేనే పరిపూర్ణమైన జీవితం. బ్రతికిన నాలుగురోజులూ, నలుగురిలో కలసి, ఒక చెట్టుకున్న వేలాది ఆకుల్లో మనమూ ఒకరుగా బ్రతకాలి. ఆకు, చెట్టునుంచి విడిపోయి బ్రతకటం ఎంత కష్టమో, మనిషి యీ సంఘం నుంచి దూరం అయి బ్రతకటం కూడా అంత కష్టం! అవును! యీ సంఘం కూడా ఒక చెట్టులాటిదే! మనం దానిని అంటిపెట్టుకొని వుంటే, మనకి కానుకగా, కొన్ని సుఖాలు దొరుకుతాయి. ఆ సుఖాలు ఏమిటంటావా! వాటి పేర్లు నిశ్చింత, నిర్భయం. అనుకో! ఒక ఆదర్శం కోసం, ఒక కర్తవ్య నిష్ఠకోసం, మనిషి తన నుంచి విడిపోతే సంఘం అతని వ్యక్తిత్వాన్ని మన్నిస్తుంది. అతన్ని శిక్షించకుండా, అభినందించటానికి ప్రయత్నిస్తుంది! కానీ ఒక మామూలు మనిషి, స్వసుఖం కోసం, ఒక వ్యామోహం కోసం, తననుంచి దూరం అయితే సంఘం క్షమించదు! మధుర 'నా యిష్టం' అంటూ డానీ వ్యామోహంలోపడి అతన్ని వివాహం చేసుకుంది. ఇక ఆమెకి ఎవరూ సాయంచేయరు!

'ఈ జీవితం నాది!' అనుకుని స్వార్థపరంగా ఆలోచించినవాళ్ళు, వాళ్ళ కష్టసుఖాలు వాళ్ళు అనుభవించాల్సిందే! నువ్వు మధురని మర్చిపో! నీ చదువు మీద మనసు లగ్నంచేసుకుని, నీ భవిష్యత్ గురించి ఆలోచించుకో! ఇంకెప్పుడు నా దగ్గరకి మధుర విషయంలో సాయంచెయ్యి అంకుల్ అంటూ రావద్దు" అన్నారాయన.

నేను తెల్లబోయినిల్చే చూసాను!

ఆయన ఫోన్ రాగా వెళ్ళిపోయారు.




నర్మద నా చెయ్యి నొక్కుతూ అంది. "ప్రియా! మా డాడీ ఆ చెప్పిన లెక్చరంతా నీకు గాదు! నాకు!"

"నీకా!" అన్నాను ఆశ్చర్యంగా

"అవును! నేను, మా అన్నయ్య స్నేహితుడు ఒకతన్ని చేసుకోవాలని అనుకుంటున్నాను. అతను ముస్లిం. ఈ విషయం మా డాడీకి తెలుసు! అయినా, దాన్ని గురించి నేను, ఆయనా సూటిగా, ముఖాముఖీ మాట్లాడుకోం. కానీ ఒకటి మాత్రం నేను కూడా చెబుతాను. నువ్వు మధుర గురించి మర్చిపోవటం మంచిది. ఆమెకి నీమీద యిష్టం వుంటే నిన్ను వదిలి వెళ్తుందా!" అంది.

నేను హాస్టల్‌కి వచ్చేసాను!

అందరూ ఒకేమాట!

మధురని మర్చిపో! మర్చిపో!

మధురని మర్చిపోగలిగితే యింత ఆరాటం దేనికి!

నేను నా చదువుమీద మనసు లగ్నంచేసుకోలేకపోతున్నాను! భోజనం తింటున్నా సహించటంలేదు! ప్రియమైన తోబుట్టువుని పోగొట్టుకున్న సోదరిలా, కన్నబిడ్డని పోగొట్టుకున్న తల్లిలా, నా మనసు దుఃఖపడ్తోంది! పరితపిస్తోంది!

నేను ఆ రోజు బ్యాంక్‌కి వెళ్ళాను.

"నీ పేరిట. నా అడ్రస్‌కి ఒక కవరు వచ్చిందమ్మా! ఆయన తీసి అందించారు.

నేను ఆత్రంగా తీసుకొని చూసాను. అది మధుర వ్రాసినదే. అందులో రెండువేల రూపాయలకి డి.డి. వుంది.

"ప్రియా!

నా గురించి ఎప్పుడైనా ఆలోచిస్తున్నావా? నా మీద కోపం తెచ్చుకున్నావా? ప్లీజ్! తెచ్చుకోవద్దు! నేను ఎక్కడున్నా నిన్ను మర్చిపోను. నేను బ్రతికినా, చచ్చినా నీ స్నేహితురాలినే! డానీ వస్తాడు. వస్తే పెద్ద గొడవ. త్వరగా ముగిస్తున్నాను. నా గురించి దిగులుపడకు. నేను కులాసాగానే వున్నాను. అమ్మ ఎలా వుంది! అమ్మని నువ్వే చూడాలి. ఇప్పుడు అర్థం అవుతోంది! అమ్మని వదిలి పెట్టడం ఎంత మూర్ఖత్వమో! ఏ విషయం అయినా, చెయిజార్చుకున్న తర్వాత గానీ తెలిసిరాదేమో! ప్రియా! నువ్వు బాగా చదువుకో! నేను పెళ్ళికి తొందరపడి చాలా పొరపాటుపని చేసాను. ఇప్పుడు పశ్చాత్తాపడి ఏం ప్రయోజనం! నిప్పులో పడేముందే జాగ్రత్త వుండాలి! పడిన తర్వాత యిక కాలడం తప్ప యింకేమీ వుండదు. వుంటాను.

నీ

మధుర."

నాకు నిన్ను, అమ్మని చూడాలని, మీ దగ్గరగా వుండాలని ఎంతగానో అనిపిస్తోంది! కానీ వీలేకాదు. పారిపోయి వచ్చేటందుకు కూడా వీలుకాదు. నేను చాలా దురదృష్టవంతురాలిని ప్రియా! నే నంటే కాస్త కూడా యిష్టంకాని, గౌరవంకాని, లేని ఒక జంతువుకోసం, నేను నీకు, అమ్మకి దూరం అయిపోయాను! ఈ ప్రపంచంలో ప్రాణస్నేహితురాలిని దూరంచేసుకోవటం కంటే, మహా దురదృష్టం యింకేదీ లేదేమో. ప్రియా– ఒకసారి– కారుచప్పుడు అయింది. డానీ వస్తున్నాడు– ముగించేస్తున్నా. మధు...."

క్యాషియర్‌గారు డి.డి.ని నా బాంక్ ఎకౌంట్‌లో జమచేస్తూ "నువ్వు చాలా అదృష్టవంతురాలివమ్మా! నీ స్నేహితురాలు ఎప్పుడూ నీకు డబ్బు పంపిస్తుంటుంది" అన్నాడు.

నేను నిట్టూర్చాను. అవును! ఆ స్నేహితురాలి దగ్గరనుంచి అన్ని సాయాలు పొంది, ఆమెకి ఏమీ చేయలేని దురదృష్టవంతురాలిని.

నేను బాంక్‌నుంచి వచ్చేసాను. ఆ విధంగా నా బాంక్‌లో అడపాదడపా మధుర పంపిన డబ్బు వచ్చి చేరుతూనే వుంది.

నేను ఆ డబ్బుని చాలా పీనాసిదానిలా తూచి తూచి ఖర్చుచేసేదాన్ని। నా చదువు పూర్తిఅయి నాకు వుద్యోగం వచ్చేవరకూ యీ డబ్బే నాకు ఆలంబన. ఒక్కోసారి మధురని తలుచుకొంటుంటే ఏడుపు వచ్చేది. నేను యింత నిశ్చింతగా అన్నం తింటున్నానంటే, యీ హాస్టల్ గదిలో, యీ మెత్తటి పరుపుమీద పడుకొని నిశ్చింతగా చదువుకుంటూ నా భవిష్యత్‌కి పునాదులు వేసుకుంటున్నానంటే మధుర డబ్బే కారణం।

ఈ డబ్బు లేకపోతే నా జీవితం ఎలా వుండేది। వుండటానికి నిలవ నీడలేక, తింటానికి అన్నంలేక ఏమయిపోయేదాన్ని। 'మధురా। నువ్వు దూరంగా వున్నావని అనుకుంటున్నాను నాదెంత పొరపాటు। నువ్వు దూరంగా లేవు. నా దగ్గరే వున్నావు. నువ్వు నాకింత వుపకారం చేస్తున్నావు. నేను నీ ఋణం ఎలా తీర్చుకోగలను।' దిండులో ముఖం దాచుకుని ఏడ్చేసేదాన్ని। మధురలాటి స్నేహితురాలు దొరికిన నేను ఎంత అదృష్టవంతురాలిని। నేను నిజంగా చాలా అదృష్టవంతురాలిని।

*   *   *

నా చదువు పూర్తిఅయింది. మధుర దగ్గరనుంచి వుత్తరాలు, డబ్బు రావటం ఆగిపోయింది. డబ్బు నా పేరిట యిప్పటికే యాభైవేలు పైగా జమ పడినాయి. డబ్బు నాకు అవసరంలేదు. మధుర దగ్గరనుంచి వుత్తరాలు ఎందుకు రావటంలేదో నా కర్థంగావటంలేదు. మధురకి ఏమైంది? ఒంట్లో బాగా లేదా। నాకు వుత్తరాలు వ్రాస్తోందని తెలిసి డాపీ బాధపెడ్తున్నాడా। వుత్తరాలు వ్రాస్తే వదిలేస్తానని బెదిరించాడా। ఏమిటో। నాకంతా అయోమయంగా వుంది.

నా చదువు అయిపోతుండగా బొంబాయినుంచి మా నాన్న తమ్ముడు వచ్చాడు. "చదువు అయిపోతుందిగా ఏంచేద్దామని అనుకుంటున్నావు?" అన్నాడు.

"ఏదయినా వుద్యోగం చూసుకుంటాను" అన్నాను.

"వుద్యోగమా। వుద్యోగం నీ కెందుకు।"

"నాది అనే ఆర్థికస్తోమత నా కుండాలి."

"పిచ్చి ఆలోచనలు మాని పరీక్షలు అవగానే బొంబాయి వచ్చెయ్యి. పెళ్ళిసంబంధం చూస్తున్నాను. అజీజ్‌కి నువ్వంటే యిష్టం."

ఈ మాట వినగానే నేను ముఖం తిప్పాను. ఆ అజీజ్ ఎవరో నాకు గుర్తులేదు.

"మాట్లాడవేమిటి!" రెట్టించాడు.

"నా పెళ్ళివిషయం నేను ఆలోచించుకోగలను. మీకు ఆ శ్రమ వద్దు."

"ఏమిటీ! ఎవరితో ఏం మాట్లాడుతున్నావో తెలుసా!" ఆయన కళ్ళెర్ర చేసాడు.

"నాకు బంధువుని అని చెబుతున్న మీతో నా పెళ్ళి ప్రసక్తి తెచ్చారు కాబట్టి నా అభిప్రాయం చెబుతున్నాను."

"ఎక్కువ మాట్లాడకు! చదువుకుని డిగ్రీలు సంపాయించినంత మాత్రాన గొప్పదానివి కావు."

నేను తల దించుకున్నాను! ఈయనతో నాకు తర్కం అనవసరం! నా అభిప్రాయాలు వినటానికి, నా కష్టసుఖాలు గమనించటానికి యీయన రాలేదు. నా కష్టసుఖాలు గమనించేవాడయితే, ఒక్కనాడయినా నే నెలా వున్నానో, ఏం తింటున్నానో ఆరా తీసాడా! నాకు వయసు వచ్చింది. వాళ్ళలో ఒక కుర్రాడికి నేను నచ్చాను. ఇక నా అభిప్రాయంతో పనిలేదు. నన్ను తీసుకువెళ్ళి ఆ పెళ్ళి చేసి, ఆ వ్యక్తితో కాపురంచేసి పిల్లలు కనమంటారా! ఇదీ బంధువుగా ఆయన నాకు చేసే వుపకారం!

ఆయన మళ్ళీ వస్తానని వెళ్ళిపోయాడు.

నా పరీక్షలు అయిపోయినాయి.

హాస్టల్ ఖాళీ చేసేయాలి.

ఎక్కడికి వెళ్ళను? నేను నిలవటానికి చోటేది?

నేను వర్కింగ్ వుమన్ హాస్టల్‌కి వచ్చాను.

ఇక్కడ వాతావరణం వేరుగా వుంది. నా సాటివాళ్ళు అందరూ దాదాపు వుద్యోగస్థులే.

హాస్టల్ వరండాలో స్థంభానికి చేరి పిట్టగోడ దగ్గర కూర్చున్నాను. ఇప్పుడు నా భవిష్యత్ ఏమిటి? నేనేం చేయాలి?

పై చదువు చదవటమా! దానికి డబ్బు కావాలి. మధుర పంపిన డబ్బు బాంక్‌లో నా పేరిట చాలానే వుంది. అయినా సరే! దానిని వాడుకోవటం నా కిష్టంలేదు. మధుర స్నేహపూర్వకంగా, నేను ఎక్కడ యిబ్బందిపడ్తానో అని ఆ డబ్బుని దానికి వ్యతిరేకంగా పంపింది. ఆ డబ్బు చాలా జాగ్రత్తగా వాడాలి! నా అవసరాలకి తీసుకున్నాను. కానీ అది అప్పుగా మాత్రమే! ఎప్పటికైనా సరే నేను వుద్యోగంచేసి, ఆ డబ్బుని మళ్ళీ బాంక్ ఎకౌంట్‌లో వేసి ఆ లోటుని భర్తీచేసి మధుర పంపిన డబ్బుని ఒక్క రూపాయికి తక్కువ కాకుండా, ఆ మొత్తం అలాగే వుంచాలి! అది మధుర డబ్బు! ఎప్పటికైనా మధురకే అందచేయాలి! అదే నా ధ్యేయం!

కలవులు పూర్తిఅయినాయి! రిజల్ట్స్ వచ్చినాయి! నేను ఫస్ట్‌క్లాస్‌లో పాసయ్యాను. జీవితంలో ఒక మజిలీ పూర్తిఅయింది!

"లిటిల్ బేబీ కేర్ సెంటర్"లో నాకు వుద్యోగం వచ్చింది. జీతం మూడువందలు.

నర్మదతో ఎంతో ఆనందంగా చెబితే "ఓస్! జీతం యింతేనా!" అంది.

నాకు యీ జీతం ఎక్కువగానే అనిపించింది. మొదటిసారిగా 'జీతం' డబ్బు చేతుల్లోకి తీసుకుంటుంటే నా కళ్ళు చెమర్చాయి. చిన్నప్పుడు నా కాళ్ళ మీద నేను నిలబడగలిగినప్పుడు పొందిన ఆనందం నాకు గుర్తులేదు కానీ యీ రోజు నేను నిజంగా నా అంతట నేను నిలబడుతున్నట్లు అనిపించింది. పిల్లలంటే నాకు చాలా యిష్టం! అక్కడ పనికూడా ఎక్కువ లేదు. ఇది పెట్టిన మేడమ్‌కి ఎన్నో వ్యాపకాలు! ఆవిడ అక్కడ కావాల్సిన అవసరాలు అన్నింటికీ డబ్బు యిస్తుంది. అది సద్వినియోగపడేలా చూడటం నా బాధ్యత! యిది ఏమాత్రం కష్టం అని! నా కింకేమీ పనిలేదు. వేరే ధ్యాసలూ లేవు. ఎంతో యిష్టంగా ఆ వుద్యోగం చేయసాగాను.

ఒకరోజు నర్మద వచ్చింది.

"రేపు నా పుట్టినరోజు. మా యింటికి రా!" అంది.

నేను మర్నాడు వెళ్ళాను

వాళ్ళ నాన్న వూరిలో లేడు. వాళ్ళమ్మ పెళ్ళికి వెళ్ళింది. ఇంట్లో పిల్లలదే పెత్తనం! చాలామంది వచ్చారు. నర్మద సన్నగా, పొడుగ్గా వున్న ఒక అతన్ని పరిచయం చేసింది.

"ఇతను మా కజిన్ కమలాకరం. అందరం కమల్ అంటాం."

"నమస్తే!" అన్నాను.

"గ్లాడ్ టు మీట్ యూ." అన్నాడతను.

నేను కూర్చుని వుంటే, అతనే టిఫిన్ ప్లేటో తెచ్చాడు. ఐస్క్రీం కప్పు అందించాడు. బి.టెక్ చదువుతున్నాడట. తండ్రి డాక్టరుట. 20 లక్షలకు పైగా ఆస్థి వుందిట. తల్లి, తండ్రి తనంటే ఎలా వణికిపోతారో వర్ణించి చెబుతున్నాడు.

తల్లిమీద కోపంవచ్చి యింటికి వెళ్ళక నాలుగురోజులు అయిందిట! తల్లి ఏడుస్తూ ఫ్రెండ్‌చేత యింటికి రమ్మనమని కబుర్లు చేయిస్తోందిట. అతనికి

ప్రత్యేకం అవిడ కారు కొనిచ్చేవరకూ వెళ్ళదుట! అతని గొప్పలకి నాకు వెగటు అనిపించింది!

నాలుగురోజుల తర్వాత నేను 'బేబీ కేర్ సెంటర్' నుంచి వస్తుంటే, అతను కారులో ఎదురయాడు.

"మీ హాస్టల్ దగ్గర దింపుతాను రండి" అన్నాడు.

"అవసరంలేదు. నేను నడిచి వెళ్తాను." అన్నాను

"ఫర్వాలేదు రండి." అన్నాడు.

మరీ నిర్మొహమాటంగా తిరస్కరించలేకపోయాను. వెనక సీటులో ఎక్కబోతుంటే ముందు డోర్ తెరిచాడు! నేను తిరస్కరించలేకపోయాను. కారు ఎక్కాను అతను కారు స్టార్ట్ చేసాడు! టేప్ ఆన్‌చేసాడు.

"నా యీ కొత్త బర్డ్ ఎలా వుంది" కారుని తట్టుతూ అన్నాడు.

"మీ అమ్మగారు యిచ్చిందేనా యిది!"

అతను ఆశ్చర్యపోయాడు. "అరే! మీకెలా తెలుసు!"

"మీరు ఫ్రెండ్స్‌తో చెబుతుంటే విన్నాను."

"అవును. మా మమ్మీ నాకు కొనిచ్చింది. అవును! మీరు నర్మదా ఫ్రెండ్స్ కదా, మీరు ఎక్కువగా నర్మద దగ్గరకి రారేం! మాతో కలవరేం."

నేను జవాబు చెప్పలేదు. నర్మదకి ఫ్రెండ్‌ని అయితే నర్మద కజిన్‌తో చనువుగా వుండాలా!

అతను కారు వేరేవైపు తిప్పాడు.

"హాస్టల్ అటు" అన్నాను.

"వెదర్ చాలా బాగుంది. కాసేపు తిరిగివద్దాం."

"నో! అవసరంలేదు, కారు ఆపండి." అరిచినట్టే అన్నాను.

అతను బిత్తరపోయినట్టు చూస్తూ కారు ఆపాడు.

నేను వెంటనే కారు డోర్ తెరుచుకుని, దిగేసాను. డోర్ వెంటనే ఠపీమని వేసి, వెనక్కి తిరిగి చూడకుండా మర్యాదకైనా 'వస్తాను' అని అనకుండా హాస్టల్‌వైపు వడివడిగా నడిచి వచ్చేసాను.

ఆ రాత్రి మంచంమీద పడుకొంటే, నాకు అనిపించింది. ఈ స్నేహాలు, యీ పరిచయాలు 'ఊబి'లాగా మారకుండా మనం వాటిలో కూరుకుపోకుండా మనల్ని మనం కాపాడుకోగలగటం ఎంత అదృష్టం.

మధుర యిలాగేగా తెగిన గాలిపటం అయింది! ఆ కమల్ మాటలు, చేష్టలు గుర్తుకువచ్చాయి! అతను చూడటానికి బాగానే వున్నాడు! డబ్బుంది! చేతిలో కారుంది! వాటిని చేతిలో తాయిలంలా, ప్రతి ఆడపిల్లకీ చూపించి ఆశ పెడ్తుంటాడు! 'నువ్వు నా దానివి అయితే యివన్నీ నీవే' అని మాటలతో చెప్పకుండా, చేష్టలతో భ్రమలు కల్పిస్తాడు! వెర్రి ఆడపిల్లలు వలలో పడ్తారు! అతనేమీ వూరూ పేరూలేని ఆడపిల్లని చేసుకోడు! తన తండ్రి అంతస్థుకి తగ్గని వారిని, తన హోదా రెట్టింపు పెరిగే వ్యక్తి కూతురునీ తప్పక చేసుకుంటాడు! ఆ చేసుకున్న తర్వాత ఆ భార్యని కూడా తల్లిని వేధించినట్టే వేధిస్తాడు! అతను స్నేహితులతో ఎంత గొప్పగా, తల్లిని తను ఎలా బెదిరిస్తున్నాదో చెబుతున్నాడు! ఛి ఛీ! తలితండ్రులని ప్రేమించని వ్యక్తికి, అసలు ప్రేమంటే ఏమిటో తెలియదు! తలితండ్రుల 'ప్రేమ'ని బలహీనతగా భావించే వ్యక్తి ఇక జీవితంలో మిగతా వ్యక్తుల జీవితంతో జూదం ఆడటానికి వెనుదీయడు! మధుర జీవితం కళ్ళారా చూసిన నేను ఈ పాఠం మర్చిపోగలనా! మర్నాడు నర్మద నన్ను 'కమల్'తో సరిగ్గా ప్రవర్తించలేదని చివాట్లువేసింది.

"ఆ అమ్మాయి ఏమైనా అప్సరనా! నేను ఎత్తుకుపోతానని అనుకొందా! ఏదో నీ ఫ్రెండ్‌కదా అని లిఫ్టియిద్దామని అనుకున్నాను, 'పెద్ద ప్రతివ్రతలా కారులోనుంచి దూకి పరుగులు పెట్టింది.' అన్నాడట. నేను అందగత్తెని కాదని కమల్ అన్నందుకు నాకేం రోషం కలగలేదు!

నర్మదతో నా పరిచయం తుంచేసుకున్నాను నేను.

హాస్టల్లో రాత్రివేళ ఒంటరిగా పడుకొంటే, ఈ ఒంటరితనంతోనే నా జీవితం యిలాగే, యీ హాస్టల్లోనే తెల్లవారిపోతుందేమోనని భయంవేసేది! ఎంత ఏడుపు వచ్చేది!

ఎవరైనా సరే! ఆ వ్యక్తికి అందచందాలు అవసరంలేదు. ఆర్థికపరమైన స్తోమత అత్యధికంగా వుండనవసరంలేదు! ప్రాణంలా ప్రేమించమని కూడా అడగను! గౌరవాభిమానాలతో నాకు తోడు, నీడగా వుంటే చాలు! నా జీవితం అతనికి ఆనందంగా అర్పించుకుంటాను అనుకునేదాన్ని!

ఆ రోజు నేను 'బేబీ కేర్ సెంటర్'కి వచ్చాను.

"రూపాదేవి కోసం ఎవరో వచ్చారమ్మా!" ఆయా వచ్చి చెప్పింది.

"నేను చేతుల్లో పాపని దింపి ఆఫీసురూమ్‌లోకి అడుగుపెట్టాను. అక్కడ ఒకవ్యక్తి కూర్చుని వున్నాడు.

"ఎవరు కావాలి" అన్నాను.

అతను యిటు తిరిగాడు!

నేను ఒక్క నిముషం అలాగే నిలబడిపోయాను!

అతను నన్నే చూస్తున్నాడు! ఆ క్షణంలో నాకు తెలియలేదు! అదృష్ట దేవత, ఒకానొక అపరూపమైన వ్యక్తిని, నా జీవితప్రాంగణంలోకి పంపిందని! ఎందుకో ఆ క్షణంలో నాకు మనసు ఆనందంగా పురివిప్పిన నెమలిలా అనిపించింది.

*　　　*　　　*

ప్రియ భర్తముఖంమీదకి వంగుతూ, 'వికీ! ఆ వ్యక్తి ఎవరో తెలుసా!' అని అడిగింది.

"ఊహూ! తెలియదు! నువ్వు చెబితే నీ నోటినుంచి ఆ పేరు వినాలని వుంది." చెయిఎత్తి భార్య మెడచుట్టూ పెనవేస్తూ అన్నాడు.

"వికీ! అతని పేరు వికీ!_ అతను_" ప్రియ మాటలు పూర్తికాలేదు. "యింక చెప్పకు." అతని పెదవులు ఆమె నోటిమీద ఆనినాయి!

ప్రియ మెల్లగా అతన్ని విడిపించుకుంది.

"వికీ! పెళ్ళినాడే నువ్వు గడిచిన నీ 22 సంవత్సరాలలో ఏం చేసావు! ఎవరెవరు! నీ జీవితంలోకి వచ్చారు!" అని నేను అడగను అని వాగ్దానం చేసాను.

"అవును! గుర్తుంది. ఆ వాగ్దానం నేను ఎప్పుడైనా భంగం కలిగించానా!" అడిగాడు వికీ.

"లేదు. అందుకే మధుర సంగతి చెప్పలేదు."

"ఆమె సంగతి విన్నా వినకపోయినా, నాకేం తేడా కనిపించటంలేదే! అది మన అనురాగానికి అడ్డువచ్చేదేం కాదే!"

"అవును. తర్వాత మధుర ఒకసారి ఉత్తరం వ్రాసింది."

"ఏమని."

"యిస్తాను. నువ్వే చదువు."

ప్రియంవద లేచివెళ్లి బీరువాలో ఉత్తరంతెచ్చి భర్తకిచ్చింది.

వికీ భార్య ఒళ్ళో తలపెట్టుకుని పడుకొని అది చదవసాగాడు. (సశేషం)

---

Printed and Published by A. Chandra Sekar Rao at 5-9-88, Public Garden Road Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press Public Garden Road, Hyderabad-500 001. Editor : A. SUDHAKARA RAO

